# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

VEEKSHANAM, TELUGU MONTHLY

సంపుటి : 14 సంచిక : 12 హైదరాబాద్ 185 డిసెంబర్ 2016 పేజీలు : 68 రు. 20

- పెద్ద నోట్ల రద్దుపై ఏడు వ్యాసాలు
- ప్రజల సొమ్ము వాస్తు పాలు
- మైనింగ్ కోసం మారణకాండ
- భోపాల్ 'ఎన్‌కౌంటర్' ప్రశ్నలు
- బస్తర్ పోలీసు రాజ్యంపై టెలిగ్రాఫ్
- టాటాల ఎత్తులకు మిస్త్రీ చిత్తు
- అమెరికా శ్వేతసౌధంలో ట్రంప్

## పదిహేనో ఏట ప్రవేశిస్తున్న వీక్షణంను ఆదరించండి !
## పదిహేనో జన్మదిన ప్రత్యేక సంచికకు ఆర్థిక, హార్దిక సహకారం అందించండి !

వీక్షణం రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక 2003 జనవరి సంచికతో ప్రారంభమై, నిరాఘాటంగా 14 సంవత్సరాలు, 185 సంచికలు పూర్తి చేసుకుని 2017 జనవరిలో పదిహేనో సంవత్సరంలో ప్రవేశించబోతున్నది. ఇంతకాలం ఒక్క సంచిక కూడ తప్పకుండా వెలువడిన తెలుగు రాజకీయార్థిక, సామాజిక పత్రిక మరొకటి లేదు. విద్యావంతులనూ, బుద్ధిజీవులనూ, విద్యార్థులనూ, సామాజిక ఉద్యమాల కార్యకర్తలనూ విశేషంగా ఆకర్షించి వేలాది మందికి కరదీపికగా నిలిచిన వీక్షణం నిరంతరం సాగాలనే ఆకాంక్ష పాఠకుల నుంచి వెల్లువెత్తుతున్నది. ఆర్థిక సమస్యల వల్ల పత్రిక కొనసాగించడం కష్టం కావచ్చునని అనుమానించిన ప్రతి సందర్భంలోనూ తెలుగు సమాజం సాదరంగా ప్రతిస్పందిస్తున్నది. తెలుగు సమాజంలోని లబ్ధప్రతిష్ఠులైన మేధావులు, రచయితలు, ప్రజాసంఘాల నాయకులు వీక్షణం ఎప్పటికీ ఆగిపోకుండా ఆర్థిక సహాయం అందించమని ప్రజలకు విజ్ఞప్తి చేశారు. ఎందరో కొత్త చందాదారులు చేరుతున్నారు, ఇతరులను చేర్పిస్తున్నారు. ఎందరో దాతలు ముందుకు వచ్చి విరాళాలు అందిస్తున్నారు. అవకాశం ఉన్న మిత్రులు వీక్షణంను వ్యాపార ప్రకటనల రూపంలో ఆదుకుంటున్నారు. ఎన్ని ఇబ్బందులు, ఆటంకాలు, ఆర్థిక సమస్యలు ఎదురైనా ప్రజలకు అవసరమైన విషయాలను అందించడమే తన ఏకైక లక్ష్యంగా, ఒక ప్రత్యామ్నాయ సమాజ సంభాషణా వేదికగా వీక్షణం పద్నాలుగు సంవత్సరాలుగా నిరాటంకంగా సాగుతూ వస్తున్నది.

ఈ పద్నాలుగు సంవత్సరాలలో తెలుగు సమాజంలోని ఏడువందలకు పైగా మేధావులు, పరిశోధకులు, సామాజిక ఉద్యమాల కార్యకర్తలు, విద్యార్థులు, పాత్రికేయులు తమ అభిప్రాయాలను, వాదనలను వ్యాసాల రూపంలో పాఠకులతో పంచుకున్నారు. సమకాలీన ప్రాంతీయ, దేశీయ, అంతర్జాతీయ అంశాలపై, సైద్ధాంతిక అంశాలపై వీక్షణం మూడువేల ఐదు వందలకు పైగా వ్యాసాలు, చర్చలు ప్రచురించింది. ముఖ్యమైన, అవసరమైన అనువాద వ్యాసాలెన్నో ప్రచురించింది. వీక్షణంలో వ్యాసాలు రాసిన ఏడువందల మంది రచయితలలో దాదాపు మూడు వందల మంది వీక్షణం ద్వారానే వ్యాసరచనలో ప్రవేశించారు. తెలుగులో వ్యాసరచనా ప్రక్రియను అభివృద్ధి చేయడానికి వీక్షణం వ్యాసరచనా అధ్యయన తరగతులు నిర్వహించింది. వీక్షణం పుస్తక ప్రచురణ రంగంలో కూడ ప్రవేశించి ఒక దళారీ పశ్చాత్తాపం, Fifty Years of Andhra Pradesh 1956–2006, కొత్తచూపు, అభివృద్ధిని ఇలా చూద్దాం, వ్యవసాయం – ప్రపంచీకరణ, సమగ్ర తెలంగాణ వంటి జనాదరణ పొందిన పుస్తకాలెన్నో ప్రచురించింది. తెలుగు సమాజపు అనారోగ్యానికి అద్దం పట్టే అసహజ మరణాల సూచిని వీక్షణం పది సంవత్సరాలకు పైగా ప్రతినెలా ప్రకటిస్తున్నది. పరిశోధక విద్యార్థులకు, కళాశాల అధ్యాపకులకు ఉపయోగకరమైన ఐఎస్ఎస్ఎన్ ప్రమాణాన్ని సాధించిన అతి తక్కువ తెలుగు పత్రికలలో వీక్షణం ఒకటి. ఈ విశిష్ట పత్రికా ప్రయోగం, ఈ విజయాలు అన్నీ కూడ కేవలం పాఠకుల, అభిమానుల, రచయితల, మిత్రుల ఆదరణ వల్లనే సాధ్యమయ్యాయి.

పద్నాలుగు సంవత్సరాలు నిండి పదిహేనో సంవత్సరంలో ప్రవేశిస్తున్న సందర్భంగా వీక్షణం 2017 జనవరిలో ఎక్కువ పేజీలతో పదిహేనో జన్మదిన ప్రత్యేక సంచికగా వెలువడనుంది. ఈ సంచికలో మామూలుగా ఉండే సమకాలీన అంశాలపై వ్యాసాలతో పాటు, ప్రత్యేక వ్యాసాలు, అనువాదాలు కూడ ఉంటాయి. ఒక మాసపత్రికగా మాత్రమే కాక, చిరకాలం ఉంచుకోదగిన సంప్రదింపు గ్రంథంగా కూడ రూపుదిద్దుకుంటున్న ఈ ప్రత్యేక సంచికకు ఇతోధికంగా సహకరించ వలసిందిగా పాఠకులనూ, అభిమానులనూ, మిత్రులనూ, విరాళాలు, వ్యాపార ప్రకటనలు ఇవ్వగలిగిన దాతలనూ, ఇప్పించగలిగిన మిత్రులనూ అభ్యర్థిస్తున్నాం.

- **వీక్షణం పదిహేనో ఏట ప్రవేశిస్తున్న సందర్భంగా ప్రత్యేక చందాలు చేర్పించండి. మరింత మంది పాఠకుల దగ్గరికి వీక్షణంను చేర్చండి.**
- **మిత్రులకూ, గ్రంథాలయాలకూ, కళాశాలలకూ, కార్యాలయాలకూ వీక్షణం చందాను కానుకగా ఇవ్వండి.**
- **మీ గ్రామాలలో, పట్టణాలలో వీక్షణం విడి ప్రతులు అమ్మిపెట్టడానికి న్యూస్ ఏజెంట్లను సమకూర్చండి.**
- **వీక్షణం మూలనిధికి విరాళాలు ఇవ్వండి, దాతల దగ్గర విరాళాలు సేకరించండి.**
- **వీక్షణం జనవరి 2017 ప్రత్యేక సంచిక కోసం వ్యాపార ప్రకటనలు ఇవ్వండి, సేకరించండి.**

**వీక్షణం మీ పత్రిక, ఆదుకోవలసింది మీరే!**
**పదికాలాలు నిలబెట్టవలసింది మీరే!!**

185 ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

డిసెంబర్ 2016
సంపుటి : 14
సంచిక : 12




- ❖ పాఠకుల వీక్షణం — 4
- ❖ సంపాదకీయం — ◆ సామ్రాజ్యవాద దాస్యానికి, ప్రజావ్యతిరేకతకు ప్రబల నిదర్శనం — 5
- ❖ సంపాదకీయ వ్యాఖ్యలు — ◆ రాజ్యాంగ వ్యతిరేక హిందూ బ్రాహ్మణీయ రాష్ట్రం ◆ ప్రశ్నను పాతిపెడతామంటున్న పాలకులు — 6
  - ◆ అమెరికా అధ్యక్ష పీఠంపై ట్రంప్ — 7
- ❖ కొత్త పుస్తకాలు / సి.డి.లు — 8
- ❖ దేశీయం — పెద్ద నోట్ల రద్దు – అబద్ధాలూ అక్రమాలూ అగచాట్లూ — ఎన్. వేణుగోపాల్ — 9
- ❖ " — కష్టాల కడలిలో ప్రజలు — డా. కత్తి పద్మారావు — 15
- ❖ " — పెద్ద నోట్ల రద్దు – కుదేలైన పేదలు — వై.ఎచ్.కె. మోహన్‌రావు — 17
- ❖ " — పెద్ద నోట్ల రద్దు – నల్లధనం వెలికితీత? — పి. పోలేశ్వరరావు — 19
- ❖ " — నల్ల ధనంతో ప్రధాని అయిన మోడీ — వి. హనుమంత రావు — 20
- ❖ " — ఆర్థిక సంక్షోభం దిశగా భారత్ — షేక్ కరిముల్లా — 22
- ❖ " — 'నల్లధనం' కంటె 'తెల్లధనం' ప్రమాదకరం — పి. ప్రసాద్ — 24
- ❖ " — ఈ సంచలనాత్మక చర్య ప్రభావం శూన్యం — ఆర్. కవితా రావు — 28
- ❖ సంస్మరణ — ఫిడెల్ కాస్ట్రో — 30
- ❖ ప్రాంతీయం — ప్రజల సొమ్ము వాస్తు పాలు — బైరెడ్డి సతీష్ — 31
- ❖ దేశీయం — టాటాల ఎత్తులకు మిస్త్రీ చిత్తు — డా. ఎ. పున్నయ్య — 33
- ❖ " — భోపాల్ ఎన్‌కౌంటర్ వేస్తున్న ప్రశ్నలు — సంతోష్ — 36
- ❖ " — బస్తర్ పోలీసు రాజ్యంపై టెలిగ్రాఫ్ — సోనియా సర్కార్ — 39
- ❖ " — మైనింగ్ కోసం మారణకాండ — అరణ్య — 41
- ❖ అంతర్జాతీయం — శ్వేత సౌధంలో ట్రంప్ – ఆసక్తి, ఆందోళన — ఎ. నర్సింహా రెడ్డి — 45
- ❖ దేశీయం — రాజ్యమే నిరసనకు పూనుకుంటే...! — ఎం.కె. కుమార్ — 48
- ❖ " — పాలకుల వైఫల్యానికి ఉద్రిక్తతలే సాక్ష్యం — జహంగీర్ — 51
- ❖ " — నియమబద్ధ ప్రజాస్వామ్యం కోసం పోరాటం — ఎచ్. వాగీశ్ — 55
- ❖ " — ముస్లిం మహిళలు – తలాక్ — చిమ్మె జాన్ బర్నబాస్ — 58
- ❖ ఈనెల — వై. రామచంద్రం — 60
- ❖ ఇరుగు-పొరుగు — వై. రామచంద్రం — 61
- ❖ భూగోళం — సి. రాజశేఖర్ — 62
- ❖ సంస్థాగతం — వీక్షణం 2016 సూచిక — 63
- ❖ అసహజ మరణాలు — ఎస్. వెంకటేష్ — 66




'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా

**వీక్షణం** VEEKSHANAM

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : **చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 20 | రు. 20 |
| సంవత్సరం | రు. 240 | రు. 200 |
| మూడు సంవత్సరాలు | రు. 600 | రు. 540 |
| ఐదు సంవత్సరాలు | రు. 1000 | రు. 900 |
| పది సంవత్సరాలు | రు. 2000 | రు. 1700 |

ఆన్‌లైన్ ద్వారా డబ్బులు పంపేవారు మాత్రమే బ్యాంక్ స్లిప్‌లపై 'VEEKSHANAM' అని రాసి వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

***వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో మూలనిధికి 2016 నవంబర్ నెలలో వచ్చిన విరాళాలు - ఎస్. లక్ష్మారెడ్డి, గుంటూరు - రు. 5,000; శర్మ, హైదరాబాద్ - రు. 5,000, అమెరికా నుండి శ్రేయోభిలాషి - రు. 10,000, కె. సుభాషిణి, కర్నూలు - రు. 2,000. మిత్రులకు కృతజ్ఞతలు - సం.***

*వీక్షణం నవంబర్ సంచికలో తెలంగాణలో జిల్లాల పునర్విభజనపై వచ్చిన వ్యాసాలు బాగున్నాయి. జిల్లా విభజన వల్ల జరిగే ప్రయోజనాలు, ఆ ఫలితాలు అందుకునేది ఎవరో వివరణాత్మకంగా రచయితలు చెప్పారు. తెలంగాణ వ్యాప్తంగా జిల్లాల విభజన తరువాత వచ్చిన భౌగోళిక, సామాజిక గణాంకాల మార్పులను కూడా ప్రచురిస్తే ఉపయోగకరంగా ఉంటుంది.*

**- బి. నాగరాజు**
*హైదరాబాదు*

*నవంబర్ సంచికలో వచ్చిన 'బాక్సైట్ తవ్వకాల కోసం మారణకాండ' వ్యాసం చదివిన తరువాత రాజ్యం చేస్తున్న దుర్మార్గాలను తలచుకుంటేనే భయం వేస్తోంది. ఇది ఎక్కడికి దారితీస్తుందోననే ఆందోళన పెరుగుతోంది. ఖనిజ వనరుల కోసం ఆదివాసులను, వారి వైపు ఉండి పోరాడుతున్న మావోయిస్టులను అతి కిరాతకంగా చంపిన పోలీసులను, వారికి అండగా ఉన్న ప్రభుత్వాన్ని ప్రశ్నించకుండా సమాజం ఎటు వైపు పురోగమిస్తుందో ఆలోచిస్తుంటే మనం ప్రజాస్వామ్య దేశంలో ఉన్నామా? లేక రాచరిక పాలనలో ఉన్నామా? అనే సందేహం కలుగుతోంది. ఇలాంటి సంఘటనలపై మౌనంగా ఉంటే రేపు రేపు మన వరకు వచ్చే అవకాశం ఎంతో దూరంలో లేదనే విషయాన్ని సమాజం గుర్తించాలి. దేశ వనరులను కాపాడుకోవాల్సిన బాధ్యత మనందరిపై ఉంది. అది ఆదివాసులకే కాదు మన భవిష్యత్ తరాలకు అందించాల్సిన బాధ్యత మనపై ఉంది. ఇందుకు మనందరం గొంతు విప్పాల్సిన సమయం ఆసన్నమైంది.*

**- పి. వెంకటేశ్వర్లు**
*ఖమ్మం*

*వీక్షణం నవంబర్ సంచికలో రాయలసీమ రచయితల సమావేశం నిర్వహించిన వివరాలను చూశాను. వీక్షణం ప్రజాస్వామిక స్ఫూర్తిని అభినందించలేక ఉండలేకపోతున్నాను. రాయలసీమ రచయితలు, పాఠకులు, అభిమానులు పాల్గొని పత్రిక చేస్తున్న కృషిని అభినందించారు. తెలుగు సమాజంలో ప్రజాస్వామిక గొంతు వినిపించే పత్రికలు చాలా అరుదుగా వస్తున్నాయని, అందులో ప్రముఖంగా వీక్షణం. ఇలాంటి పత్రికలను అక్కున చేర్చుకోవాలనే స్ఫూర్తిని వ్యక్తం చేశారు. ఇలాంటి సమావేశాలు ఇతర ప్రాంతాల్లో కూడా నిర్వహిస్తే పాఠకులకు, అలాగే పత్రికను కొత్త పాఠకులను తయారు చేసుకోవడానికి ఉపయోగపడుతుంది. ముఖ్యంగా రాయలసీమ రచయితల సమావేశంలో ప్రజల గొంతు వినిపించడానికి వీక్షణం పత్రిక వేదిక కావాలని కోరుకుంటున్నాను.*

**- కె. సుదర్శన్**
*కరీంనగర్*



## ఆర్.ఎస్. రావు స్మారక సదస్సు

ఆర్.ఎస్. రావు ఐదవ స్మారక సదస్సు నవంబర్ 12, శనివారం, ఉదయం 10 గంటల నుంచి మధ్యాహ్నం 2 గంటల వరకు బాగ్‌లింగంపల్లిలోని సుందరయ్య విజ్ఞాన కేంద్రం, షోయెబ్ హాల్‌లో జరిగింది. ఈ సదస్సుకు ప్రొ. హరగోపాల్ అధ్యక్షత వహించారు. ఈ సదస్సులో ఢిల్లీ యూనివర్సిటీ ప్రొ. జి.ఎన్ సాయిబాబా అనివార్య కారణాల వల్ల రాకపోవడంతో ఆయన 'భారతీయాంగ్ల నవలల్లో సమాజ చిత్రణ: ఉత్పత్తి సంబంధాల చర్చ కొనసాగింపు' పత్రాన్ని వీక్షణం సంపాదకులు ఎన్. వేణుగోపాల్ సమర్పించారు. 'తెలంగాణలో మారుతున్న భూసంబంధాలు' – నలమాస కృష్ణ; 'భూసంబంధాలలో మార్పు – ఒక గ్రామ అధ్యయనం' – వై. భాస్కర్ తమ పత్రాలను సమర్పించారు. ఈ కార్యక్రమానికి తెలుగు రాష్ట్రాలలోని ఆర్ఎస్ రావు మిత్రులు, వీక్షణం పాఠకులు దాదాపు యాభై మంది వరకు హాజరై చర్చలో పాల్గొన్నారు.

*గత నవంబర్ సంచికలో 'బియాండ్ ఇంక్లూషన్' పుస్తకంపై డా. నళినీ చేసిన సమీక్షలో పుస్తకం వివరాలు ప్రకటించలేదు. పొరపాటుకు చింతిస్తున్నాం. – సం.*




**బియాండ్ ఇన్‌క్లూషన్,** ది ప్రాక్టీస్ ఆఫ్ ఈక్వల్ యాక్సెస్ ఇన్ ఇండియన్ హైయ్యర్ ఎడ్యుకేషన్
సంపాదకులు: సతీష్ దేశ్‌పాండే, ఉషా జచారియస్
రూట్‌లెడ్జ్ ప్రచురణ, పేజీలు: 352, వెల: రు. 695,
ప్రతులకు: రూట్‌లెడ్జ్, 912, టాల్‌స్టాయ్ హౌజ్, 15–17, టాల్‌స్టాయ్ మార్గ్, కానౌట్ ప్లేస్, న్యూఢిల్లీ – 110 001

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎం. రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్;

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత; విశాఖపట్నం – పి.వి. రమణ

*(ఈ సంచికలోని హైదరాబాద్, రంగారెడ్డి, నిజామాబాద్, వరంగల్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్నవారు ఎస్. వెంకటేశ్)*

వీక్షణం

# సామ్రాజ్యవాద దాస్యానికి, ప్రజావ్యతిరేకతకు ప్రబల నిదర్శనం

మంత్రివర్గంలో చర్చ లేదు, అత్యున్నతాధికార సంస్థ రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియాకు, సంబంధిత శాఖలకు ఎటువంటి సమాచారం లేదు, కేవలం ప్రధానమంత్రి నరేంద్ర మోడీ తానే అందరినీ మించిన మొనగాడని చూపుకోవడానికి పెద్ద నోట్ల రద్దు నిర్ణయం ప్రకటించాడు. ఆ నిర్ణయం దేశ ప్రజానీకాన్నీ, ఆర్థికవ్యవస్థనూ అల్లకల్లోలం చేసింది. ప్రకటిత లక్ష్యాలు ఆదర్శవంతమైనవి గనుక వాటిని నమ్మి ఈ చర్య మంచిదేనని మొదట భావించినవాళ్లకు కూడ రెండు వారాలు గడిచేసరికి జరుగుతున్న బీభత్సం అర్థమైంది. నిర్ణయం మంచిదే గాని అమలు సరిగా లేదని, ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేయవలసిందని, తుగ్లక్ చర్య అని సన్నాయి నొక్కులు వినబడుతున్నాయి. నరేంద్ర మోడీ అనాలోచితంగానో, తెలివితక్కువగానో, తీవ్ర పర్యవసానాలు ఊహించకనో ఈ చర్య తీసుకున్నాడని కొందరు భావిస్తున్నారు. ఆ కోణాలు కూడ ఉండవచ్చు గాని అవి ప్రధానమైనవి కావు. ఈ బృహత్తరమైన, సంచలనాత్మకమైన, దేశ ప్రజలపై పిడుగుపాటు లాంటి చర్యకు ప్రధాన కారణాలు: ఒకటి, సామ్రాజ్యవాద ద్రవ్య సంస్థల, బహుళ జాతి సంస్థల ఆదేశాలను అక్షరాలా ఔదలదాల్చడం, రెండు, పనిలో పనిగా తన ఆశ్రితులకు, దేశంలోని భిన్న పాలకవర్గ ముఠాలకూ ఎంగిలి మెతుకులు రాలే ప్రయోజనాలు చేకూర్చడం, మూడు, ప్రజల వోట్లతో అధికారానికి వచ్చి, ప్రజల పేరు మీద పాలన సాగిస్తున్నప్పటికీ తమకు ప్రజల పట్ల ఎటువంటి దాక్షిణ్యం లేదని మరొకసారి బలంగా ప్రకటించడం. ఈ మూడు అప్రకటిత లక్ష్యాలను దాచి, మోడీ భావోద్వేగ పూరిత ఉపన్యాసంలో 'నల్లధనం' రద్దు, నకిలీ కరెన్సీ రద్దు, అవినీతి రద్దు అనే మరో మూడు లక్ష్యాలు ప్రకటించాడు. ఆ మూడు ప్రకటిత లక్ష్యాలూ ప్రజలను భ్రమల్లో ముంచడానికే తప్ప ఈ చర్య వల్ల ఆ లక్ష్యాలు నెరవేరేదీ లేదు, నెరవేరాలని ఈ పాలకవర్గాలకు, ముఖ్యంగా మోడీకి కోరికా లేదు.

భారత ఆర్థిక వ్యవస్థను సామ్రాజ్యవాద, అంతర్జాతీయ ద్రవ్య వ్యాపార, బహుళ జాతి సంస్థల రథచక్రాలకు కట్టివేయాలని పాలకవర్గాలు గత ఇరవై ఐదు సంవత్సరాలుగా ఎంత తీవ్రంగా ప్రయత్నిస్తున్నప్పటికీ, ఈ సమాజపు వైశాల్యం వల్ల, సంక్లిష్టత వల్ల, వైవిధ్యం వల్ల అది సాధ్యం కావడం లేదు. ఇరవై, ఇరవై ఐదు కోట్ల మధ్యతరగతిని తమ గుప్పిట్లోకి తెచ్చుకున్నా అదే పెద్ద మార్కెట్ అని, మిగిలిన భారత సమాజం ఏమైపోయినా ఫరవాలేదని బహుళ జాతి సంస్థలు స్పష్టంగానే అన్నాయి. కాని ఆ మధ్యతరగతి కూడ మొత్తంగా అంతర్జాతీయ ద్రవ్య వ్యాపార సాలెగూటిలోకి చేరలేదు. ఎప్పటికైనా మొత్తం ఆర్థిక వ్యవస్థను తన నెట్టింట్లో కట్టేసుకోవాలని బహుళ జాతి సంస్థల ప్రయత్నం. ఏ ఆర్థిక వ్యవస్థయినా ఆ సాలెగూటిలో చిక్కి గిలగిలలాడాలంటే ఏకైక మార్గం ఆ ఆర్థిక వ్యవస్థలోని అన్ని పరిణామాలూ బహుళజాతి సంస్థల కనుసన్నల్లో నమోదు కావాలి, సంఘటిత రంగంలో మాత్రమే జరగాలి, ఎవరు ఏ సరుకు వాడుతున్నారో, కొంటున్నారో, అమ్ముతున్నారో, ఏమి చేస్తున్నారో ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం ద్వారా తన డాటాబేస్ లో చేరాలి. అలా తన సాలెగూటిలో చిక్కినవారి వినియోగసరళిని, ఆలోచనాసరళిని, జీవనసరళిని నియంత్రించడం, ఎక్కడ ఏ అవసరం తలెత్తినా అది డాలర్‌గా మారి తన గల్లాపెట్టెలో మోగడం, మళ్లీ ఒకసారి రవి అస్తమించని సామ్రాజ్యం ఏర్పడడం సామ్రాజ్యవాద సంస్థల లక్ష్యం. అందుకే డిజిటలైజేషన్, కాష్ లెస్ ఎకానమీ కావాలి. అవి కావాలంటే మొదట ప్రజల చేతుల్లో ఉన్న డబ్బులు ఊడగొట్టాలి. భౌతికమైన డబ్బుతో అవసరాలు తీర్చుకునే ప్రజల అలవాట్లను ధ్వంసం చేయాలి. వారికి ప్లాస్టిక్ మనీ, డబ్బేతర లావాదేవీలు అలవాటు చేయాలి. 'నల్లధనం' మీద, అవినీతి మీద ప్రజలలో ఉన్న కోపావేశాలను వాడుకుని వారికి తెలియకుండానే ఈ దుర్మార్గానికి సన్నద్ధులను చేయాలి. ఇదీ సామ్రాజ్యవాద, ద్రవ్య పెట్టుబడి ఆదేశం. ఆ ఆదేశాన్ని అక్షరాలా పాటించడానికే మోడీ ఎత్తుగడ.

స్వామికార్యంలోనే స్వకార్యం చూసుకోవాలనే హిందూ బ్రాహ్మణీయ ధర్మాన్ని నరనరాన జీర్ణించుకున్న సంఘ్ పరివార్ ప్రతినిధి మోడీ సామ్రాజ్యవాదులకు దాసోహం అంటూ వారు చెప్పిన పని చేస్తూనే, పనిలో పనిగా దేశీయ దళారీలకు, బడా పెట్టుబడిదారులకు, భూస్వాములకు, పెత్తందార్లకు మేలు చేయదలిచాడు. వారికి బంగారు గుడ్లు పెట్టే బాతుగా ఎన్నో దశాబ్దాలుగా, రుణాల పేరు మీద వేల కోట్ల రూపాయల ప్రజాధనం కట్టబెడుతూ, ఆ రుణాలను మాఫీ చేస్తూ వస్తున్న ప్రభుత్వ రంగ బ్యాంకులు దివాళా ఎత్తాయి గనుక పెద్ద నోట్ల రద్దు నిర్ణయంతో వాటిని మళ్లీ నింపి మళ్లీ ఒకసారి రుణాల పందారాలకు తలుపులు బార్లా తెరవడం రెండో ప్రయోజనం.

అటు సామ్రాజ్యవాదులకు జీ హుజూర్ జో హుకుం అంటూ దేశ వనరులను వారికి అప్పగించడమైనా, ఇటు దేశీయ దోపిడీదారులకు సమాజ సంపదను అప్పగించడమైనా దారుణమైన ప్రజావ్యతిరేక చర్యలనీ, వలసవ్యతిరేక ప్రజా పోరాట ఆదర్శాలకు వ్యతిరేకమనీ, భారత ప్రజలు తమకు తాము రాసి ఇచ్చుకున్న రాజ్యాంగంలోని ప్రవేశికకూ, ఆదేశిక సూత్రాలకూ ఉల్లంఘనలనీ పాలకవర్గాలకు తెలుసు. కాని ప్రాతినిధ్య ప్రజాస్వామ్యాన్ని ఎన్నికల తంతుగా మార్చి, ఒకసారి నెగ్గితే ఐదు సంవత్సరాలు ఎన్ని దుర్మార్గాలకు పాల్పడినా ప్రజల ఆమోదం ఉన్నట్టేననే తప్పుడు నిర్వచనాలతో పాలన సాగిస్తున్నారు. ప్రజల చేత, ప్రజల కొరకు, ప్రజల వల్ల జరగవలసిన ప్రజాస్వామిక పాలనను ప్రజల నుంచి దూరంగా, ప్రజావ్యతిరేకంగా, ప్రజలమీద దమనకాండతో సాగించడమే అలవాటు చేసుకున్నారు. పెద్దనోట్ల రద్దు ప్రజల మీద తుపాకులు ఉపయోగించకుండా సాగిస్తున్న హింసాకాండ తప్ప మరేమీ కాదు.

భారతీయ జనతా పార్టీ నేతృత్వంలోని నేషనల్ డెమొక్రటిక్ అలయన్స్ ప్రభుత్వం ఈ దమనకాండ సాగించినప్పటికీ, ఇతర పార్లమెంటరీ పక్షాలు ఇవాళ ప్రజలపట్ల ప్రేమ ఉన్నట్టు నటిస్తూ ఆక్రోశ దినాలు, బంద్ లు పాటిస్తున్నప్పటికీ ఈ మూడు లక్ష్యాలను అమలు చేయడంలో అన్ని పార్లమెంటరీ రాజకీయ పార్టీలూ ఒకటే. ఒక్క తానులో ముక్కలే. ఈ పాలకవర్గ ముఠాలన్నిటినీ రద్దు చేయడమే, వారివల్ల బలపడుతున్న 'నల్లధనాన్ని', అవినీతిని రద్దు చేయడానికి మార్గం సుగమం చేస్తుందనీ, 'నల్లధనం', అవినీతి అరికట్టడానికి ఏ చిట్కా వైద్యాలూ లేవని ప్రజలకు తెలియజేయడమే ఇవాళ బుద్ధిజీవుల కర్తవ్యం. వీ

సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# రాజ్యాంగ వ్యతిరేక హిందూ బ్రాహ్మణీయ రాష్ట్రం

రానున్నది భౌగోళిక తెలంగాణనా, సామాజిక తెలంగాణనా, ప్రజా తెలంగాణనా, ప్రజాస్వామిక తెలంగాణనా అని ఉద్యమ సమయంలో చర్చోపచర్చలు జరుగుతుండేవి. రెండున్నరేళ్ల తర్వాత చూస్తే రాజ్యాంగ వ్యతిరేక హిందూ బ్రాహ్మణీయ తెలంగాణ ఏర్పడిందనడానికి రుజువులు కనబడుతున్నాయి. గోదావరి, కృష్ణ పుష్కరాలు, యాదాద్రి వంటివి లౌకికత్వానికి వ్యతిరేకమైనవే అయినా కనీసం ప్రజలు పాల్గొంటున్నందువల్ల ప్రజల సౌకర్యాలు చూడడానికి ప్రభుత్వం అక్కడికి వెళ్లవలసి ఉంటుందనుకోవచ్చు. చండీయాగం, ఇతర యాగాలు ఎంత వ్యక్తిగతమని చెప్పుకున్నా ప్రభుత్వ యంత్రాంగం వినియోగం, ప్రజాధనం వెచ్చించడం జరిగింది గనుక అవి రాజ్యాంగ స్ఫూర్తికి పూర్తిగా వ్యతిరేకమైనవి. తెలంగాణ వస్తే దేవుడికి కానుకలిస్తానని ఒక వ్యక్తి మొక్కుకుంటే, అది ఆ వ్యక్తి విశ్వాసం అనుకోవచ్చు, తన కోరిక నెరవేరినందుకు ఆ వ్యక్తి మొక్కు తీర్చుకోవచ్చు. కాని ఆ వ్యక్తి ముఖ్యమంత్రి అయినంత మాత్రాన ఆ మొక్కు తీర్చడానికి ప్రజాధనం వినియోగించడం ప్రజాస్వామిక పాలనకు, రాజ్యాంగ స్ఫూర్తికి వ్యతిరేకం. ఆ మొక్కులు కూడ తెలంగాణలో ఉన్న దేవుళ్లందరికీ అయిపోయాయి. ఇంతకాలం ఏ తిరుపతిని ఇతర ప్రాంతానిదిగా అభివర్ణించి, దానికి పోటీగా తెలంగాణలో మరొక స్థలాన్ని అభివృద్ధి చేస్తామని చెపుతూవచ్చారో, ఆ తిరుపతికే తెలంగాణ ప్రజాధనం ఐదుకోట్ల రూపాయలు వెచ్చించడమంటే ఇది పూర్తిగా రాచరిక ఇష్టారాజ్య పాలనే తప్ప లౌకిక, ప్రజాస్వామిక పాలన కాజాలదు. ప్రభుత్వాధినేతలు, రాజ్యాంగబద్ధ పదవిలో ఉన్న వ్యక్తులు ఇలా ప్రభుత్వ విధినీ, రాజ్యాంగ స్ఫూర్తినీ ఉల్లంఘించడం గతంలో కూడ జరిగినదే. కాని ఇతరులు చేస్తే తప్పు అయినది మనవాడు చేస్తే ఒప్పు కాదు. పైగా ఈ ఏలిక ప్రజాఉద్యమ ఫలితంగా వచ్చాడనీ, ఈ రాష్ట్రం గొప్ప ప్రజా ఉద్యమ సంప్రదాయాన్ని, వారసత్వాన్ని కలిగి ఉన్నదనీ చెప్పుకునేటప్పుడు ఈ ఏలిక పనిని మరింత విమర్శనాత్మకంగా చూడవలసి వస్తుంది. ఈ రెండున్నరేళ్ల హిందూ బ్రాహ్మణీయ తతంగాలకు పరాకాష్టగా ముఖ్యమంత్రి అధికార నివాస భవనంలో గృహప్రవేశ తంతు పూర్తిగా అభ్యంతరకరంగా, రాజ్యాంగ వ్యతిరేకంగా సాగింది. తెలంగాణ ప్రభుత్వం ముందర అత్యవసరమైన ప్రజా కార్యక్రమాలు, నిధులు కేటాయించవలసిన అవసరాలు ఎన్నో ఉండగా ముఖ్యమంత్రి అధికార నివాస భవనాన్ని అంత ఖర్చుతో అంత విలాసవంతంగా నిర్మించడం ఒక ఎత్తయితే, ఆ భవనంలోని ముఖ్యమంత్రి కార్యాలయంలో, ముఖ్యమంత్రి అధికారిక ఆసనంలో ఒక మఠాధిపతిని కూచోబెట్టడం అనుచితం, అర్థరహితం, అక్రమం. అది అతిథిని కూచోబెట్టడానికి ఒక వ్యక్తి సొంత ఆసనం కాదు, అధికారిక భవనంలోని అధికారిక ఆసనం. ఆ కుర్చీ మీద కూచునే అర్హత ఎన్నికల్లో ప్రజల ఆమోదాన్ని పొంది, శాసనసభలో అత్యధిక స్థానాలు గెలిచిన పార్టీ నాయకుడుగా ఎన్నికైన వ్యక్తికి మాత్రమే ఉంటుంది. ఇది ఒక సాధారణ పాలనా నియమం. దీన్ని ఉల్లంఘించడం మాత్రమే కాక, ఉల్లంఘనను ప్రశ్నించినవారి మీద దాడులు, నిందలు, దుర్భాషలు సాగించే స్థాయికి తెలంగాణలో బుద్ధిజీవులలో ఒక వర్గం చేరిందంటే తెలంగాణ సమాజం ఎటు పోతున్నదో తీవ్రంగా ఆలోచించవలసిన సమయం వచ్చినట్టే. వీ

సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# ప్రశ్నను పాతిపెడతామంటున్న పాలకులు

రాష్ట్ర విభజన తర్వాత మిగిలిన ఆంధ్రప్రదేశ్‌లో పాలన, పౌర సమాజం చాల విచిత్రమైన స్థితిలో పడ్డాయి. ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు పాలన ఎలా ఉండబోతుందో గత పాలన అనుభవం నుంచి చాలమంది ఊహించారు గాని, పౌరసమాజం స్థితి, పౌరసమాజం పట్ల ప్రభుత్వం వ్యవహరించబోయే తీరు ఎక్కువమందికి ఊహకు అందినట్టు లేవు. పాత ఆంధ్రప్రదేశ్ లో కోస్తా, రాయలసీమ జిల్లాల నుంచి పౌరసమాజ నాయకులు, మేధావులు, సామాజిక వ్యాఖ్యాతలు రాజధాని హైదరాబాద్ కు తరలివచ్చి, ఎక్కువమంది హైదరాబాద్ లోనే స్థిరపడ్డారు. రాష్ట్ర విభజన తర్వాత కొత్త ఆంధ్రప్రదేశ్ కు వారిలో చాల మంది తిరిగివెళ్లలేదు. కొత్త రాష్ట్రంలో, కొత్త రాజధానిలో ఒక కొత్త పౌరసమాజ నిర్మాణం జరిగి ఉండవలసింది గాని ఏ కారణం వల్లనో అది ఇంకా సక్రమంగా జరగలేదు. మరొకవైపు ముఖ్యమంత్రి, ప్రభుత్వం తమకు గతంలో అలవాటయిన ప్రజావ్యతిరేక పాలననే కొనసాగిస్తూ, ఇంకా ఉధృతంగా సాగిస్తూ ఉన్నప్పుడు, ఆ విధానాలను, అమలును ఖండించవలసిన, వ్యతిరేకంగా ప్రజలను సంఘటితం చేసి, ఉద్యమాలు నడపవలసిన, ప్రభుత్వం మీద ఒత్తిడి తేవలసిన పౌరసమాజం అవసరం నానాటికీ పెరుగుతూ వస్తున్నది. పాలన మీద ప్రశ్నలను సహించబోమని, పౌరసమాజం తలెత్తడానికి చేసే ప్రయత్నాలను మొగ్గలోనే తుంచివేస్తామని ఆంధ్ర ప్రదేశ్ పాలకులు అనేక రూపాల్లో ప్రకటిస్తూ ఉన్నారు. ప్రశ్నించేవారి పట్ల గత పాలనలో కంటె ఎక్కువ దమననీతి అమలు జరుపుతాం అని పాలకులు ప్రమాణస్వీకారం రోజు నుంచే ప్రత్యక్షంగా, పరోక్షంగా ప్రకటించడం ప్రారంభించారు. రాజధాని అమరావతి నిర్మాణంలో జరిగిన అవకతవకల గురించి ప్రశ్నించడానికి వీలులేని స్థితి కల్పించడంతో ఈ నిశ్శబ్ద దమనకాండ పెరిగిపోయింది. సభలకు, సమావేశాలకు అనుమతి ఇవ్వకపోవడం, పత్రికాసమావేశాలు జరపనివ్వకపోవడం, ప్రశ్నించేవారి మీద ప్రచారసాధనాలలో అబద్ధ ప్రచారాలు సాగించి, వారి విశ్వసనీయతను దెబ్బతీయడం వంటి చర్యలన్నీ వరుసగా సాగుతూ వచ్చాయి. చివరికి రాజధాని నిర్మాణంలో పొరపాట్లను ఎత్తిచూపుతూ నిరసన తెలిపేవారిని అరెస్టు చేస్తాం అని స్వయంగా ముఖ్యమంత్రి, డిజిపి బెదిరించారు. నిరసన తెలిపే హక్కు ఉండడమే ప్రజాస్వామ్య పాలనకు ఒక చిహ్నం. కాని ఆ చిహ్నాన్ని ఉండనివ్వబోమని, అంటే తమది ప్రజాస్వామ్య పాలన కాదని స్వయంగా, బహిరంగంగా, నిస్సిగ్గుగా ప్రకటించగలిగిన పాలకులు వచ్చారన్నమాట. ఈ చర్యల కొనసాగింపుగా, మరొక అడుగు ముందుకు వేసినట్టుగా, ఈ నెల విశాఖపట్నం, కడప, కర్నూలు, గుంటూరు వంటి అనేక చోట్ల ప్రభుత్వ దుర్మార్గపు ఎన్ కౌంటర్ హత్యల మీద శాంతియుత నిరసన ప్రదర్శనలు జరుగుతుంటే, నిరసనకారులకు వ్యతిరేకంగా, అంటే హత్యలకు అనుకూలంగా సాధారణ దుస్తుల పోలీసులతో, కిరాయిమూకలతో ప్రదర్శనలు జరిపించే కొత్త సంస్కృతికి ఆంధ్రప్రదేశ్ పాలకులు తెరతీశారు. ప్రజావ్యతిరేక పాలన నడుపుతూ, ప్రజల నిరసనను అడ్డుకుంటూ, ప్రజలను చీలదీసి అంతర్యుద్ధాన్ని సృష్టించడానికి ప్రయత్నిస్తున్న ఈ కుటిలనీతిని అడ్డుకోవడానికి ప్రజలు సంఘటితమై, పౌరసమాజం బలోపేతమై ప్రతిఘటించడం తప్ప మరో మార్గం లేదు. వీ

# అమెరికా అధ్యక్ష పీఠంపై ట్రంప్

– రాజేంద్రబాబు అర్విణి

**ఆ**కలి తీరిన పులి ట్రంప్. ధనదాహంతో కోటాను కోట్ల డాలర్లను దిగమింగిన ట్రంప్, ఇప్పుడు అధికార దాహం తీర్చుకున్నాడు. అమెరికాలో ప్రజాస్వామ్యం పరిఢవిల్లుతున్నదని భ్రమలో ఉన్న ప్రపంచ దేశాల (ముఖ్యంగా భారతదేశంలోని) మధ్యతరగతి ప్రజలకు ఆ దేశ అధ్యక్షునిగా ట్రంప్ ఎన్నిక కావడంతో అమెరికా ప్రజల విజ్ఞతపై నమ్మకం సడలిపోయింది. అగ్రరాజ్యంగా పేరున్న అమెరికాకు దిశా నిర్దేశం చేసే సామర్థ్యం డెమోక్రటిక్ పార్టీ అభ్యర్థి హిల్లరీ క్లింటన్‌కు ఉన్నదని ఓటర్లు నమ్మకపోయినా అసభ్యత, వాచాలత్వం, మైనార్టీ వర్గాలపై ద్వేష భావం, దేశాంతర జనాభా (ఇమిగ్రెంట్స్) పట్ల అమానవీయ వైఖరి కలిగిన ట్రంప్ వైపు మొగ్గరని మీడియా, ప్రపంచ ప్రజలూ భావించారు. కానీ లోకం అటుపైపే తిరిగింది. అందుకు ప్రధాన కారణం ఈ ఎన్నికల్లో అమెరికాలోని నేర పరిశోధక సంస్థ ఎఫ్‌బిఐ నిర్వహించిన పాత్రయే అని చెప్పక తప్పదు. ఎఫ్‌బిఐ అమెరికాలో ప్రజాస్వామ్యాన్ని పరిహసించింది. 2008–12 మధ్య కాలంలో హిల్లరీ క్లింటన్ అమెరికా విదేశాంగ మంత్రిగా ఉన్నారు. ఆ కాలంలో ప్రభుత్వ వ్యవహారాలకు ఆమె వ్యక్తిగత ఈమెయిల్ వాడిందని, దానివల్ల దేశరక్షణ వ్యవహారాల గోప్యతకు భంగం కలిగిందన్న ఆరోపణలపై విచారణ జరుపుతామని ఓటింగ్‌కు మూడు రోజుల ముందు ఎఫ్‌బిఐ ప్రకటించింది. దాని ప్రభావం ఓటింగ్‌పై తీవ్రంగానే పడింది. అదంతా ఒట్టిదే అని తర్వాత చెప్పినప్పటికీ అప్పటికే జరగాల్సిన నష్టం జరిగిపోయింది. ముఖ్యంగా డెమోక్రటిక్ పార్టీకి పెట్టని కోటైన ఫ్లోరిడా రాష్ట్రంలో జరిగిన ముందస్తు ఓటింగ్‌లో ఏకపక్షంగా ట్రంప్ అనుకూలత వ్యక్తమైంది. ఉగ్రవాదం పేరుతో యావత్తు ముస్లిం మతస్తుల పట్ల ద్వేషం ప్రదర్శిస్తూ, వారిని అమెరికాలో అడుగు పెట్టనివ్వనని హూంకరించడం అమెరికా అధ్యక్ష పదవినలంకరించిన వారికి శోభనివ్వదు. సిరియా ఆంతరంగిక వ్యవహారాలలో జోక్యం చేసుకుంటూ అక్కడ తన కీలుబొమ్మ ప్రభుత్వాన్ని నడిపిస్తున్న రష్యా అధినేత పుతిన్ మద్దతు ట్రంప్‌కు ఉంది. ట్రంప్‌కు ఓట్లు వెయ్యకపోతే అణుబాంబులను ఎదుర్కోవడానికి సిద్ధంగా ఉండాలని అమెరికన్ ఓటర్లను బెదిరించిన ఘనత పుతిన్‌ది. ప్రపంచ మానవాళి శాంతిని కోరుతున్నారు. శాంతి కాదు ... యుద్ధం ద్వారానైనా మా ఆధిక్యతను నిలుపుకొంటామని పుతిన్, ట్రంప్‌లు భావిస్తున్నారు. వీరిద్దరూ ఏకమయితే మనం ఊహించని పరిణామాలు సంభవించడం ఖాయం. జనవరిలో వైట్‌హౌస్ నుండి పరిపాలన ప్రారంభించబోతున్న ట్రంప్ సంక్షేమ కార్యక్రమాలపై కోత విధించబోతున్నట్టు, ఒబామా హెల్త్‌కేర్ దృక్పథాన్ని, ఇతర దేశాలతో ఉన్న వాణిజ్య ఒప్పందాలను సమీక్షించ బోతున్నట్టు వార్తలు వస్తున్నాయి. పర్యావరణానికి సంబంధించి ఇంతవరకు అమెరికా చొరవ ప్రదర్శించింది. ట్రంప్ దీనికి వ్యతిరేకం. పర్యావరణం కంటే పరిశ్రమలకే ప్రాముఖ్యం ఇవ్వడం ట్రంప్ పాలసీ. దిగుమతులపై సుంకం పెంచడం, బ్యాంక్ వడ్డీరేట్ల పెంపు లాంటి చర్యలు తీసుకోబోతున్నట్టు ట్రంప్ ఇప్పటికే ప్రకటించాడు. ఈ చర్యల వల్ల మొదలే పెద్ద నోట్ల రద్దుతో వ్యాపారాలు స్థంభించిపోయిన స్థితిలో ఉన్న భారత ఆర్థిక వ్యవస్థపై భారం పడి డాలర్‌కు సంబంధించి రూపాయి మారకం విలువ పడిపోయే ప్రమాదం ఉంది. బ్రెగ్జిట్, ట్రంప్ గెలుపు – ఈ రెండు పరిణామాలు ప్రపంచ రాజకీయ ఆర్థిక వ్యవస్థలపై రానున్న కాలంలో ప్రభావం చూపనున్నాయి. వీటిని తట్టుకొని నిలబడగలిగే వ్యూహాలు రూపొందించు కోవడం మన దేశానికి తప్పనిసరి అవసరం. వీ





❖ **2015 ప్రాతినిధ్య** – కథ – సంపాదకులు: ప్రమీల, డా. సామాన్య – సామాన్య కిరణ్ ఫౌండేషన్ ప్రచురణలు – 252 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100, ప్రతులకు: సాహితీ మిత్రులు, 28-10-16, మసీదు వీధి, అరండాల్‌పేట, విజయవాడ-2; ఫోన్: 0866-2433359; అన్ని ప్రముఖ పుస్తక షాపులు



❖ **డార్విన్** – బుద్ధుడు –అంబేద్కర్ – డా. కత్తి పద్మారావు – లోకాయత ప్రచురణలు – 393 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 500, ప్రతులకు: కత్తి స్వర్ణకుమారి,లోకాయత ప్రచురణలు, లుంబినీవనం, అంబేద్కర్ కాలనీ, పొన్నూరు, గుంటూరు – 522124;
ఫోన్ : 9849741695



❖ **గ్రీకు పురాణ గాథలు** – ఆదిరాజు వీరభద్రరావు – నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 77 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 60



❖ **కొన్ని వెలుగు నీడలు** – కథలు – డా. వెన్నం ఉపేందర్ – నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 183 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 130



❖ **ముల్లుగర్ర** – కథల సంపుటి – డా. వి.ఆర్. రాసాని – నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 252 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 170
పై మూడు పుస్తకాల ప్రతులకు: నవచేతన పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, జి.ఎస్.ఐ పోస్టు, బండ్లగూడ (నాగోల్), హైదరాబాద్–500 068, తెలంగాణ
ఫోన్ : 040–24224453/54



❖ **చినుకు దీవి** – జి. వెంకటకృష్ణ – కవిత్వం – స్ఫూర్తి ప్రచురణ – 133 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100, ప్రతులకు: జి. వెంకటకృష్ణ, ఇ. నెం. 87-1287-1, సోమిశెట్టినగర్, కర్నూలు – 518 002



❖ **తెలుగమ్మ ఒడిలో బౌద్ధం** – బొర్రా గోవర్ధన్ – లతా రాజా ఫౌండేషన్ ప్రచురణ – 102 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 80, ప్రతులకు : లతా రాజా ఫౌండేషన్, కేరాఫ్ ఎక్సోటిక్ ఈవెంట్స్, 103, రోహిత్‌వాల్ విండ్‌సర్ అపార్ట్‌మెంట్స్, హిల్‌పోర్ట్‌రోడ్, సైఫాబాద్, హైదరాబాద్ –500 004, ఫోన్ : 9885281545



❖ **విప్లవ రణధీరుడు** – రాయల సుభాష్ చంద్రబోస్ స్మృతి గీతాలు – అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య – డివిడి ప్రతులకు: అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య, మార్క్స్ భవన్, 658 విద్యానగర్, 7వ లైను, హైదరాబాద్ – 04, ఫోన్ : 8103366910



❖ **తెలుగు సాహిత్యంపై రష్యా, చైనా విప్లవాల ప్రభావం** – హిమజ్వాల – వాయిస్ ఆఫ్ న్యూడెమోక్రసీ ప్రచురణ – 34 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 20,



❖ **రష్యా, చైనా విప్లవాలలో ఐక్య సంఘటన – అనుభవాలు** – వేములపల్లి వెంకట్రామయ్య – వాయిస్ ఆఫ్ న్యూడెమోక్రసీ ప్రచురణ – 78 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 30, ప్రతులకు: పై రెండు పుస్తకాలు వాయిస్ ఆఫ్ న్యూడెమోక్రసీ, మార్క్స్‌భవన్, 658, విద్యానగర్, 7వ లైన్, హైదరాబాద్ – 44, నవ తెలంగాణ బుక్ హౌస్, నవోదయ బుక్ హౌస్, విశాలాంధ్రలలో



❖ **వింటిని గురిపెట్టు** – ఆదివాసీ పోరు పాటలు – వరంగల్ రచయితల సంఘం ప్రచురణ – 64 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 60, ప్రతులకు: నల్లెల రాజయ్య, ఇ.నెం. 7–1–384–6, పద్మాక్షి కాలనీ, హన్మకొండ, వరంగల్ – 506 001, తెలంగాణ



❖ **చానళ్ల సందడి టెక్నాలజి హడావుడి** – నాగసూరి వేణుగోపాల్ – ఎన్. కె. పబ్లికేషన్స్ – 216 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 125, ప్రతులకు: ఎన్.కె. పబ్లికేషన్స్, డోర్ నెం. 24–8–1, సమీర రెసిడెన్సీ, విజయనగరం – 535 001 (ఏపి)



❖ **ఎర్రగాలు** – కూకట్ల తిరుపతి – కవిత్వం – సాహితీ సోపతి ప్రచురణ – 72 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 80, ప్రతులకు: కూకట్ల లక్ష్మి, ఇ. నెం. 1–29/1, గ్రా. మద్దికుంట, మం : మానకొండూరు, జిల్లా : కరీంనగర్ – 505 505, తెలంగాణ



❖ **యుగ సంగీతం యుగ చైతన్యం** – పైగంబర కవులు – పైగంబరులు ప్రచురణ – 120 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 2, ప్రతులకు: నవోదయ పబ్లిషర్స్, ఏలూరు రోడ్డు, విజయవాడ – 2



❖ **ఖలీల్ జిబ్రాన్** – సరోజిని శ్యాంసుందర్ వృద్ధాశ్రమ సేవా సంఘం ప్రచురణ – 60 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100, ప్రతులకు: సరోజిని శ్యాంసుందర్ వృద్ధాశ్రమ సేవా సంఘం, ఫ్లాట్ నెం. 103, దుర్గా అపార్ట్‌మెంట్, దుర్గా నగర్, సోమాజిగూడ, హైదరాబాద్ – 500082, ఫోన్ : 9963374567



❖ **గెలిచి నిలిచిన గళం** – బండి చంద్రశేఖర్ – కోటి లింగాల ప్రచురణ – 95 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 80, ప్రతులకు: బండి చంద్రశేఖర్, ఇ. నెం. 7–2–904/1, మంకమ్మతోట, కరీంనగర్–505001; ఫోన్: 9440087930, ప్రముఖ పుస్తక కేంద్రాల్లో

# పెద్ద నోట్ల రద్దు - అబద్ధాలూ అక్రమాలూ అగచాట్లూ

*భారత ప్రభుత్వం హఠాత్తుగా ప్రకటించిన పెద్ద నోట్ల రద్దు నిర్ణయం పూర్వాపరాలనూ, దాని ప్రకటిత, అప్రకటిత లక్ష్యాలనూ విశ్లేషిస్తున్నారు* **ఎన్. వేణుగోపాల్**

నవంబర్ 8 రాత్రి ప్రధాని నరేంద్ర మోడీ ఆ అర్ధరాత్రి నుంచి దేశంలో రు. 500, రు. 1000 నోట్లు చెల్లబోవని ఒక సంచలనాత్మక నిర్ణయం ప్రకటించారు. అప్పటినుంచి ఇది రాస్తున్న సమయందాకా గడిచిన పద్దెనిమిది రోజులలో దేశం అల్లకల్లోలమయింది. ఆర్థిక వ్యవస్థలో అత్యధికభాగం కుప్పకూలి పోయింది. కోట్లాదిమంది బ్యాంకుల ముందర, ఎటిఎంల ముందర పడిగాపులు పడుతుండడంతో కోట్లాది పనిదినాలు వ్యర్థమైపోయాయి. వ్యవసాయం, చిన్న పరిశ్రమలు, చిన్న వ్యాపారాలు, రవాణా వంటి రంగాలెన్నో కనీవినీ ఎరగని మాంద్యానికి గురయ్యాయి. రోజుకూలీలు, పేద, మధ్యతరగతి ప్రజానీకం, చిన్న వ్యాపారస్తులు, మొత్తంగా అసంఘటిత రంగంలోని కోట్లాది మంది జీవితాలు అతలాకుతలమైపోయాయి. ఈ పెద్ద నోట్ల రద్దుకు ప్రత్యక్ష ఫలితంగా ఇప్పటికి దాదాపు అరవై మంది చనిపోయారని వార్తలు వస్తున్నాయి. ఈ అస్తవ్యస్త స్థితి ఎప్పటికి తొలగిపోతుందో, దీని మధ్యంతర, దీర్ఘకాలిక ఫలితాలు ఎలా ఉండబోతున్నాయో ఎవరూ చెప్పలేని స్థితి ఉంది. ఈ వ్యవహారం ద్రవ్య అర్థశాస్త్రానికీ, ప్రత్యేకించి ప్రభుత్వ ద్రవ్య విధానానికీ సంబంధించిన సంక్లిష్ట, సాంకేతిక అంశాలతో ముడిపడినది కావడంతో అసలు ఈ సమస్య ఏమిటో, ఎందుకు వచ్చిందో, ఎలా సమసిపోతుందో విద్యావంతులకు కూడ తెలియని స్థితి ఉంది.

### ప్రభుత్వం చెప్పిన కారణాలు

ముందస్తు సూచనలేమీ లేకుండా హఠాత్తుగా నవంబర్ 8 రాత్రి 8.15 కు మొదలై అరగంట పాటు దేశ ప్రజలనుద్దేశించి చేసిన ప్రసంగంలో మోడీ ఈ నిర్ణయం ప్రకటించారు. తన ప్రభుత్వ విజయాలు, దేశ ఆర్థిక పరిస్థితి గురించి చెపుతూ, దేశప్రగతికి ప్రతి ఒక్కరూ దోహదం చేయవలసిన అనివార్యమైన, అరుదైన సందర్భం చరిత్రలో వస్తుందని, ప్రస్తుత సందర్భం అటువంటిదని అంటూ, హఠాత్తుగా ఆ రాత్రి 12 గంటల నుంచి రు. 500, రు. 1000 నోట్లను చలామణీ నుంచి ఉపసంహరిస్తున్నామని ప్రకటించారు. ఇది ఒక మహాయజ్ఞమని, ఇందులో తాత్కాలిక త్యాగాలు చేయడానికి ప్రజలు సిద్ధపడాలని, దేశం కోసం ఈ త్యాగాలు అవసరమని ఆయన అన్నారు. ఈ చర్యకు మూడు లక్ష్యాలున్నాయని అన్నారు. అవి: 1. దేశ ఆర్థిక వ్యవస్థ నుంచి 'నల్లధనాన్ని' (అక్రమధనాన్ని) వెలికితీయడం, 2. నకిలీ నోట్లను అరికట్టి, 'తీవ్రవాదుల' ఆర్థిక మూలాలను దెబ్బతీయడం, 3. అవినీతిని తొలగించడం. కాని ఈ మూడు లక్ష్యాలకూ పెద్ద నోట్ల రద్దుకూ మధ్య ఉన్న సంబంధం చాల స్వల్పమైనది. పెద్ద నోట్ల రద్దు వల్ల ఈ లక్ష్యాలలో ఏ ఒక్కటీ నిజంగా, సమగ్రంగా నెరవేరదు. అంటే ప్రభుత్వం చెప్పిన కారణాలను మించి చెప్పని కారణాలేవో ఉండి ఉండాలి. ఆ అప్రకటిత లక్ష్యాలను పరిశీలించబోయే ముందు, ప్రకటిత లక్ష్యాల లోగుట్టును చూద్దాం.

### 'నల్లధనం' సమస్య

ఏ దేశ ఆర్థిక వ్యవస్థలోనైనా చట్టానికి, ప్రభుత్వ పన్నుల విధానానికి లోబడి ఉండే ఆదాయాలను, పోగుపడే సంపదను తెల్లధనం అని, చట్టబద్ధమైన ధనం అని పిలుస్తారు. అలా కాకుండా ప్రభుత్వం విధించే నిర్దిష్టమైన పన్నులు చెల్లించకుండా ఉండడానికి లెక్కలు సరిగ్గా చెప్పక, లేదా ప్రభుత్వం విధించిన పన్నులను ఎగ్గొట్టి, చట్టవ్యతిరేక పద్ధతులలో గడించే ఆదాయాన్ని, పోగు చేసుకునే సంపదను, నమోదు కాకుండా మిగిలిపోయే ధనాన్ని 'నల్లధనం', లేదా చట్టవ్యతిరేకమైన ధనం అంటారు. ఈ మాటలు వాడడంలోనే తెలుపు మంచికీ, నలుపు చెడుకూ సంకేతాలనే జాతివివక్షా ధోరణి ఉంది. కనుక ఆ మాటలు వాడడమే తప్పు. అలాగే సక్రమ ధనం, అక్రమ ధనం అనే మాటలు కూడ నిశితంగా ఆలోచిస్తే సరైన మాటలు కావు. అసలు సామాజిక సంపద కొద్దిమంది వ్యక్తుల దగ్గర పోగుపడడమే అక్రమం మీద, అన్యాయం మీద ఆధారపడిన వ్యవస్థలో సక్రమ ధనం అనే మాట కూడ తాత్విక అర్థంలో సరైనది కాదు. పందొమ్మిదో శతాబ్ది ఫ్రెంచి తత్వవేత్త ప్రౌధాన్ అయితే 'ఆస్తి అంటేనే దొంగతనం' అని కూడ వాదించాడు. మన కాళోజీ కూడ 'అసమ సమాజంలో ఆర్జనయే దౌర్జన్యం' అన్నాడు. ఒకవేళ సక్రమాదాయం, అక్రమాదాయం అనే మాటలు వాడినా ఉత్పత్తి కార్యకలాపాలలో పాల్గొనే శ్రమజీవులకు శ్రమఫలితం పూర్తిగా అందినప్పుడు అది మాత్రమే సక్రమాదాయం అవుతుంది. ఇతర ఆదాయాలన్నీ అక్రమాదాయాలే అవుతాయి.

ఆ తాత్విక చర్చ ప్రస్తుతానికి అవసరం లేదుగాని, పాలకవర్గాలు, ప్రభుత్వాలు, అర్థశాస్త్రవేత్తలు 'నల్లధనం', 'అక్రమధనం' అని అంటున్నప్పుడు వాళ్ల దృష్టిలో ఉన్నది రెండు రకాల ధనం: ఒకటి, చట్టం నిర్దేశించిన పన్నులు ఎగ్గొట్టడానికి ఆదాయాన్ని తక్కువ చూపించడం వల్ల మిగిలిపోయే ధనం. రెండు, అసలు పన్నుల పరిధిలోకి రాని, ఎక్కడా నమోదు కాని లావాదేవీల ఆదాయం.

### పన్నుల విధానం - 'నల్లధనం'

పన్నులు చెల్లించకుండా ఉండేందుకు పారిశ్రామికవేత్తలు, వ్యాపారస్తులు తమ ఆదాయాలను తగ్గించి చూపుతున్నారని, తద్వారా ఏటేటా ఇటువంటి అక్రమధనం పేరుకుపోతున్నదని ప్రభుత్వాలు అంటున్నాయి. పన్ను రేట్లు హెచ్చుగా ఉండడం వల్ల ఎగ్గొట్టడానికి ప్రయత్నిస్తున్నారని వాదించి పన్నులు తగ్గించాలని సిఫారసులు చేసేవారు కూడ ఉన్నారు. పన్నుల వసూళ్ల వ్యవస్థ ఉండవలసినంత బలంగా లేదని, ఆ వ్యవస్థ ఉద్యోగులే అవినీతికి పాల్పడుతున్నారని, కనుక శిక్షలు కఠినంగా ఉండాలని అనేవారూ ఉన్నారు. నిజానికి భారత ఆర్థిక వ్యవస్థలో పన్నుల విధానం ఏమాత్రం హేతుబద్ధంగా లేదు. ఏ సమాజంలోనైనా ప్రత్యక్ష పన్నులు, పరోక్ష పన్నులు అని రెండు రకాల పన్నులుంటాయి. స్థూలంగా చెప్పాలంటే ఆదాయాల మీద, సంపద మీద నేరుగా విధించే పన్నులు ప్రత్యక్ష పన్నులు. సరుకుల, సేవల కొనుగోలు, అమ్మకాల మీద విధించే పన్నులు పరోక్ష పన్నులు. ప్రత్యక్ష పన్నులు నేరుగా కనబడగా, పరోక్ష పన్నులు ధరలో కలిసిపోయి అదృశ్యంగా ఉంటాయి. దేశంలో ప్రత్యక్ష పన్నులలో వ్యక్తిగత ఆదాయ పన్ను, కార్పొరేట్ పన్ను

ప్రధానమైనవి. పరోక్ష పన్నులలో అమ్మకం పన్ను, సేవల పన్ను, విలువ ఆధారిత పన్ను, కస్టమ్స్ సుంకం, ఎక్సైజ్ సుంకం ప్రధానమైనవి,

ప్రత్యక్ష పన్నులు ఎక్కువగా ఉండాలని, ఆదాయం, సంపద పెరిగినకొద్దీ పన్నులు పెరగాలని అర్థశాస్త్రంలో ఒక భావన ఉంది. కాని భారత దేశంలో ప్రత్యక్ష పన్నుల శాతం ఉండవలసిన దానికన్న చాల తక్కువ. ప్రత్యక్ష పన్నుల పరిధిలోకి వస్తున్న జనాభా చాల తక్కువ. అందులోనూ ప్రత్యక్ష పన్నుల పరిధిలోకి వచ్చిన పేద, మధ్యతరగతి వర్గాల నుంచి నిర్బంధపూరితమైన, కచ్చితమైన వసూళ్లు జరుగుతుండగా, ధనిక, పారిశ్రామిక, వ్యాపార వర్గాల పట్ల అలసత్వం, తప్పుడు లెక్కలు, ఎగవేతలు, రాయితీలు వంటి రూపాలలో మినహాయింపులు ఉంటున్నాయి. మొత్తం పన్ను వసూళ్లలో ప్రత్యక్ష పన్నుల వాటా 2009-10లో 61 శాతం ఉన్నదల్లా, 2013-14 నాటికి 56 శాతానికి పడిపోయింది. నరేంద్ర మోడీ అధికారానికి వచ్చాక ఈ వాటా మరింత పడిపోయి 51 శాతానికి చేరింది.

ప్రత్యక్ష పన్నులలో వ్యక్తిగత ఆదాయపన్ను సంపాదనాపరులందరూ చెల్లించవలసిందే కాని గణాంకాలు అందుబాటులో ఉన్న తాజా సంవత్సరం 2012-13లో దేశపు మొత్తం జనాభా 123 కోట్ల మందిలో కేవలం 2 కోట్ల 87 లక్షల మంది మాత్రమే తమ ఆదాయ లెక్కలు సమర్పించారు. వారిలో ఒక కోటీ 62 లక్షల మంది పన్నులు చెల్లించనక్కరలేని పరిమితి లోపలే ఉన్నారు. అంటే ఆదాయ పన్ను చెల్లిస్తున్నవారు ఒక కోటీ ఇరవై ఐదు లక్షల మంది మాత్రమే. అంటే జనాభాలో నూటికి ఒకరు మాత్రమే. వీరిలో అత్యధికులు ఉద్యోగులే గనుక వారు పన్ను ఎగవేయడానికి వీలులేదు. ఆదాయపు పన్నును వారి జీతభత్యాలలోనే మినహాయించుకుంటారు.

ఇక కార్పొరేట్ పన్నులు కార్పొరేట్ పారిశ్రామిక, వ్యాపార, సేవా సంస్థలు చెల్లించే పన్నులు. దేశంలో ఇటువంటి సంస్థలు పదమూడు లక్షల పైన ఉన్నాయని, అందులో కనీసం పది లక్షలు క్రియాశీలంగా లావాదేవీలు జరుపుతూ లాభాలు ఆర్జిస్తున్నాయని అంచనా. కార్పొరేట్ పన్ను సాధారణంగా ఆదాయం మీద 18 శాతం నుంచి 35 శాతం వరకు ఉంది. ప్రస్తుతం భారత ప్రభుత్వ కార్పొరేట్ పన్ను రాబడి ఐదులక్షల కోట్ల రూపాయల కన్న తక్కువే. జాతీయోత్పత్తిలో పారిశ్రామిక, సేవా రంగాల వాటా 83 శాతం, అంటే కోటి కోట్ల రూపాయల ఆర్థిక వ్యవస్థలో ఈ రంగాలు 83 లక్షల కోట్ల రూపాయల వాటాతో ఉన్నాయి. వాటిలో సగానికి సగం కార్పొరేట్ సంస్థల ఆదాయం అనుకున్నా అది నలభై లక్షల కోట్ల రూపాయలు అవుతుంది. సాధారణ పన్ను రేటు ప్రకారం పది లక్షల కోట్ల రూపాయల నుంచి పద్దెనిమిది లక్షల కోట్ల రూపాయలు పన్నుగా ప్రభుత్వానికి అందాలి. కాని అందుతున్నది ఐదు లక్షల కోట్ల రూపాయలు మాత్రమేనంటే ఆ కంపెనీలు తమ ఆదాయాన్ని పూర్తిగా నమోదు చేయకపోవడమో, ఆ ఆదాయం మీద చెల్లించవలసిన పన్ను ఎగ్గొట్టడమో, రాయితీలు పొందడమో జరుగుతున్నదన్నమాట. ఏది జరిగినా సాలీనా కార్పొరేట్ సంస్థల నుంచి కనీసం ఐదు లక్షల కోట్ల రూపాయలు అక్రమధనంగా మారుతున్నదనుకోవచ్చు. ఇది అన్ని గణాంకాలనూ చాల తక్కువచేసి కనిష్ఠ స్థాయిలో వేస్తున్న లెక్క. వాస్తవం దీనికి రెట్టింపు కూడ ఉండవచ్చు. దేశంలో 'నల్లధనం' ఉత్పత్తి అవుతున్న ప్రధానమైన మూలం ఇది. ఈ మూలాన్ని ముట్టుకోకుండా, మరే ప్రయత్నం చేసినా 'నల్లధనాన్ని' వెలికితీయడం జరగదు.

ఆదాయం పన్ను, కార్పొరేట్ పన్ను కాక వృత్తి పన్ను, వినోద పన్ను, స్టాంప్ డ్యూటీ, రిజిస్ట్రేషన్ ఫీ, టోల్ టాక్స్, సెస్సులు వంటి ప్రత్యక్ష పన్నులు కూడ ఉన్నాయి. ఇవన్నీ నేరుగా ప్రజలు, వినియోగదారులు ప్రభుత్వానికో, ఆ సేవలు అందించే వ్యవస్థకో చెల్లించవలసినవే. వీటన్నిటిలో కూడ అక్రమ ధనం పేరుకుపోవడానికి అవకాశాలున్నాయి. వినోద పన్నుగా ఆయా వినోద సంస్థలు వినియోగదారులదగ్గర వసూలు చేసే ధనానికి పూర్తి లెక్కలు చెప్పి, ఆ ధనమంతా ప్రభుత్వానికి సమర్పించకపోతే అది అక్రమధనంగా మారుతుంది. భూముల, స్థిరాస్తుల అమ్మకాలు, కొనుగోళ్లలో ప్రభుత్వమే వసూలు చేసే స్టాంప్ డ్యూటీ, రిజిస్ట్రేషన్ ఫీలను తక్కువగా చెల్లించడానికి మొత్తం లావాదేవీని తక్కువ చేసి చూపడం జరుగుతున్నది. ముఖ్యంగా భూమి క్రయవిక్రయాలలో ప్రభుత్వం నిర్ణయించిన ధర, మార్కెట్లో చలామణీలో ఉన్న ధర కన్న చాల తక్కువగా ఉంటున్నది. ప్రభుత్వం నిర్ణయించిన ధరకు పన్ను చెల్లించే చట్టబద్ధమైన లావాదేవీలలో కూడ మార్కెట్ ధరతో దానికి ఉండే వ్యత్యాసమంతా అక్రమధనంగా మారుతున్నది. రహదారులు, వంతెనలు నిర్మించినవారు మొదట కాంట్రాక్టు సంపాదించినప్పుడే నిర్మాణ వ్యయం కన్న ఎక్కువచూపి అక్రమధనానికి రహదారి వేసుకుంటున్నారు. బ్యాంకుల దగ్గర రుణం తీసుకుని, ఎగ్గొట్టి, లేదా రాయితీలు పొంది దాన్ని అక్రమధనంగా పోగు చేసుకుంటున్నారు. చివరికి టోల్ ప్లాజాలలో వాహనాల దగ్గర వసూలు చేస్తున్న ధనమంతా లెక్క చూపకుండా, అక్రమధనం పోగు చేసుకుంటున్నారు, పన్నులు చెల్లించడం లేదు. ఈ మార్గాలలో పోగుపడిన అక్రమధనాన్ని మళ్లీ ఫైనాన్స్, రవాణా, మీడియా, విద్య, ఆరోగ్యం వంటి అసంఘటిత, అర్ధసంఘటిత రంగాలకు, లెక్కలు చెప్పని, అరకొరగా చెప్పే రంగాలకు మళ్లించి ఆ 'నల్లధనాన్ని' తెల్లధనంగా మార్చడమో, మరింత 'నల్లధనాన్ని' మూటకట్టుకోవడమో చేస్తున్నారు. అంటే ఈ దేశంలో నిజంగా 'నల్లధనాన్ని' వెలికితీయాలంటే భూముల క్రయవిక్రయాలను, కాంట్రాక్టర్ వ్యవస్థను, సినిమా, ఫైనాన్స్, మద్యం, రవాణా, విద్య, ఆరోగ్య రంగాలను ఎక్కుపెట్టాలి. కాని ఈ అన్ని రంగాల బడావ్యాపారులూ పాలకవర్గాలతో, అన్ని రాజకీయ పార్టీలతో సన్నిహితంగా ఉన్నారు, రాజకీయ పార్టీలకు ముడుపులు ఇస్తున్నారు.

నిర్ణీతమైన ఆదాయం కన్న ఎక్కువ ఉన్నవారి మీద మాత్రమే విధించే ప్రత్యక్ష పన్నుల వాటా తగ్గిస్తూ, మొత్తం ప్రజలకు వర్తించే పరోక్షపన్నులను నానాటికీ పెంచుతూ ప్రభుత్వాలు ప్రజలందరినీ, జీవితావసరాలన్నిటినీ కనిపించని పన్నుల పరిధిలోకి తెస్తున్నాయి. ప్రజలందరూ కొనే, వాడుకునే ప్రతి సరుకు మీదా, ప్రతి సేవ మీదా పరోక్ష పన్నుల భారం పెరిగిపోతున్నది. అలా పాలకవర్గాలు పేద, మధ్యతరగతి వర్గాల నుంచి లక్షల కోట్ల రూపాయలు తమ బొక్కసాలకు చేర్చుకుంటున్నాయి. తమ ఆశ్రితులకు దోచి పెడుతున్నాయి. పాలకవర్గాలలో భాగమైన సంపన్న వర్గాలు కూడ ఎంతో కొంత తమ సరుకుల, సేవల వినియోగం మీద పరోక్ష పన్నులు చెల్లిస్తుండవచ్చుగాని, తమ ఆదాయాల మీద, సంపద మీద చెల్లిస్తున్న ప్రత్యక్ష పన్నులు చాల తక్కువ. ఆ తక్కువ కూడ చెల్లించకుండా ఎగగొట్టడానికి ప్రయత్నించడంతో అక్రమధనం పోగవుతున్నది.

**ఇతర రంగాల 'నల్లధనం'**

నిజానికి పన్ను చెల్లింపులలో తరుగు, ఎగవేతలకన్న ఎక్కువగా అక్రమ ధనం పోగవుతున్న రంగాలు మరెన్నో ఉన్నాయి. రాజకీయ అవినీతి వాటన్నిటిలోనూ ప్రధానమైనది. పారిశ్రామిక, వ్యాపార సంస్థలు అక్రమంగా సంపాదించిన వేల కోట్ల రూపాయల సంపదలో కొంత భాగాన్ని రాజకీయ పార్టీలకు అప్పగిస్తాయి. ఈ దేశంలో ఎన్నికలంటే, రాజకీయపార్టీల నిర్వహణ అంటే విపరీతమైన ధనవ్యయం అనే అర్థం స్థిరపడింది గనుక, ముఖ్యంగా ఎన్నికలకు పార్టీల, అభ్యర్థుల మొత్తం ఖర్చు వేల కోట్ల రూపాయలు దాటుతున్నది గనుక దానికి ఏకైక వనరుగా ఉన్నది 'నల్లధనమే'. విదేశీ వాణిజ్యంలో అక్రమాలు, ఎగుమతి, దిగుమతుల్లో ఎక్కువ బిల్లులు, తక్కువ బిల్లులు రాయించి అసలు ధరకూ బిల్లుకూ వ్యత్యాసాన్ని విదేశీ ఖాతాల్లోకి చేర్చుకోవడం 'నల్లధనం' పోగుపడడానికి ఒక ముఖ్యమైన వనరు. రాసిన బిల్లుల మీద కూడ రాజకీయ నాయకులకు, అధికారవర్గానికి అందే ముడుపులు 'నల్లధనం'గా మారతాయి.

ఇలా వేరువేరు రూపాలలో పోగుబడుతున్న 'నల్లధనాన్ని' వెలికితీయడం, ఆ సమాంతర ఆర్థిక వ్యవస్థ, చీకటి బజారు నడవకుండా చూడడం తప్పనిసరిగా నెరవేర్చవలసిన ఈ దేశప్రజల ప్రయోజనాలు. కాని అందుకు మార్గం పెద్ద నోట్ల రద్దు కాదు. అసలు పన్నులు ఎగ్గొట్టడం వల్ల, లావాదేవీలు నమోదు చేయకపోవడం వల్ల, తక్కువగా నమోదు చేయడం వల్ల పోగుపడే అక్రమధనం పెద్దనోట్ల రూపంలో మాత్రమే ఉండదు. డబ్బు లక్షణాలుగా అర్థశాస్త్రం చెప్పే నాలుగు లక్షణాలలో (వినిమయ సాధనం, గణక సాధనం, విలువ నిలువ సాధనం, లావాదేవీల ఆలస్యపు చెల్లింపుల సాధనం) వినిమయ సాధనమే ప్రధానమైనది. చలామణీలో లేకపోతే డబ్బుకు విలువా ఉండదు, అది పెరగనూ పెరగదు. అందువల్ల 'నల్ల డబ్బ'యినా, తెల్ల డబ్బయినా చలామణీలో, ప్రవాహంలో ఉండవలసిందే. ఏదీ భోషాణాల్లో నిలువ ఉండదు. నోట్ల కట్టలు భోషాణాల్లో ఉంచుకోవాలని ఎవరన్నా అనుకున్నా అది అదనపు విలువ సంపాదించదు. అది చలామణీలో ఉంటేనే పిల్లలు పెడుతుంది. 'నల్లధనాన్ని' కూడ పునరుత్పత్తి చేయాలి గనుక రూపాలు మార్చడం జరుగుతుంది. కాబట్టి 'నల్లధనం' పోగువేసుకున్నవారు ఎవరైనా దాన్ని విదేశీ ఖాతాల్లో, బంగారంలో, ఆస్తిలో, బేనామీ ఆస్తులలో, షేర్లలో, వజ్రాలు వంటి విలువైన వస్తువులలో, వ్యాపారంలో పెట్టుబడులలో తెల్లధనంగా మార్చేస్తారు. చాలవరకు 'నల్లధనం' విదేశాల్లోని పన్నురహిత స్థావరాలకు ప్రయాణించి అక్కడి నుంచి మళ్లీ దేశంలోకి, ఇతర దేశాల్లోకి తెల్లధనంగా ప్రవహిస్తుంది. బేనామీ ఆస్తులుగా తెల్లధనంగా మారుతుంది. పెద్ద నోట్ల రూపంలో ఎవరో ధనాన్ని నిలువ చేసి ఉంచుకున్నారని, అవి రద్దు చేయగానే 'నల్లధనం' అంతమైపోతుందని అనుకోవడం ఆత్మవంచన, పరవంచన. అక్రమధనం పెద్దనోట్ల రూపంలో ఉందని అమాయక ప్రజలకు భ్రమ కల్పిస్తూ, పెద్దనోట్లను రద్దు చేస్తే 'నల్లధనం' అరికట్టవచ్చునని నమ్మబలుకుతున్నారంటే ఇది ఆత్మవంచన కన్న ఎక్కువ భారీ మోసం.

పెద్దనోట్లలో పెద్దమొత్తం అక్రమధనాన్ని నిలువ చేసుకునేది ఎక్కువగా రాజకీయ నాయకులు, రాజకీయ పార్టీల నిర్వాహకులు. రాజకీయాల్లో ఎప్పుడు ఏ ఖర్చు వస్తుందో తెలియదు, ఎన్నికలకైతే వందలాది, వేలాది కోట్ల రూపాయలు కావాలి. అవన్నీ బ్యాంకులలో దాచుకోలేరు. ఆస్తులలో పెడితే ఎప్పుడు కావాలంటే అప్పుడు డబ్బుగా మార్చుకోలేరు. అందువల్ల రాజకీయ నాయకుల దగ్గర మాత్రమే కరెన్సీ రూపంలో 'నల్లధనం' ఉంటుంది. అలా పోగుబడే డబ్బంతా కూడ కాంట్రాక్టర్లనుంచి, పారిశ్రామిక, వ్యాపారవేత్తల నుంచి సంపాదించిన ముడుపులు, లంచాలు, కమిషన్లు మాత్రమే. అదంతా కూడ అక్రమధనమే. మొత్తం నోట్ల రూపంలో ఉండే అక్రమధనంలో ఎనభై శాతం అదే కావచ్చు. దాన్ని రద్దు చేసినా, ఈ నిలువదార్లందరూ రాజకీయ నాయకులు గనుక ఏ బేనామీ పేర్లతోనో తమ అక్రమధనాన్ని స్వచ్ఛధనంగా మార్చుకోవడానికి అవకాశం ఉంది. ఒకవేళ అలా మారకపోయినా, అది వృథా అయిందని అనుకుని మళ్లీ విచ్చలవిడిగా లంచాలు, ముడుపులు మొదలుపెట్టవచ్చు.

కాగా పెద్దనోట్లలో ఒక చిన్న భాగం చిన్నవ్యాపారుల దగ్గర, రైతాంగం దగ్గర, మధ్యతరగతి ఉద్యోగస్తుల దగ్గర ఉంటుంది. బ్యాంకులమీద నమ్మకం లేని, తక్షణావసరాలు ఎప్పుడొస్తాయో తెలియక, ఎప్పుడైనా పనికొస్తాయని ఎంతో కొంత దాచుకున్నవాళ్ల దగ్గర ఉంటుంది. ఇంతకూ దేశంలో చలామణీలో ఉన్న మొత్తం కరెన్సీ నోట్లలో ఈ రు. 500, రు. 1000 నోట్లు 86 శాతం. వాటి విలువ రు. 14 లక్షల కోట్లు. మొత్తం వినియోగంలో ఉన్న కరెన్సీలో అత్యధిక శాతం పెద్దనోట్లు అంటేనే అవి పేద, మధ్యతరగతి, చిన్నవ్యాపార వర్గాల దగ్గర కూడ ఉండవచ్చునని అర్థం. ఇంత పెద్ద మొత్తాన్ని మూడు గంటల హెచ్చరికతో రద్దు చేశారు. వాటిని మార్చుకోవడానికి 50 రోజుల గడువు ఇచ్చారు. ఆ మార్చుకునే ప్రక్రియలో కూడ ఒకసారి రు. 4000 అని, ఒకసారి రు. 4500 అని, ఒకసారి రు. 2000 అని, ఒకసారి వేలుకు ముద్రవేసి, మరొకసారి వేలుకు ముద్రవేయక అనేక మార్పులు చేశారంటే, ఏ మాత్రం ఆలోచన లేకుండా, ప్రజలకు రానున్న ఇబ్బందుల గురించి పట్టించుకోకుండా, ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేయకుండా ఈ చర్య జరిగిందని తేటతెల్లమవుతుంది.

దేశంలో 'నల్లధనం' మీద అంతర్జాతీయ సంస్థలు, దేశంలో ప్రభుత్వ, ప్రభుత్వేతర సంస్థలు, స్వతంత్ర మేధావులు ఎన్నో అధ్యయనాలు చేశారు. 'నల్లధనం' పరిమాణం గురించి ఎన్నో అంచనాలు వేశారు. దాన్ని వెలికితీసే మార్గాల గురించి అనేక సూచనలు చేశారు. 'నల్లధనాన్ని' వెలికితీయడానికి అనే కారణంతోనే 1946లో, 1978లో పెద్దనోట్ల రద్దు జరిగింది. 'నల్లధనం' స్వచ్ఛందంగా బైటపెడితే, రాయితీలు, మినహాయింపులు, బహుమతులు ఇస్తామనే పథకాలెన్నిటినో ప్రభుత్వాలు ప్రకటించాయి. 'అక్రమధనం వ్యతిరేక చర్యలు'గా చెప్పుకునే ఈ చర్యలేవీ గత ఏడు దశాబ్దాలలో కనీస ఫలితాన్ని కూడ సాధించలేకపోయాయి. విజయాలు సాధించామని చెప్పుకున్నప్పటికీ అవి సముద్రంలో కాకిరెట్ట వంటివే అయిపోయాయి. స్వయంగా మోడీ ఈ నోట్ల రద్దు ఉపన్యాసంలో తమ ప్రభుత్వం ఈ రెండున్నరేళ్లలో దాడుల ద్వారా, సర్వేల ద్వారా, స్వచ్ఛంద ప్రకటనల ద్వారా రు. 1.25,000 కోట్లు బైటపెట్ట గలిగిందని అన్నారు. కాని జాతీయాదాయంలో 'నల్లధనం' వాటా కనీసం 15 శాతం నుంచి 50 శాతం దాకా ఉండవచ్చునని వేరువేరు అంచనాలున్న సందర్భంలో, దాని పరిమాణం కోటి కోట్ల రూపాయల జాతీయాదాయంలో పదిహేను లక్షల కోట్ల నుంచి యాభై లక్షల కోట్లు అయినప్పుడు, అందులో ఒక లక్ష కోట్లు వెలికితీసి అది గొప్పగా చెప్పుకోవడం హాస్యాస్పదం.

దేశంలో ఉన్న నల్లధనంలో పెద్దనోట్ల వాటా చాల తక్కువ కాగా, దేశీయుల నల్లధనంలో విదేశాల్లో ఉన్న నల్లధనం వాటా చాల ఎక్కువ. విదేశాల్లో ఉన్న నల్లధనాన్ని దేశానికి తీసుకువచ్చి, ప్రతి ఒక్కరి ఖాతాలో పదిహేను లక్షల రూపాయలు జమ చేస్తానని 2014 మే ఎన్నికలకు ముందు వాగ్దానం చేసిన మోడీ, ఆ పనిలో అంగుళం కూడ ముందుకు కదలని స్థితిలో, ఒక గారడీగా, కనికట్టుగా ఎంచుకున్న చర్యే పెద్దనోట్ల రద్దు. విదేశాల్లో నల్లధనం దాచుకున్న వారెవరో, విదేశీ ప్రభుత్వాల మెడలు వంచి ఆ జాబితాలు ఎలా సంపాదించ వచ్చునో, ఆ దేశాల బహుళ జాతి సంస్థల మీద ఆంక్షలు విధించి ఆ ఖాతాలు ఎలా స్తంభింపజేయవచ్చునో, వారికి ఈదేశంలో ఉన్న ఆస్తులేమిటో, ఆ ఆస్తులను ఎలా జప్తు చేయవచ్చునో, దేశంలో 'నల్లధనం' నిలువలు ఎవరిదగ్గర ఉన్నాయో ప్రభుత్వానికి సంపూర్ణంగా తెలుసు. నల్లధనాన్ని, అవినీతిని, నకిలీ కరెన్సీని ఎక్కడ అడ్డుకోవాలో, మూలంలోనే ఎలా దెబ్బతీయవచ్చునో ప్రభుత్వానికి తెలుసు. కాని, ప్రభుత్వాన్ని నడుపుతున్నదే వారు గనుక ఆ చర్యలేవీ అమలు కావు. కేవలం ప్రజల్ని నమ్మించడానికి, మోసగించడానికి ఆ కారణాలు చెప్పడమే తప్ప వాస్తవంగా ఆ పనులు చేయాలనే ఉద్దేశమూ, చేసే చిత్తశుద్ధీ ఈ ప్రభుత్వాలకు లేవు. అటువంటి నిజమైన నేరస్తులు, దొంగలు, ప్రజావ్యతిరేకులు దేశం మొత్తం మీద కొన్ని వేలమందో, లక్షల మందో ఉంటారు. వారి మీద దాడి చేసే బదులు, నూట ముప్పై కోట్ల మంది మీద దాడి చేసి అల్లకల్లోలం సృష్టించి అసలు సమస్య నుంచి దృష్టి మళ్లించాలని చేసిన ప్రయత్నమే పెద్దనోట్ల రద్దు.

### నకిలీ నోట్లు – తీవ్రవాదుల ఆర్థిక మూలాలు

నరేంద్ర మోడీ చెప్పిన రెండో ప్రకటిత లక్ష్యం ఈ పెద్దనోట్ల రద్దు నకిలీ నోట్లను, దొంగ నోట్లను చెల్లకుండా చేస్తుందని. నకిలీ నోట్లను అచ్చువేసి దేశంలో చలామణీ చేయడం ద్వారా పాకిస్తాన్ చేస్తున్న ప్రయత్నాలను అడ్డుకుంటుందని. ఏ దేశంలోనైనా ద్రవ్యం ఆ దేశ ప్రభుత్వ సర్వసత్తాక అధికారానికి చిహ్నం. ప్రభుత్వానికి తప్ప మరెవరికీ ద్రవ్యమానాన్ని ముద్రించే అధికారం లేదు. ఆ దేశ ఆర్థిక వ్యవస్థను దెబ్బతీయదలచిన శక్తులు, ప్రజల అమాయకత్వాన్ని ఆసరా చేసుకుని సమాంతర ఆర్థిక వ్యవస్థను నడపదలచిన

శక్తులు దొంగ నోట్లు ముద్రిస్తాయి. ఏ దేశంలోనైనా ఈ బెడద ఉంటుంది. అలా నకిలీ కరెన్సీ వెలువడే ప్రమాదం ఉందని గుర్తించి ఎప్పటికప్పుడు నిఘా, పర్యవేక్షణ, నియంత్రణ వ్యవస్థల ద్వారా అరికట్టవలసిందే తప్ప నకిలీ కరెన్సీని శాశ్వతంగా నిర్మూలించే చర్యలేవీ లేవు. పెద్దనోట్ల రద్దు తాత్కాలికంగా అప్పటికి ఉన్న నకిలీ నోట్లను రద్దు చేయవచ్చు గాని, మళ్లీ కొత్తగా విడుదలయ్యే నోట్లకు నకిలీలు తయారు కాకుండా ఆపజాలదు. ప్రభుత్వ గణాంకాల ప్రకారమే సాలీనా నియంత్రణ సంస్థలు పట్టుకుంటున్న నకిలీ నోట్లు దాదాపు రు. 25 కోట్ల నుంచి రు. 30 కోట్లు. దేశంలో మొత్తంగా చలామణీలో ఉన్న దొంగ నోట్ల పరిమాణం రు. 1500 కోట్ల నుంచి రు. 5000 కోట్లు ఉండ వచ్చునని ప్రభుత్వ సంస్థలే చెపుతున్నాయి. అంటే దేశంలో మొత్తం చలామణీలో ఉన్న కరెన్సీలో నకిలీ నోట్లు 0.01 శాతం నుంచి 0.05 శాతం. మరి ఈ అతి సూక్ష్మ పరిమాణపు కరెన్సీని అడ్డుకోవడానికి మిగిలిన 99.99 శాతం లేదా 99.95 శాతం కరెన్సీని రద్దు చేయడం దూడగడ్డి కోసం తాటి చెట్టు ఎక్కడం, ఎలుకలున్నాయని ఇల్లు తగులపెట్టుకోవడం లాంటి సామెతలను గుర్తు చేస్తున్నది. ఇక 'తీవ్రవాదులు' ఈ నకిలీ నోట్లను, 'నల్లధనాన్ని' ఉపయోగిస్తున్నారని, పెద్దనోట్ల రద్దు వారి ఆర్థిక మూలాలను దెబ్బతీస్తుందని చేస్తున్న వాదన కూడ అర్థరహితమే. నిజంగానే దేశంలో ప్రజల ఆందోళనల, సాయుధ తిరుగుబాట్ల నిర్వహణకు, ఆయుధాల కొనుగోళ్లకు భారీగా నిధులు అవసరమవుతాయి. అవి పొరుగుదేశాల ప్రేరణతో జరుగుతున్నవైతే నకిలీ నోట్ల వాడకం కూడ ఉండవచ్చు. కాని ఆ ఉద్యమాల స్వభావం వల్లనే, వాటి నిధుల సేకరణ మార్గాల వల్లనే పెద్దనోట్ల రద్దు వాటి మీద ఏ ప్రభావమూ వేయజాలదు. వారి దగ్గర ఉన్న పెద్దనోట్లు తాత్కాలికంగా చెల్లకుండా పోవచ్చు కాని అవి ఏ మార్గాలలో వచ్చాయో ఆ మార్గాలలోనే బదలాయింపుకూ, లేదా కొత్త నిధుల సేకరణకూ అవకాశాలు ఉన్నాయి.

**అవినీతి**

మూడో లక్ష్యంగా మోడీ చెప్పినదీ, ఆయన ఉపన్యాసంలో ఎక్కువ భాగం మొసలి కన్నీరు కార్చినదీ అవినీతి గురించి. అవినీతి దేశంలో అతి ప్రధానమైన సమస్య అయిందనీ, దేశాభివృద్ధికి, ప్రజల నిత్యజీవిత వికాసానికి ఉపయోగ పడవలసిన అపారమైన సంపద అవినీతిపరం అయిపోతున్నదని అందరికీ తెలిసిందే. అందరూ ఆందోళన చెందుతున్నదే. దాన్ని సాకుగా చేసుకుని అవినీతిని అరికట్టడానికే పెద్దనోట్ల రద్దు అనే అబద్ధం ద్వారా ఆ నిర్ణయానికి మద్దతు సమకూర్చుకోవడానికి మోడీ ప్రయత్నించాడు. నిజానికి అవినీతికి మూలం పెద్దనోట్లలో లేదు. పెద్దనోట్లు రద్దు కాగానే అవినీతి సమసిపోదు. మొత్తం సమాజంలోనూ, ఆర్థిక వ్యవస్థలోనూ, విలువల లోనూ ఎంతో తీవ్రమైన, లోతైన చైతన్యమూ, పోరాటాలూ, విచారణలూ, శిక్షలూ సాగితే గాని అవినీతి విషవృక్షాన్ని కూకటివేళ్లతో కూలదోయడం సాధ్యం కాదు. పెద్దనోట్లను రద్దు చేస్తే అవినీతి చిన్ననోట్లకు వ్యాపిస్తుంది. లేదా వస్తురూప, ఆస్తిరూప అవినీతి పెరుగుతుంది. అసలు అవినీతికి మూలమైన ప్రభుత్వ కాంట్రాక్టులు, వాణిజ్య ఒప్పందాలు, వ్యాపార లొసుగులు, రియల్ ఎస్టేట్ వ్యాపారం, ప్రభుత్వ సేవలు ప్రజలకు అందడంలో మధ్య దళారీల పాత్ర, అవినీతిని ప్రోత్సహించే వినియోగదారీ సరుకుల విస్తృతి, అవినీతి సహజమనే భావజాలాన్ని వ్యాపింపజేసే ప్రచార, వినోద సాధనాలు వంటి ఎన్నెన్నో రంగాల్లో స్థిరంగా, మూకుమ్మడిగా, దీర్ఘకాలికంగా సాగించవలసిన పోరాటం స్థానంలో రాత్రికి రాత్రి అవినీతిని పోగొట్టే మంత్రదండంగా పెద్దనోట్ల రద్దును చూపడమే ఒక పెద్ద మాయాజాలం. నల్లధనానికీ, నకిలీ కరెన్సీకీ, అవినీతికీ చిహ్నం పెద్దనోట్లే అని నమ్మించడానికి ప్రయత్నించినవారు కుడిచేత్తో రు. 500, రు. 1000 నోట్లు రద్దు చేసి, ఎడమచేత్తో రు. 2000 నోటు విడుదల చేయడం మరింత హాస్యాస్పదం, అనుచితం, అర్థరహితం.

**రద్దు నిర్ణయం తర్వాత**

ఎంత తప్పుడు నిర్ణయం తీసుకునే వాళ్లయినా ఆ నిర్ణయం పర్యవసానాలు ఎలా ఉండబోతాయి, ప్రతికూల పరిణామాల పట్ల ఎటువంటి ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేసుకోవాలి అని ఆలోచిస్తారు. బహుశా అటువంటి లేశమాత్రమైన ఆలోచన కూడ లేకుండా ఒక్క కలంపోటుతో పద్నాలుగు లక్షల కోట్ల రూపాయల నోట్లను చెల్లకుండా చేసిన ఘనత మోడీకే దక్కుతుంది. రద్దు చేసిన పెద్దనోట్ల విలువలో మూడు నాలుగు లక్షల కోట్ల నల్లధనం ఉండవచ్చునని అంచనా వేశారనుకున్నా, మిగిలిన పది లక్షల కోట్ల రూపాయల ప్రత్యామ్నాయ కరెన్సీ సిద్ధంగా ఉండవలసింది. దేశవ్యాప్తంగా బ్యాంకులు అందుబాటులో లేనిచోట్ల కూడ ప్రత్యామ్నాయ ఏర్పాట్లు జరిగి ఉండవలసింది. రాజు తలచుకుంటే దెబ్బలకు కొదవా అన్నట్టు, ప్రభుత్వానికి ఉన్న శక్తిసామర్థ్యాల దృష్ట్యా ఈ ఏర్పాట్లు చేయడం అసాధ్యమేమీ కాదు. కాని ఎటువంటి ప్రత్యామ్నాయ ఏర్పాట్లు లేకుండా ఇంత భారీ నిర్ణయం ప్రకటించి అమలు చేయడం ప్రారంభించారు.

అసలు ఇటువంటి భారీ చర్యకు అవసరమైన చట్టపరమైన విధివిధానాలు కూడ ప్రభుత్వం పరిశీలించినట్టు లేదు. డిసెంబర్ 31 లోపల, లేదా 2017 మార్చ్ 31 లోపల వెనక్కి రాని పెద్దనోట్లు రద్దయిపోయినట్టే అని ప్రధాని అన్నమాట చట్టబద్ధంగా చెల్లదు. ప్రతి కరెన్సీ నోటు మీద ఉండే రిజర్వ్ బ్యాంక్ గవర్నర్ సంతకంతో ఉండే హామీ పత్రంలో ఆ హామీ ఎంతకాలంలో చెల్లుతుందో లేదు. రిజర్వ్ బ్యాంక్ మాజీ డెప్యూటీ గవర్నర్ ఉషా తోరట్ మాటల్లో చెప్పాలంటే, "నోట్ల చట్టబద్ధ లక్షణాన్ని ఉపసంహరించుకున్నంత మాత్రాన ఆ నోటుకు ప్రభుత్వం పడే హామీ తొలగిపోయినట్టు కాదు. రిజర్వ్ బ్యాంక్ రాసి ఇచ్చిన హామీ రద్దయినట్టు కాదు. చట్టప్రకారం చెప్పాలంటే, పాత నోట్లను రిజర్వ్ బ్యాంక్ కు ఎప్పుడు తీసుకువచ్చినా వాటిని గౌరవించవలసిందే. ప్రస్తుత చర్యవల్ల చలామణీలో ఉన్న నోట్ల సంఖ్య బాలెన్స్ షీట్ లో తగ్గించి చూపవచ్చు, ఆమేరకు హామీ పడవలసిన మొత్తం తగ్గవచ్చు. కాని ఆ నోట్లు ఎప్పుడు వచ్చినా వాటికి సమానమైన మొత్తాన్ని చెల్లించవలసిన బాధ్యత ఉంటుంది గనుక ఆ నిలువ ఉంచుకోవలసిందే."

ముందే చెప్పినట్టు పెద్దనోట్ల రద్దు సమాజాన్ని అల్లకల్లోలం చేసింది. ప్రజలందరూ తమ దగ్గర ఉన్న రు. 500, రు. 1000 నోట్లు మార్చుకోవడానికి బ్యాంకుల చుట్టూ, ఎటిఎంల చుట్టూ తిరగడం మొదలెట్టారు. ప్రత్యామ్నాయ ఏర్పాట్లు జరగనందువల్ల, రోజుకొక మార్పు చేయడం వల్ల ప్రతి ఒక్కరూ అనేకసార్లు, అనేక గంటలు క్యూలలో నిలబడవలసి వచ్చింది. ఆర్థిక వ్యవస్థ కోట్లాది పనిదినాలను, అపారమైన ఉత్పాదకతను, ఉత్పత్తిని నష్టపోయింది. కొనుగోలుదార్ల చేతుల్లో డబ్బులు ఆడక డిమాండ్ తగ్గిపోయింది. చిన్న వ్యాపారుల చేతుల్లో డబ్బులు లేక సరఫరా తీసుకునేవారు లేకపోయారు. సరుకుల మార్కెట్లన్నీ కుప్పకూలాయి. ఖరీఫ్ పంట చేతికంది మార్కెట్ యార్డులకు వచ్చినప్పటికీ పాత పెద్దనోట్లు చెల్లక, కొత్త పెద్దనోట్లు రాక వ్యవసాయోత్పత్తి సక్రమంగా అమ్మకం జరగలేదు. రైతుల చేతికి డబ్బు రాలేదు. అందువల్ల రబీ పంటకు అవసరమైన విత్తనాలు, ఎరువులు కొనలేని స్థితి ఏర్పడింది. సరుకుల డిమాండ్ ఇలా కుంచించుకు పోవడంతోనూ, దారి ఖర్చులకు తగిన డబ్బు లేకా లక్షలాది ట్రక్కులు ఎక్కడివక్కడ నిలిచిపోయాయి. రవాణా రంగం ధ్వంసమైపోయింది. ఏ రోజు కూలీతో ఆ రోజు పొట్ట గడుపుకునే అడ్డా కూలీల, వ్యవసాయ, పారిశ్రామిక రోజు కూలీల బతుకు దుర్భరమైపోయింది. పెద్దనోట్ల రద్దు అమ్మకాలనూ, కొనుగోళ్లనూ దెబ్బతీయడం తో చిన్న, మధ్యతరహా వ్యాపారాలు దిక్కుతోచని స్థితిలో పడ్డాయి. మార్కెట్ సంకోచం సహజంగానే ఉద్యోగుల తొలగింపుకూ, కొత్త నిరుద్యోగానికీ దారి తీసింది.

ఈ ఇబ్బందులూ, కష్టాలూ అన్నీ తాత్కాలికమైనవనీ, రానున్న మంచి

రోజుల కోసం ఈ త్యాగాలు చేయకతప్పదనీ ధర్మపన్నాలు పలికే ప్రభుత్వానుకూల, సంఘ్ పరివార్ అనుకూల మేధావి వర్గం తయారయింది. పెద్ద నోట్ల రద్దు సమగ్రమైనది కాకపోయినా, ఒక మంచిపని, మంచి ప్రారంభం అని అనుకోవాలని, కష్టాలు భరించాలని అనడం ప్రారంభమైంది. కేంద్ర మంత్రి వెంకయ్య నాయుడు అయితే ప్రజల ఇబ్బందులను ఏకంగా ప్రసవపు నొప్పులతో పోల్చారు. నిజంగానే ఈ చర్య 'నల్లధనం' మీద, అవినీతి మీద, ధనవంతులమీద దెబ్బ అనే భ్రమలతో కొందరు సాధారణ ప్రజలు కూడ సంతోషించడం మొదలయింది. ఈ చర్యతో 'నల్లధనాన్ని' వెలికితీసి, దాన్ని దేశాభివృద్ధికీ, ప్రజాసంక్షేమానికీ వాడడం సాధ్యమేనని, ఇది తాత్కాలిక నష్టమే తప్ప, దీర్ఘకాలికంగా దేశ ఆర్థికవ్యవస్థకు మేలు చేస్తుందని కొందరు మధ్యతరగతి ఆదర్శవాదులు భావించడం మొదలుపెట్టారు. ఒక అవసరమైన, మంచి లక్ష్యాన్ని వాడుకుని తప్పుడు భావజాలాన్ని ప్రచారం చేసి, తమ దుర్మార్గానికి వాడుకోవడానికి పాలకవర్గాలు ఎలా ప్రయత్నిస్తాయో ఈ పరిణామాలు చూపుతున్నాయి. కాని గత ఏడు దశాబ్దాల భారత పాలకవర్గాల చరిత్ర తెలిసినవారెవరైనా 'భవిష్యత్తులో మంచి జరుగుతుంది. దానికోసం ఇప్పుడు త్యాగాలు చేయండి' అని పాలకవర్గాలు ఎన్నోసార్లు అన్నాయని, ఆ భవిష్యత్తు ఇంకా రాలేదని, ఆ త్యాగాలు, కష్టాలు మాత్రమే ప్రజలు భరించవలసి వచ్చిందని గుర్తించగలరు. ఇప్పుడు కూడ వాగ్దానం చేస్తున్న మంచిరోజులు ఎప్పటికి వస్తాయో, అసలు వస్తాయో రావో చెప్పలేం గాని, ప్రస్తుతానికైతే ప్రజలకు ఇబ్బందులు, ఆర్థిక వ్యవస్థ విధ్వంసం జరిగిపోతున్నాయి.

**రాజకీయ పార్టీల వైఖరులు**

అన్ని పార్లమెంటరీ రాజకీయ పార్టీలకూ నల్లధనంతో, అవినీతితో సంబంధం ఉన్నప్పటికీ, అన్నీ ఒకే తానులో ముక్కలు అయినప్పటికీ, భారతీయ జనతా పార్టీ ప్రభుత్వం తీసుకున్న ఈ చర్యను ప్రతిపక్ష పార్టీలు నామమాత్రంగా ఖండించడం మొదలుపెట్టాయి. నిర్ణయం మంచిదే గాని, అమలు మంచిది కాదని సన్నాయి నొక్కులు నొక్కడం మొదలుపెట్టాయి. ప్రతిపక్షాల బలహీనతను అవకాశంగా తీసుకుని భాజపా బాజాప్తా సమర్థనలు ప్రారంభించింది. 'దేశంలో నల్లధనం ఉందా, నల్లధనాన్ని, అవినీతిని అరికట్టాలా వద్దా, పెద్దనోట్ల రద్దుతో రియల్ ఎస్టేట్, విద్య, వైద్యం ప్రజల అందుబాటులోకి వస్తాయను కుంటున్నారా, రానున్న మేలు కోసం తాత్కాలికంగా కష్టాలు భరించడానికి సిద్ధంగా ఉన్నారా, అవినీతి వ్యతిరేక ఉద్యమకారులలో కొందరు ప్రస్తుతం అవినీతికీ, తీవ్రవాదానికీ అనుకూలంగా పనిచేస్తున్నారనుకుంటున్నారా' వంటి బూటకపు ప్రశ్నలతో మద్దతుదార్ల జవాబులు సాధించి తన చర్యకు ప్రజామోదం ఉందని మోడీ ప్రకటించాడు. బ్యాంకుల ముందు, ఎటిఎంల ముందు ఫర్లాంగుల తరబడి క్యూలు ఉన్నప్పటికీ ప్రజలు ఎక్కడా తిరగబడడం లేదంటే, తన చర్యకు ఆమోదం ఉన్నట్టేనని సరిగ్గా హిట్లర్ తనకు ప్రజామోదం ఉందని ప్రకటించుకున్నట్టుగా మోడీ ప్రకటించుకున్నాడు. ఈ నిర్ణయాన్ని వ్యతిరేకించే వాళ్లు దేశద్రోహులని, నల్లధనాన్ని సమర్థించేవారని నిందా ప్రచారానికి సంఘ పరివారం దిగింది. అక్కడికి భారతీయ జనతా పార్టీ 'నల్లధనం' అంటే ఎరగని స్వచ్ఛమూర్తి అయినట్టు, మిగిలిన పార్టీల 'నల్లధనం' గురించి, 'నల్లధనానికి' మద్దతు గురించి మోడీ ప్రగల్భాలు పలకడం మొదలుపెట్టాడు.

**అసలు కారణాలు**

అందరూ ఆమోదించే లక్ష్యాలు చూపుతూ తప్పుడు చర్య తీసుకున్నప్పుడు, అబద్ధ ప్రచారాలు సాగించి తప్పుడు చైతన్యాన్ని రెచ్చగొట్టినప్పుడు ఆ తప్పుడు చర్య పట్ల కూడ మౌనమో, అర్ధాంగీకారమో, సహనమో కనబడవచ్చు. కాని, ఆ తప్పుడు చర్య వెనుక ఉన్న అసలు కారణాలను చూపుతూ, ఆ చర్య ఎంత ప్రజావ్యతిరేకమైనదో, ఎంత తప్పుడుదో ప్రజలకు విప్పిచెప్పవలసిన బాధ్యత ప్రజానుకూల బుద్ధిజీవుల మీద ఉంటుంది. ఇటువంటి పెద్దనోట్ల రద్దు వంటి చర్య ద్వారా 'నల్లధనాన్ని' వెలికి తీయవచ్చునని కొందరు ఆర్థికవేత్తలు గతంలో కూడ అభిప్రాయపడ్డారు గాని, పెద్దనోట్ల నిష్పత్తి పెరిగినప్పుడు, ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేయాలని కూడ వారు హెచ్చరించారు. పెద్దనోట్ల రద్దు వంటి చర్య 'నల్లధనాన్ని' అరికట్టజాలదని 1978లో పెద్దనోట్ల రద్దు జరిగినప్పుడు రిజర్వ్ బ్యాంక్ గవర్నర్‌గా ఉండిన ఐజె పటేల్ అప్పటి ప్రధాని మొరార్జీ దేశాయికే చెప్పారు. అయినా పెద్దనోట్ల రద్దు విప్లవాత్మక, సాహసోపేత చర్య అని భ్రమపడేవాళ్లు ఇంకా ఉన్నారు. పుణె లో కొందరు చార్టర్డ్ అకౌంటెంట్లు, టెక్నోక్రాట్లు నిర్వహిస్తున్న అర్థక్రాంతి అనే సంఘ్ పరివార్ కు చెందిన స్వచ్ఛంద సంస్థ ఈ ప్రతిపాదనలు చాల కాలంగా చేస్తున్నది. బహుశా మోడీ నిర్ణయం వెనుక ఆ ప్రభావం ఉండవచ్చు. కాని ఈ ప్రతిపాదనలు భారతదేశపు విస్తృతి, జనాభా, ఆర్థిక వ్యవస్థ సంక్లిష్టతల గురించి పాలకుల అజ్ఞానాన్ని బైటపెడతాయి. భారత ఆర్థిక వ్యవస్థ విశాలమైనదీ, సంక్లిష్టమైనదీ, ఎనభై శాతం అసంఘటిత రంగంలో సాగుతున్నదీ అయినందువల్ల భారత ఆర్థిక వ్యవస్థ గురించి తీసుకునే నిర్ణయం ఒక కంపెనీ బాలెన్స్ షీట్ రాసినంత, ఆస్తులనూ అప్పులనూ సమానంగా చూపినంత సులభం కాదు. ఇక్కడ ప్రతి ఆర్థిక విధానమూ విత్త, ద్రవ్య, ధనసంబంధ, పారిశ్రామిక, వ్యవసాయ, వాణిజ్య విధానాలలో ప్రతి ఒక్కదానితో ముడిబడి, ఎక్కడ ఏ చర్య జరిగినా ఇతర రంగాల మీద పరస్పర ప్రభావంతో చిక్కుముడిలా ఉంటాయి. ఒక చిక్కు తీయబోతే మరొక చోట చిక్కు పడుతుంది. అసలు ఈ పాలకులకు ఒక చిక్కు తీసినట్టు నటించడమే తప్ప నిజంగా ఏ ఒక్క చిక్కూ తీయాలనే ఉద్దేశం కూడ లేదు. ఈ పాలకులు దళారీలు అయినందువల్ల, సామ్రాజ్యవాద శక్తులు, అంతర్జాతీయ ద్రవ్యపెట్టుబడి శక్తులు ఏ పని చెపితే ఆ పని చేయడం, దళారీలుగా తమ వాటా తాము దక్కించుకోవడం, దేశీయ భూస్వామ్య హిందుత్వ బ్రాహ్మణీయ శక్తుల సామాజిక పునాదిని పరిరక్షించుకోవడానికి అందులో తమ ఆశ్రితుల ప్రయోజనాలు కూడ కలపడం మాత్రమే వీరికి తెలిసిన విద్య.

**సామ్రాజ్యవాద ద్రవ్య కేంద్రీకరణ**

ఇవాళ సామ్రాజ్యవాదం, అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి దేశదేశాల వనరులు, ఆయా మార్కెట్లలో చలామణీ అయ్యే ద్రవ్యం అంతా తన కనుసన్నల్లో తిరగాలని, తనకు లాభాలు చేకూర్చిపెట్టడమే ప్రపంచ వనరులన్నిటి, మార్కెట్లన్నిటి ఏకైక లక్ష్యం కావాలని ఆశిస్తున్నాయి. ఇంటర్నెట్ సాంకేతిక పరిజ్ఞానం దానికి గతంలో ఎన్నడూ లేనంత వెసులుబాటును కలిగించింది. కాలునిలవని పెట్టుబడి లాభాల వేటలో భూగోళం చుట్టూ క్షణాల్లో ప్రదక్షిణ చేస్తున్నది. 2014 నాటికి 387.3 బిలియన్ డాలర్ల (27 లక్షల కోట్ల రూపాయల) డబ్బేతర లావాదేవీలు ఇంటర్నెట్ ద్వారా నడుస్తున్నాయి. ఈ లావాదేవీల్లో చైనా, హాంగ్ కాంగ్, భారతదేశం, తదితర "అభివృద్ధి చెందుతున్న" ఆసియన్ మార్కెట్ల వాటా 8 శాతం మాత్రమేనని, ఇది పెరగవలసి ఉందని అంతర్జాతీయ ద్రవ్య సంస్థలు అంటున్నాయి. కేవలం భారత మార్కెట్ వాటానే చూస్తే అది బహుశా ఏ మూడు శాతమో, అంతకన్న తక్కువో ఉండవచ్చు. అందువల్ల భారత మార్కెట్ లో డబ్బేతర లావాదేవీలను పెంచే డిజిటలైజేషన్ ప్రవేశపెట్టాలని, భారతదేశాన్ని కాష్ లెస్ ఎకానమీగా మార్చాలని, కేంద్రీకరించాలని సామ్రాజ్యవాద సంస్థలు ఒత్తిడి తెస్తున్నాయి. దేశంలో ఇప్పటికీ ఆర్థిక వ్యవస్థ, ద్రవ్యవ్యవస్థ 80 శాతం అసంఘటిత రంగంలోనే ఉన్నాయి. దేశంలో 53 శాతం జనాభాకు మాత్రమే బ్యాంకు ఖాతాలున్నాయి. ఇది జనాభా సగటు మాత్రమే. ఒక వ్యక్తికే నాలుగైదు బ్యాంకుల్లో నాలుగైదు ఖాతాలు ఉండే అవకాశం ఉంది గనుక దేశంలో 20 –25 కోట్ల మందికి మాత్రమే ఖాతాలున్నాయనవచ్చు. జనధన్ యోజన తర్వాత మరొక 10–15

కోట్ల ఖాతాలు చేరి ఉండవచ్చు. అందులో కూడ 43 శాతానికి పైగా ఒకసారి తెరిచి ఏ లావాదేవీలు జరగకుండా నిద్రాణంగా ఉన్నాయి. మొత్తం దేశంలో కేవలం రెండు కోట్ల క్రెడిట్ కార్డులు మాత్రమే ఉన్నాయి. పేరుకు డెబిట్ కార్డులు 56 కోట్లు ఉన్నాయని గణాంకాలు చెపుతున్నాయి గాని, మరొకపక్క అవే గణాంకాల ప్రకారం 39 శాతం ఖాతాలకే డెబిట్ కార్డు లేదా ఎటిఎం కార్డు ఉన్నాయి. ఈ అంకెలన్నీ ఎలా ఉన్నా, కేవలం 15 శాతం మంది బ్యాంకు ఖాతాదార్లు మాత్రమే డబ్బేతర రూపాలలో లావాదేవీలు చేస్తున్నారని, 85 శాతం డబ్బునే వాడుతున్నారని ద్రవ్యసంస్థలు చెపుతున్నాయి. ఇక అందులోనూ స్టాక్ మార్కెట్ మదుపు గురించి తెలిసినవారి సంఖ్య భారత జనాభాలో 10 శాతం కన్న తక్కువ.

ఈ స్థితిలో దేశంలో ద్రవ్య లావాదేవీలన్నిటి మీద తమ పట్టు పెరగాలంటే, వాటిలో నానాటికీ ఎక్కువ భాగం సంఘటిత బ్యాంకింగ్, డబ్బేతర, ఆన్ లైన్, డిజిటల్, కాష్ లెస్ రూపాలలోకి రావాలని ద్రవ్య బహుళజాతి సంస్థలు ఒత్తిడి చేస్తున్నాయి. డబ్బు రూపంలో, అసంఘటిత రంగంలో ఉంటే తమ నియంత్రణకు వీలు కుదరదని భావిస్తున్నాయి. మొదట దేశంలోని డబ్బునంతా బ్యాంకులలోకి మార్చి, డబ్బేతర లావాదేవీలు జరపమని ప్రజలను ప్రోత్సహించి, బెదిరించి, భయపెట్టి కాష్ లెస్ ఎకానమీగా మార్చాలని అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి ఆదేశం. అందుకే ప్రధాన మంత్రి నరేంద్ర మోడీ జనాన్ని మాయ చేయడానికి ఏ లక్ష్యాలు ప్రకటించినప్పటికీ, ఆర్థిక మంత్రి అరుణ్ జైట్లీ నిస్సిగ్గుగా, ఆ మాయాజాలం ఏమీ లేకుండా అసలు విషయం వెల్లడించాడు. నవంబర్ 8 తర్వాత కనీసం మూడు చోట్ల జైట్లీ ఉపన్యాసాలలో పెద్దనోట్ల రద్దు లక్ష్యాలుగా నరేంద్ర మోడీ చెప్పిన లక్ష్యాలు మాటవరుసకైనా ప్రస్తావనకు రాలేదు. ఆయన స్పష్టంగా ఈ చర్య దేశంలో డిజిటల్ మనీ, కాష్ లెస్ ఎకానమీ ప్రవేశపెట్టడానికి మాత్రమే అని కుండబద్దలు కొట్టాడు. అయితే అది అసాధ్యం. ఈ పాలకులు ఎంతగా తలచుకున్నప్పటికీ, ఇంకా నలభై శాతం నిరక్షరాస్యులుగా ఉన్న, 62 శాతం జనాభా గ్రామీణ ప్రాంతాల్లోనే ఉన్న ఈ దేశంలో డిజిటలైజేషన్, కాష్ లెస్ ఎకానమీ, ప్లాస్టిక్ మనీ అనే మాటలు అర్థరహితంగా మిగులుతాయి. దేశంలో ఉన్న రెండు లక్షల ఎటిఎం మెషిన్లలో 70 శాతం, బ్యాంకుల్లో 65 శాతం పట్టణ ప్రాంతాల్లోనే ఉన్నాయంటేనే ఈ ఆర్థిక వ్యవస్థను కాష్ లెస్, డిజిటల్ ఆర్థిక వ్యవస్థగా మార్చడం ఎంత అసాధ్యమో తెలుస్తుంది.

**దివాళా ఎత్తిన బ్యాంకులకు సహాయం**

అటు అంతర్జాతీయ ద్రవ్య వ్యాపారుల ప్రయోజనాలు మాత్రమే కాదు, ఇటు దేశంలోని దళారుల, బడా పెట్టుబడిదారుల, భూస్వామ్య వర్గాల ప్రయోజనాలు కూడ పరిరక్షించడానికి ఈ పథకం తయారయింది. ప్రజల దగ్గర ఉన్న ధనాన్నంతా బ్యాంకులకు చేర్చి దాన్ని కార్పొరేట్లకు అందుబాటులో ఉంచడం, కార్పొరేట్లకు మరిన్ని రుణాలు ఇవ్వడానికి బ్యాంకులను సిద్ధం చేయడం, బ్యాంకులను దివాళా ఎత్తకుండా కాపాడడం ఈ చర్యలో అంతర్గత ప్రయోజనాలు. భారతీయ బ్యాంకులకు తక్షణమే రు. 1.25 లక్షల కోట్ల పెట్టుబడులు అవసరమని అంతర్జాతీయ క్రెడిట్ రేటింగ్ సంస్థ మూడీస్ కొన్ని వారాల కిందనే ప్రకటించింది. పదమూడు ప్రభుత్వ రంగ బ్యాంకులకు ప్రభుత్వం జూలైలో రు. 23,000 కోట్లు సమకూర్చింది. రానున్న నాలుగు సంవత్సరాలలో ప్రభుత్వ రంగ బ్యాంకులలోకి రు. 70,000 కోట్లు తరలిస్తామని ఆర్థిక మంత్రి అరుణ్ జైట్లీ 2015లో అన్నాడు.

అసలు ఈ సమస్య అంతా ఎందుకు వచ్చింది? బ్యాంకులు తమ దగ్గరికి చేరిన ప్రజాధనాన్నంతా కార్పొరేట్లకు, పారిశ్రామికవేత్తననీ, వ్యాపారవేత్తననీ చెప్పుకుని తమ దగ్గరికి వచ్చిన రాజకీయ నాయకుల ఆశ్రితులకు ఎవరికి పడితే వారికి రుణాలిచ్చారు. వారు తీసుకున్న రుణాలు ఎగ్గొడితే 'వడ్డీ ఇవ్వకపోయినా సరే అసలు ఇవ్వండి', 'మొత్తం ఇవ్వకపోయినా సరే సగం ఇవ్వండి' అని దేబిరించారు. మేళాలు పెట్టి రుణాల చెల్లింపుల రాయితీలు, మినహాయింపులు ప్రకటించారు. తమ ఖాతాపుస్తకాలలో అప్పులు పెరిగినట్టు కనబడగూడదని, ఆ అప్పుల అంకెలను బాలెన్స్ షీట్లనుంచి తొలగించారు. చిన్న సన్నకారు రైతులు పదివేలు, ఇరవై వేలు బాకీ పడితే ఇంటి ముందుకు వచ్చి నానా యాగీ చేసి, చెంబూ తప్పేలా బైటపడేసి, అవమానపరిచి, వారు ఆత్మహత్యలు చేసుకునేలా ప్రవర్తించిన బ్యాంకు అధికారులు, నడిపే రాజకీయ నాయకత్వాలు, వందల కోట్ల, వేల కోట్ల పెద్దల రుణాలను మాత్రం చూసీ చూడనట్టు వదిలేశారు. ఆ మొండి బకాయిల, దొంగల పేర్లయినా బైటపెట్టమని అడిగితే, అది అధికారిక రహస్యాల చట్టం కిందికి వస్తుందని, వారి హక్కులకు భంగకరమని, వారి పేర్లు బైటపెడితే వ్యాపార వాతావరణం దెబ్బతింటుందని ప్రభుత్వాలే నిస్సిగ్గుగా న్యాయస్థానాల ముందర కూడ చెప్పాయి. అలా ఎగ్గొట్టిన రుణాలు దాదాపు పది లక్షల కోట్ల రూపాయలు ఉండవచ్చునని ఒక అంచనా. పోయినవి పోగా నాన్ పర్ఫార్మింగ్ అసెట్ అనే ముద్దు పేరుతో బ్యాంకులు పిలిచే ఈ మొండి బకాయిలు ప్రస్తుతానికి రు. 6,00,000 కోట్లు ఉంటాయని ఒక అంచనా. ఇటువంటి చర్యలవల్ల ప్రభుత్వ రంగ బ్యాంకులన్నీ దివాళా తీసే స్థితిలో ఉన్నాయి. వెంటనే వాటికి డబ్బులు అందకపోతే మళ్లీ కొత్తగా రుణాలు ఇవ్వలేని స్థితి ఉంది. తాజాగా వెలువడిన గణాంకాల ప్రకారం బ్యాంకుల నుంచి రుణాలు తీసుకున్న కార్పొరేట్ సంస్థల జాబితాలో అగ్రభాగాన ఉన్నవారు, వారి రుణాలు చూస్తే, భారతీయ ప్రజల ధనం ఎక్కడికి చేరుతున్నదో అర్థమవుతుంది: అనిల్ అంబానీ – రిలయన్స్ గ్రూప్ రు. 1,25,000 కోట్లు, అనిల్ అగర్వాల్ – వేదాంత గ్రూప్ రు. 1,03,000 కోట్లు, శశి రూయా, రవి రూయా – ఎస్సార్ గ్రూప్ రు. 1,01,000 కోట్లు, గౌతమ్ అదానీ – అదానీ గ్రూప్ రు. 96,031 కోట్లు, మనోజ్ గౌర్ – జేపీ గ్రూప్ రు. 75,163 కోట్లు, సజ్జన్ జిందాల్ – జెఎస్‌డబ్ల్యు గ్రూప్ రు. 58,171 కోట్లు, జిఎంరావు – జిఎంఆర్ గ్రూప్ రు. 47,976 కోట్లు, ఎల్ మధుసూదన రావు – లాంకో గ్రూప్ రు. 47,102 కోట్లు, వేణుగోపాల్ ధూత్ – విడియోకాన్ గ్రూప్ రు. 45,405 కోట్లు, జివికె రెడ్డి – జివికె గ్రూప్ రు. 33,933 కోట్లు. ఈ రుణాలలో వీరు ఎంత చెల్లిస్తారో, ఎంత ఎగ్గొడతారో ఎవరైనా ఊహించవచ్చు. ఈ గ్రూప్ లలో ఒక్కొక్కదానిలో పది పన్నెండు కంపెనీలు ఉంటాయి గనుక ఏదో ఒక కంపెనీ నుంచి నిధులన్నిటినీ తమ సొంత బొక్కసాలకు, విలాసాలకు, విదేశీ అకౌంట్లకు తరలించి, ఆ కంపెనీ దివాళా తీసిందని చూపి రుణ మాఫీ కోరతారు. అలా ఈ రుణాలలో గణనీయమైన భాగం 'నల్లధనం'గా మారిపోతుంది. కనుక ఇప్పుడు ప్రజలందరినీ భయపెట్టి బ్యాంకులకు చేర్చిన డబ్బు వాస్తవంగా 'నల్లధనాన్ని' వెలికితీయడానికి కాదు, మరిన్ని రుణాలు ఇవ్వడానికి, మరింత 'నల్లధనం' ఉత్పత్తి చేయడానికి.

అటు అంతర్జాతీయ ద్రవ్యసంస్థల ఒత్తిడి, ఇటు తమ సొంత దళారీ, బడాపెట్టుబడిదారీ, భూస్వామ్య వర్గాల ప్రయోజనాలతో పాటు, పాలకవర్గ ముఠాల మధ్య కొట్లాటలు, తమ దగ్గరి 'నల్లధనాన్ని' చక్కబెట్టుకుని, ప్రత్యర్థి రాజకీయ పక్షాల దగ్గర పోగుపడిన 'నల్లధనాన్ని' మాత్రం ధ్వంసం చేసే కుటిల రాజకీయ ప్రయోజనాలు, అందరికన్న ఒక ఆకు ఎక్కువ చదివానని రుజువు చేసుకోవాలనే పోటీలో ఉన్న నరేంద్ర మోడీ నిరంకుశ వ్యక్తిగత ఫాసిస్టు లక్షణాలు అన్నీ కలిసి దేశాన్ని అల్లకల్లోలం చేశాయి. ఈ పాలకవర్గాలకు ఈ దేశ ప్రజలతో ఎంత మాత్రం సంబంధం లేదని, ప్రజల పట్ల కనీస గౌరవాదరాలు లేవని, తమ దేశీ విదేశీ యజమానులు ఎంత దుర్మార్గానికి ఒడిగట్టమంటే అంత దుర్మార్గానికి ఒడిగట్టడానికి సిద్ధంగా ఉన్నారని పెద్దనోట్ల రద్దు చూపుతున్నది. ఈ పాలకవర్గాలను కూలదోసే ప్రజారాశులను విశాల ఐక్యసంఘటనలో సమీకరించి, సంఘటితం చేసి పోరాటానికి సన్నద్ధం చేయడం మినహా ప్రగతిశీల శక్తులకు తక్షణ గత్యంతరమేమీ లేదు.

*(రచయిత వీక్షణం సంపాదకులు)* వీ

# కష్టాల కడలిలో ప్రజలు

***పెద్ద నోట్ల రద్దు నిర్ణయంతో కొద్ది మంది అక్రమ సంపాదన పరులు బ్యాంకు అధికారులను లొంగదీసుకొని తమ అక్రమ సంపదను చలామణీలోకి తెస్తుంటే మెజారిటీ కష్టజీవులకు జీవనోపాధి లేక జీవికే కష్టమవుతుందని అంటున్నారు డా. కత్తి పద్మారావు***

నల్లధనం అనగానే స్వదేశీ నల్లధనం, విదేశాల్లో దాచుకొన్న ధనం అనే రెండు రకాలుగా ఉంటుంది. భారత ప్రధాని మోడీ నవంబర్ 8వ తేదీ చేసిన ప్రకటన స్వదేశీ నల్లధనం ఉన్నవారికి కొంత షాక్ ఇచ్చిన మాట నిజం. వికీలీక్స్ వ్యవస్థాపకుడు జూలియన్ అసాంజే, సి.ఐ.ఏ గుత్తేదారు నల్లధనం గురించి బయటపెట్టిన అంశాలు భారతదేశంలోని నల్లకుబేరుల గుండెల్లో రైళ్లు పరుగెత్తించాయి. స్విట్జర్లాండ్ ప్రభుత్వం కూడా తమ బ్యాంకుల్లో భారతీయుల రహస్య ఖాతాల వివరాలను భారత ప్రభుత్వానికి అందించింది. ఈ ఖాతాల కోసం స్వయంగా భారత ప్రభుత్వమే విజ్ఞాపన పంపింది. ఖాతాదారులంతా పలుకుబడి కలిగినవారు కావడంతో వారిమీద చర్యలు తీసుకున్న దాఖలా లేదు.

రాజకీయ పార్టీలకు విదేశీ నిధులు అందడంపై ఒకప్పుడు పార్లమెంటులో పెద్ద దుమారమే రేగింది. ఈ వ్యవహారం మీద కేంద్ర దేశీయాంగ శాఖ విచారణ జరిపినా, ఇంతవరకు దాని నివేదిక వెలుగు చూడలేదు. కానీ, వామపక్షాలతో సహా అన్ని ప్రధాన రాజకీయ పార్టీలకు స్విట్జర్లాండ్, అప్పటి పశ్చిమ జర్మనీ బ్యాంకుల్లో రహస్య ఖాతాలున్నట్లు నివేదిక పేర్కొన్నదని అనధికార సమాచారం. భారతీయ రాజకీయ నాయకులు, వ్యాపారవేత్తల నల్లధనం స్విస్ బ్యాంకుల్లో మూలుగుతోందని సామాన్యుడికీ తెలుసు.

భారతీయుల విదేశీ ఖాతాలను బయటపెట్టిన పనామా పత్రాలు అందరికీ తెలిసిన అంశాలనే మరోమారు రూఢీ చేశాయి. ఘరానా మనుషుల గుట్టు బయటపెట్టిన సాహసిక పాత్రికేయులు అన్నివిధాలా అభినందనీయులు. ఈ పత్రాల సేకరణ విశ్లేషణలకు ఆరునెలలకు పైనే పట్టిందని వారు వెల్లడించారు. పనామా పత్రాల్లో భారతీయ ఖాతాల గురించి దర్యాప్తు జరపడానికి ప్రధానమంత్రి నరేంద్రమోడీ ఒక బృందాన్ని నియమించారు. నల్లధనం ఇతర దేశాల్లో దాచుకొన్నవారి లిస్టు ఉన్నప్పటికీ కూడా ఎందుకు భారత ప్రభుత్వం ఆ నల్లధనాన్ని బయటకు తీయలేకపోయింది.

నరేంద్రమోడీ రాజ్యానికి వచ్చినప్పుడు ఆయన ప్రజలకు వాగ్దానం చేసిన మొదటి అంశం ఇతర దేశాల్లో ఉన్న నల్లధనం ఎంతటివారిదైనా బయటకు తీస్తామని, నవంబర్ 8న 500, 1000 నోట్ల రద్దు చేసి ఎందుకు 15వ తేదీ నాటికే 48 వేల కోట్ల రూపాయలను ఎందుకు రద్దు చేశారు. అందులో కింగ్‌ఫిషర్ విజయ్‌మాల్యాదే 1200 కోట్లు రద్దు చేయబడడం లేదా చెల్లించని పద్దుల్లో రాయబడడం ప్రభుత్వం బడా పెట్టిబడిదారుల వేపు మొగ్గుతున్నట్టు ప్రజలకు స్ఫురించటం లేదా! అరుణ్‌జైట్లీ ఈ విషయాన్ని ఎంత సర్దాలని చూసినా ప్రభుత్వ విధానం బ్యాంకుల్లో డబ్బు ఎగ్గొట్టినవారిని రక్షించడానికే అనే అంశం బయటకు రాలేదా? ఒకపక్క దేశంలో నల్లడబ్బు దేశ జిడిపిలో 25-75 శాతం మధ్యలో ఉంది. ప్రస్తుతం చలామణిలో ఉన్న కరెన్సీ మొత్తం జిడిపిలో 12 శాతం ఉంటుంది. ఇందులో 86 శాతం 500, 1000 రూపాయల నోట్ల పరిధిలో ఉన్నప్పుడు 86 శాతం మంది ప్రజలు నల్లధనానికి సంబంధంలేనివారు ఈ ప్రకటన వలన ఆర్థిక సంక్షోభంలోకి నెట్టబడ్డారు. నిత్యావసరాలు కూడా కొనుక్కోలేని దౌర్భాగ్య పరిస్థితుల్లోకి నెట్టబడడమేకాక, టీనీళ్ల కోసం రోడ్ల మీద బిక్షగాళ్లుగా మారారు. చంటిపిల్లల్ని చంకన వేసుకొని బారుల్లో నిలబడడం, బ్యాంక్ లైన్లలో నిలబడే కొందరు మరిణించడం ఎంత దయనీయమైన విషయం.

భారతదేశ వ్యవస్థకు మేలు జరగాలన్నప్పుడు, పేదల అభ్యున్నతే కోరినప్పుడు ముందు చిన్న నోట్లను కావాల్సినన్ని ముద్రించుకొనికదా ఈ రద్దు కార్యక్రమం చేయవలసింది అని ప్రజలందరి నోట వినిపిస్తున్న మాట! మరొకపక్క గాలి జనార్ధనరెడ్డి కూతురు పెండ్లి కోసం 500 కోట్లు ఖర్చు పెట్టాడనే వార్త దుమారం రేపుతుంది. మారొకపక్క నరేంద్రమోడీ 'చాయ్‌వాలా' నుండి పైకి వచ్చాడు. మరి ఆ చాయ్‌వాలాకు చిల్లరలేందే పాలు, పంచదార, బడ్డీకొట్టు అద్దె, ఇంటి అద్దె, బియ్యం సరుకులు అతనికి ఎలా వస్తాయి. చిన్న కొట్టు మీద బతికేవారు భారతదేశంలో కోటిమంది ఉన్నారు. ఈ కొట్లన్నీ చిల్లర లేక మూతబడ్డాయి. పొలంలో అదేరోజు పురుగుమందు కొట్టకపోతే చేనుకు తెగులుబడుతుంది. రోజు కూలీలకు చిల్లర లేక పనులు లేవు, ఎందరో వ్యవసాయ కూలీలు రేపటి నుండి అర్ధాకలితో, పస్తులతో జీవిస్తున్నారు. వారి జీవన సంక్షోభాన్ని అనుభవించడానికి మూలం ఈ నిర్ణయం కారణం కాలేదా! ప్రజలకు జీవించే రాజ్యాంగ హక్కు మీద ఇది గొడ్డలి వేటు కాదా!

కొంతమంది మంత్రులకు, ముఖ్యమంత్రులకు ఈ విషయం ముందే తెలిసి నలుపును తెలుపు చేసుకున్నారనే అంశాలు బయటకు వస్తున్నాయి. మహారాష్ట్ర బిజెపి మంత్రి 91 లక్షలు తరలిస్తూ చిక్కుల్లో పడ్డాడు. ఈ సొమ్ము సుభాష్‌దేశ్‌ముఖ్ సంస్థకు చెందినదని తెలుస్తుంది. బిజెపి మద్దతిస్తే యోగులు, స్వాములు, మతమతాల దగ్గర ఎంత నల్లధనం అనేక మార్గాల్లో తెలుపవుతుందో పేద ప్రజలు గమనించడంలేదా! మరొకపక్క పింఛన్‌దారులకు ఆంధ్రప్రదేశ్‌లో పింఛన్లు అందవని ఆందోళన చెందుతున్నారు. రాష్ట్రవ్యాప్తంగా 44.5 లక్షల మందికి పింఛన్లు ఇస్తుండగా, వృద్ధాప్య పింఛన్ పొందువారు 25 లక్షల మంది, వితంతు పింఛన్లు పొందే వారు 10 లక్షల మంది ఉన్నారు. ఇంకా నేత, గీత కార్మికులకు అభయహస్తం కింద స్వయం సహాయక సంఘాల మహిళలకు ఇచ్చే అన్ని పెన్షన్లు కలిసి 450 కోట్ల నుండి 500 కోట్ల వరకు ఇవ్వవలసి రాగా వారందరికీ 100 రూపాయల నోట్లుగా ఇవ్వడానికి బ్యాంకుల్లో వీలుపడదని తెలుస్తుంది. వృద్ధులు, వితంతువులు, కార్మికులు నెలమొత్తం

ఆ వెయ్యితోనే బతకాలి మరి. ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి నిబ్బరంగా అంతా ఆన్‌లైన్‌లో నడిపిస్తానంటున్నాడు. చంద్రబాబు నిబ్బరానికి ఆంతర్యమేమిటో ప్రజలకు అంతుబట్టటం లేదు. చంద్రబాబునాయడు కాని, కె.సి.ఆర్ కాని ఒకే విధానాలు అనుసరిస్తారు. వారికొచ్చే అప్రతిష్టలను తమ ప్రకటనల ద్వారా ప్రతిష్టగా మార్చుకోవాలని చూస్తూ ఉంటారు. నరేంద్రమోడీకి వత్తాసుగా ఉంటారు. ఒకపక్క మమతాబెనర్జీ, కేజ్రీవాల్, ఏచూరి, మాయావతి వంటివారంతా ప్రజల కష్టాలను ఏకరువు పెడుతుంటే, దీర్ఘకాలిక ప్రయోజనాల గురించి వీరు మాట్లాడుతున్నారు.

'రాజకీయ పార్టీలు' రేపు ఓటర్లకు 2000 కాగితాలు తప్పక పంచుతాయి వీరేమీ నీతిమంతులు కాదు అని ప్రజలు ముచ్చటించు కొంటున్నారు. రెండు రాష్ట్రాల్లోని సంక్షేమ హాస్టళ్లలోని పిల్లలు చలికి వణుకుతున్నారు. మొత్తం రెండు రాష్ట్రాల్లో ఉన్న సంక్షేమ హాస్టళ్లలో విద్యార్థులకు సరైన ఆహారం లేక, కప్పుకోవడానికి దుప్పటి లేక, స్నానం చేయడానికి సబ్బు లేక, వేసుకోవడానికి ఉతికిన బట్టలు లేక మురికికూపాల్లో జబ్బులతో మగ్గుతున్నారు. ఇద్దరు ముఖ్యమంత్రులు సబ్‌ప్లాన్ నిధులను అంతా వాళ్ల ఖాతాల్లో వేసుకుని వారిష్టమొచ్చినవాటికి వాడుకుంటున్నారు. ఒకపక్క గిరిజనులు విషజ్వరాలతో అల్లాడిపోతున్నారు. మగ్గంలో ఉన్న నేతన్న అటు పనిలేక, ఇటు అన్నం దొరక్క, దుర్భరమైన పరిస్థితుల్లో ఉన్నారు. ఎస్‌సి, ఎస్‌టిలు పిల్లలను స్కూళ్లకు పంపకుండా పిల్లల్ని పనిలోకి తీసుకువెళ్లటం వల్ల స్కూళ్లలో పిల్లల సంఖ్య బాగా తగ్గిపోతుంది. అటు విద్య, ఆరోగ్యం కుంటుపడి రెండు రాష్ట్రాలు కునారిల్లుతుంటే, ఇదే సందర్భంలో 500, 1000 రూపాయల నోట్లు రద్దు జరిగి ప్రజలు జీవన సంక్షోభంలో కూరుకుపోయి పొయ్యి మీద కుండ పెట్టలేని పరిస్థితుల్లో 'అమ్మా ఆకలి' అంటుంటే పిల్లలకు సమాధానం చెప్పలేక, పచారి కొట్టుకు వెళితే కొట్లు మూసేసివుంటే దేశంలో ఈ సంక్షోభం ఎందుకు వచ్చిందో మామూలు మనిషికి అర్థంకాక, తల్లడిల్లిపోతున్న ఒక పెద్ద ఉపద్రవం భారతదేశంలో నడుస్తుంది. మరొకపక్క నరేంద్రమోడీ ధైర్యంగా ఎందుకు వచ్చి పార్లమెంట్‌లో సమాధానం చెప్పలేకపోతున్నాడు. వెంకయ్యనాయుడు వాచాలత్వం వల్ల ప్రభుత్వం ఇంకా ఊబిలోకి కూరుకుపోతుందా! నిజానికి రూపాయి పతనం ఎందుకవుతుందో ప్రజల్లో ఎక్కువ అవగాహన లేదు. అసలు రూపాయి ఎలా సృష్టవుతుంది? ఈ రూపాయిలు ధనవంతుల చేతుల్లోనే ఎక్కువ ఎందుకు ఉంటాయి?

మన కళ్లకు కనపడుతున్న భూమి 80 శాతం కొన్ని కులాల చేతుల్లోనే ఎందుకుంది? వీటన్నింటికీ సమాధానాలు చెప్పలేక 'మా కర్మ! దేవుడు వాళ్లకు అలా రాశాడు, మాకు ఇలా రాసిపెట్టాడు' అని ప్రజలు తమను తాము నిందించుకుంటుంటారు. కానీ ప్రభుత్వానికి పన్నులు మాత్రం సామాన్య ప్రజలే నిక్కచ్చిగా కట్టేది. కరెంటు బిల్లులు, ఫోన్ బిల్లులు, ఇంటి పన్నులు, నీళ్ల పన్నులు అన్నీ కడుతూనే ఉంటారు. కానీ పన్ను కట్టకుండా డబ్బు దాచుకునే వాళ్లు మాత్రం విలాసవంతమైన వస్తువులు కొన్నుకుంటుంటారు. కోట్ల రూపాయలతో కార్లు కొంటే వాటిని అందరు కొనియాడతారు. కానీ కోట్ల రూపాయలు ఎలా వచ్చాయని అడగరు. నిజానికి ప్రభుత్వం పన్ను కట్టే సామాన్యుడి పక్షంలో లేదు.

పోలీస్‌స్టేషన్, ఎంఆర్‌ఓ ఆఫీసు, ఎండిఓ ఆఫీసు, కరెంటు ఆఫీసు, రైల్వేస్టేషన్ అన్ని కూడా ధనవంతులకు ఆన్‌లైన్ ఫెసిలిటీ ఉన్నవాళ్లకే ఎక్కువ సేవలు చేస్తారు. కానీ రోజుకు ఒక 150, 300 కూలీ తెచ్చుకునేవాళ్లకి ఆ రోజు వస్తువులు ఆ రోజే కొనుక్కోవడం తెలుసుకాని, ఖరీదైన వస్తువులు కొని తెచ్చుకోవడం తెలీదు.

ప్రపంచంలో అత్యంత ఎక్కువ విదేశీ మారక ద్రవ్యం ఉన్న దేశంగా భారతదేశానికి పేరు ఉంది. భారతదేశం నుంచి వలస వెళ్లిన ప్రవాస భారతీయులు లక్ష కోట్ల రూపాయల పైన పంపిస్తున్నారని లెక్కలు చెప్తున్నాయి. వీరు పంపే డబ్బుతో కట్టే రియల్‌ఎస్టేట్ భవనాలకు కూలీలుగా జీవిస్తున్న ఎస్‌సి, ఎస్‌టి, బిసి, మైనార్టీలు నవంబర్ 8వ తేదీ నుంచి కూలీ లేక రోడ్ల మీద అన్నార్తులుగా నిలబడుతుంటే, భారతదేశం రత్నగర్భ కర్మభూమి, పుణ్యభూమి అని చెప్పుకుంటున్న దేశంలో కార్మికుడికి, కూలీకి, నేత పనివాడికి, పొలంలో పనిచేసే వ్యవసాయ కూలీకి అన్నం కరువైంది. వాళ్లే కాదు రైతులు కూడా ముఖ్యంగా కరువు జిల్లాల్లో రైతులు అటు పొలాలు ఎండిపోతుంటే, ఇటు కడుపు మాడిపోతుంటే, ఇటు పిల్లల పొట్టలు వెన్నుపూసలకు అంటుకుపోతుంటే, అటు వృద్ధుల కన్నులు పీక్కుపోతుంటే, స్త్రీలు ప్రసవానికి ఆస్పత్రులకు వెళ్లలేకపోతుంటే, మంత్రులు, సామంతులు మాత్రం తమ నల్లధనాన్ని తెల్లధనంగా మార్చుకోవడం కోసం బ్యాంక్ మేనేజర్లను ప్రభావితం చేస్తున్న వైనం భారతదేశాన్ని కుదిపివేస్తుంది. అవినీతి, లంచగొండితనం, నల్లవ్యాపారం, మాదక ద్రవ్యాల వ్యాపారులతో దేశం అట్టడుకిపోతుంటే సంవత్సరాలకు తరబడి బియ్యం, కందిపప్పు, పచ్చిశనగపప్పు, చింతపండు నిల్వ వుంచుకున్న ధనవంతులకు సెగ తగలడంలేదు. సామాన్య ప్రజలు పిల్లవాడికి ఉగ్గిన్నుడు పాలివ్వడానికి లేక తల్లి వ్యధ చెందుతున్న దుఃఖార్తమైన పరిస్థితులు భారతదేశంలో నెలకొన్నాయి.

డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ రాజ్యాంగం రచించేటప్పుడు ప్రజలకు జీవించేహక్కును ముందు ఇచ్చాడు. ఏ పాలకుడైనా ప్రజలు ఆహారానికి, నీటికి, బట్టకు, నివాసానికి, వెలుగుకు, నిత్యావసరాలకు భంగం కలగకుండా పాలించాలని తన రాజ్యాంగంలో స్పష్టంగా చెప్పాడు. ఏ ప్రకటన అయినా ప్రజలకు పారదర్శకంగా ఉండాలని, ప్రజలను ఉత్తేజపరిచేదిగా పాలకుల ప్రకటనలు ఉండాలని, ప్రజలు పాలకుడిపై విశ్వాసం కలిగేటట్లు వ్యవహరించాలని, భారీ దోపిడీల నుంచి బలవంతపు వడ్డీ వ్యాపారుల నుంచి రక్షించడానికి నిర్దిష్టమైన ప్రణాళికలు, దీర్ఘకాలికమైన, నిర్మాణయుతమైన ఆలోచనతో కూడుకున్న ప్రగతిని ప్రజ్వలింప చేయగలిగిన నిర్ణయాలే పాలకుడు తీసుకోవాల్సి ఉంటుందని అంబేద్కర్ చెప్పారు. సుపరిపాలన, వాక్‌స్వాతంత్ర్యం, నిర్బంధం నుంచి స్వేచ్ఛ, పోరాటం చేసే హక్కు, సత్యాన్ని తెలుసుకునే బాధ్యత ఇవన్నీ రాజ్యాంగం ప్రజలకు కలుగచేసిందని డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ తన రాజ్యాంగ పరిషత్తు ఉపన్యాసాల్లో ఎన్నోసార్లు పేర్కొన్నారు.

నరేంద్రమోడీ చిత్తశుద్ధిని నిరూపించుకోవడం కోసం విదేశాల్లో దాచుకున్న బడా పెట్టుబడిదారుల, రాజకీయ నాయకుల నల్లధనాన్ని బయటకు తీసి బ్యాంక్‌లకు డబ్బు ఎగ్గొట్టి ఇతర దేశాల్లో దాక్కుంటున్న పారిశ్రామిక వేత్తలను అరెస్ట్ చేయాల్సిన బాధ్యత ఆయన మీద ఉంది. కానీ ఈనాడు ప్రజలు పడుతున్న ఆకలి సంక్షోభానికి, చరిత్రకు నరేంద్రమోడీ తప్పకుండా సమాధానం చెప్పవలసి ఉంటుంది. జీవించే హక్కును కాలరాసే ప్రకటన చేసే హక్కు ఎవరికీ లేదనే అంబేద్కర్ మాటలు ఈనాడు శిరోధార్యం.

*(సామాజిక తత్వవేత్త, వ్యవస్థాపక అధ్యక్షుడు, నవ్యాంధ్రపార్టీ)* వీ

# పెద్ద నోట్ల రద్దు - కుదేలైన పేదలు

*పెద్దనోట్ల రద్దు వెనక ప్రధానంగా రాజకీయ ప్రయోజనం ఉందని, అక్రమ సంపాదన వెలికితీత అంతంత మాత్రమేనని, దీనివల్ల సాధారణ ప్రజలు మాత్రం నానా ఇబ్బందులు పడుతున్నారని అంటున్నారు* **వై.ఎచ్.కె. మోహన్‌రావు**

మంచి పని వెనుక మంచి ఆలోచన ఉండాలి అనేది పెద్దల నానుడి. నవంబర్ 8 రాత్రి 8 గంటలు దాటిన పిదప రు. 1000, రు. 500లు పెద్ద నోట్లు రద్దు పరుస్తున్నట్లు చేసిన ప్రకటన మంచి పని అయినప్పటికీ నీడన అనేక సందేహాలు వెల్లువెత్తుతున్నాయి. దేశంలోని నల్లధనం ప్రవాహాన్ని అడ్డుకోవడం మాటున 2017 ఫిబ్రవరి, మార్చ్ మాసాలలో జరుగనున్న ఉత్తరప్రదేశ్ రాష్ట్ర అసెంబ్లీ ఎన్నికలలో ఇతర పక్షాలను ఆర్థిక వనరుల పరంగా దెబ్బతీయడమే లక్ష్యంగా మోడీ ఈ పావులు కదిపినట్లు రాజకీయ పరిశీలకులు ప్రతిపాదిస్తున్నారు. ఉత్తరప్రదేశ్‌తో పాటు మరో నాలుగు రాష్ట్రాలలో కూడా అసెంబ్లీ ఎన్నికలు జరుగుతున్న నేపథ్యంలో బిజెపి విజయం అప్రతిహతంగా సాగుతున్న గుజరాత్, మరో రాష్ట్రం పంజాబ్‌లో ఆశలు అడుగంటిన పూర్వ రంగంలో ప్రస్తుతం ఆ పార్టీకి కేవలం పెద్ద రాష్ట్రమైన యుపి పైనే బోలెడు ఆశలున్నాయి. సర్వేల ప్రకారం ఒకింత మొగ్గు కనిపిస్తున్న బిజెపి తనకు విపక్షాలుగా ఉన్న ఇతర పార్టీలను కల్లోలంలోకి నెట్టివేసే దురాలోచనే మోడీని ఈ చర్యలకు పురికొల్పిందని విజ్ఞులు పేర్కొంటున్నారు.

ఎన్నికలు సమీపిస్తున్న సమయంలో సమాజ్‌వాది, బిఎస్‌పి అన్ని వనరులను సిద్ధం చేస్తున్న తరుణంలో ఆయా పార్టీలను ఆర్థికంగా చావుదెబ్బ తీయడానికి నరేంద్రమోడీకి ఈ పథకం ఒక అస్త్రంలా కనిపించిందని విశ్లేషిస్తున్నారు. దేశంలోని నల్లధన ప్రవాహాన్ని, పాకిస్తాన్ నుండి వచ్చి మన ఆర్థిక వ్యవస్థను కుదేలు చేస్తున్న దొంగ డబ్బును, ఈ దొంగ డబ్బుతో పేట్రేగి పోతున్న ఉగ్ర మూకలను కట్టడి చేయడానికే పెద్ద నోట్ల రద్దు అంటూ నరేంద్రమోడీ చెపుతున్న సమర్థ వాక్యాల్లో నిజం ఉండి ఉండవచ్చు. అయితే వీటి సరసన యుపి ఎన్నికలలో బిజెపి రాజకీయ స్వార్థాన్ని కూడా చేర్చవలసి ఉంటుందనేది తప్పనిసరి. ఒక దెబ్బకు ఎన్నో పిట్టలు అన్న చందంగా ఉంది మోడీ చర్య.

గత రెండున్నర సంవత్సరాలుగా మోడీ ప్రవర్తన, విధానాలను నిశితంగా గమనించేవారు ఎవరైనా ఆయన నిర్ణయాలు నిజాయితీతో కూడుకున్నవని చెప్పలేకపోతున్నారు. గుజరాత్ రాష్ట్రంలో మత వైరుధ్యాలను ప్రోత్సహించి పబ్బం గడుపుకున్న మోడీ అదే ఫార్ములాను దేశ వ్యాప్తంగా అమలు పరచాలని చేసిన గిమ్మిక్కులన్నీ పెద్ద ప్రయోజనాన్ని తెచ్చిపెట్టలేక పోయాయి. ఈ నేపథ్యంలోనే బీహార్ ఎన్నికలు, దాని ఫలితాలు దిమ్మతిరిగే పరిస్థితిలోకి నెట్టాయి. అందుకే యుపి ఎన్నికల ముందు మరో సరికొత్త నాటకానికి తెర తీశాడు.

భారత సగటు పౌరుని పరిస్థితి బలహీనురాలైన తల్లి తనయునిలా ఉంది. మీరిన వాని జోలికి పోలేక బిడ్డను దండిస్తుంది. అదే విధంగా మోడీ అసహాయతవలన సామాన్య భారత ప్రజానీకమంతా ఇబ్బందుల్లో పడిపోయింది. నోట్ల రద్దు ప్రాణాలమీదకొచ్చింది. శుభకార్యాలు, వివాహాలు నిలిచిపోయే దుస్థితి ఎదురైంది. ఎన్నికల ప్రచారంతో అధికారంలోకి వచ్చిన నూరు రోజుల్లోనే స్విస్ దేశంలో మన నల్ల కుబేరులు దాచిన నల్ల ధనాన్నంతా వాపస్ తెచ్చి ఒక్కో కుటుంబానికి 15 లక్షలు జమచేస్తానని ఉత్తర ప్రగల్భాలు పలికిన మోడీ ఆ ప్రక్రియలో చతికిల పడిపోయాడు. ఆ సమస్య నుండి, తన వైఫల్యం నుండి ప్రజలను మళ్లించడానికి వారి తలగడకిందే పెద్దనోట్ల రద్దు అనే మంటను పెట్టి తను మాత్రం ప్రశాంతగా, హాయిగా నిద్రిస్తున్నాడు. నిజంగా మోడీ చెప్పే స్వచ్ఛతను, నీతిని, నిజాయితీని అందరూ ఆకాంక్షిస్తారు, ఆహ్వానిస్తూనే ఉన్నారు. నల్లధనం విషయంలో ప్రక్షాళన అంటూ తెగ గొప్పలు పోతున్న మోడీ రాజకీయాలలో కూడా మొదలెడితే చాలా సంతోషంగా ఉంటుంది. ఆ ఊసే లేకుండా రాజకీయాలన్నీ, ముఖ్యంగా తన పార్టీలో ఉన్న వారంతా అత్యంత నీతివంతులైనట్లు తెగ ఫోజులు పెడుతున్నాడు. సాధారణ ఎన్నికల ఫలితాలు వచ్చిన వెంటనే వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ తరపున ఎన్నికై తెలుగుదేశంలోకి ఫిరాయించిన ఎంపిలు ఎస్‌పివై రెడ్డి, కొత్తపల్లి గీతలపై అనర్హత వేటు వేయాలని ఆ పార్టీ లోక్‌సభ స్పీకర్ సుమిత్రా మహాజన్‌కు ఫిర్యాదు అందించి రెండున్నర ఏళ్లకు దగ్గర కావస్తుంది. అంటే పార్లమెంట్‌లో ఎంపిగా ఉండే కాలం సగానికి వెళుతుందన్నమాట. ఇప్పటి వరకూ ఆ ఫిర్యాదుపై నిజాయితీగా ఎందుకు నిర్ణయం తీసుకోలేదు. ఈ మౌనం ఏ నీతివంతమౌన రాజకీయాలకు ఆలంబన. బిజెపి తరపున ఎన్నికైన వ్యక్తికదా సుమిత్రా మహాజన్. ఆ పార్టీ ఎంపిక చేసిననందువల్లే కదా ఆమె స్పీకర్ కాగలిగింది. ఈ సందిగ్ధంపై మాన్య మోడీ ఎందుకు స్పందించరు. ఈ ఒరవడి నిజాయితీకి పట్టం కడుతుంది.

తన నోట్ల రద్దు ప్రకటనతో దేశంలోని సాధారణ పౌరులంతా హాయిగా నిద్రపోయారని మోడీ ఒక అవాస్తవ సమర్థనను పదే పదే చెప్పుకుపోవడం విడ్డూరం. ప్రకటన వెలువడిన మరు నిమిషం నుండి నగరాలు, పట్టణాల్లోని డిపాజిట్ మిషన్ల వద్దకు చేరుకుని, మిషన్లు పెద్దనోట్లతో నిండిపోగా నిరాశతో గుంపులు గుంపులుగా వెనుతిరిగింది సామాన్యులు కాదా. మీడియా మొత్తం కోడై కూసింది. కెమెరాలు పెద్దవి చేసి చూపించారు. జపాన్‌లో ఏమైనా మోడీని దృష్టి, శబ్ద మాధ్యం ఆవహించలేదు కదా? విశేషమేమంటే ఇంతదాకా బ్యాంకుల వద్దకు వచ్చింది పేదలు, దిగువ, ఎగువ మధ్యతరగతి పౌరులేనన్న విషయం విస్మరించలేని సత్యం. కార్లలో దిగి వచ్చిన సంపన్నులు కనిపించక పోవడమే విశేషం.

నల్లధనం ఎక్కువ భాగం రాజకీయ నాయకుల భాండాగారాలలోనే నిల్వ ఉన్నట్లు ఆరోపణలు వినవస్తున్నాయి. పారిశ్రామిక వేత్తలు, రియల్ ఎస్టేట్ వ్యాపారులు, బిల్డర్లు వారి వృత్తులలో ధనాన్ని ఖర్చు చేసి ఇతరత్రా అప్పుల్లో ఉంటారని, బ్యాంకుల వద్ద రుణాలు పొందుతారని సర్వత్రా వినపడుతున్న వ్యాఖ్యానం. రాజకీయ బాస్‌లే డబ్బును భౌతికంగా దాస్తారని జరుగుతున్న పెద్ద ప్రచారం. కాంగ్రెస్ నుండి బిజెపికి మళ్లిన ఒక గుంటూరు నాయకుడు తనకు నమ్మకం కలిగిన వారికి 70 శాతం చొప్పున అరువు ఇచ్చి వారి వారివద్ద ప్రోనోట్లు రాయించుకుంటున్నాడని వినికిడి. చంద్రబాబు అయితే పెద్దనోట్ల అవసరమే లేదంటున్నాడు. రిజర్వు బ్యాంకు 500, 1000, 2000లు రద్దయిన నోట్ల స్థానంలో తీసుకరావడాన్ని ఆయన నిరసిస్తున్నాడు. అంత పెద్ద డినామినేషన్ నోట్లు లేకపోతే రేవంత్‌రెడ్డి లాంటి తన అనుంగు తెలుగు తమ్ముళ్లు మోసుకు పోవడం కష్టసాధ్యమనే విషయం చంద్రబాబు మరిచిపోయినట్లున్నాడు.

నీతివంతమైన దేశం కోసం పాటుపడుతున్నానని చెప్పుకున్న మోడీ ఇటీవల ముగిసిన నల్లధనం తెలుపుగా మార్చుకునే స్కీంలో ఎందరు తమ పార్టీ వారు ముందుకు వచ్చారో ఆలోచన చేసుకోవాలి. 45 శాతం పన్నుతో తెలుపుగా మార్చుకొమ్మని ఇచ్చిన అవకాశాన్ని బిజెపి వారు వినియోగించుకున్నారా? లేదా? మోడీ విశ్లేషించుకోవాలి. దేశ వ్యాప్తంగా కార్పొరేట్ శక్తులు బ్యాంకులకు 13 లక్షల కోట్లు బకాయిలుగా ఉన్నాయి. ఈ బకాయిలు మొండిగా కూడా మారాయని బ్యాంకు యాజమాన్యాలు చెపుతున్నాయి. బకాయిలు ఉన్న సంస్థల యజమానుల ఇళ్లముందు ఆయా బ్యాంకుల వర్గాలు బాకీ చెల్లించండంటూ ఆందోళనలు చేసిన సందర్భాలూ ఉన్నాయి. 13 లక్షల కోట్ల వసూలుకు మోడీ వైపు నుండి ఏ ఒక్క చర్యా ఉండదు. ఉలకడూ పలకడూ. కార్పొరేట్ల వైపు కన్నెత్తి చూడని మోడీ సామాన్యులపై ఒంటి కాలిపై లేస్తున్నట్లుగా ఉంది ప్రస్తుత పరిణామం. ఇదిలా ఉంటే గత రిజర్వ్ బ్యాంకు గవర్నర్ రాజన్ కార్పొరేట్ బకాయిల వసూలుపై తీవ్రమైన ఒత్తిడి తీసుకురాగా, ప్రస్తుతం ఆ పదవి లోకి వచ్చిన ఉర్జిత్ పటేల్ ఈ ఒత్తిడి తగ్గించవలసిందిగా బ్యాంకులకు సమాచారం ఇచ్చారని వాణిజ్య విశ్లేషకుల భోగట్టా. పెద్దనోట్ల రద్దు చేశారు గాని, ప్రజలు ఇక్కట్లకు లోనుకాకుండా సరైన ప్రత్యామ్నాయ ఏర్పాట్లలో మాత్రం కేంద్రం, రిజర్వు బ్యాంక్ పూర్తిగా విఫలమైనట్లు స్పష్టమవుతుంది. ముఖ్యంగా గ్రామాల ప్రజలు తీవ్ర ఇబ్బందులను ఎదుర్కొంటున్నారు. బ్యాంకింగ్ వ్యవస్థ గ్రామసీమలకు దూరంగా ఉండడం మూలంగా చిల్లర కోసం యాతన పడుతున్నారు. పనులు మానుకుని గ్రామం నుండి చార్జీలు చెల్లించి సమీపంలోని బ్యాంకు వద్దకు చేరితే కొండవీటి చాంతాడంత వరుస. మూడు నాలుగు గంటలు పడుతుంది కౌంటర్ వద్దకు చేరుకునే సరికి. రోజంతా వృథా అవుతుందని తల బాదుకుంటున్నారు. పోనీ రోజు వృథా అయినా తమకు కావలసినంత నగదు మార్చి సమస్య పరిష్కరిస్తారా? అంటే! అదీ లేదంటున్నారు పౌరులు. సరిపోయినన్ని బ్యాంకులు లేవు. ఎటిఎంలలో డబ్బు ఉండదు. ఇదీ ప్రస్తుతం ప్రజలెదుర్కొంటున్న నోట్ల రద్దు ఆగచాట్ల పర్వం.

సమర్థత లేని మిడుకులంటే ఇట్లానే ఉంటాయి. ఒకనాటి ఎన్నికల కమిషనర్ శేషన్ పనితీరుని గుర్తు తెచ్చుకుంటే, ఇప్పటి ఈ వైఖరులు చేతలుడిగిన చేష్టలుగా చెప్పుకోవచ్చు. శేషన్ కేంద్ర ఎన్నికల కమిషనర్‌గా ఉన్నప్పుడు జరిగిన ఎన్నికలలో రాజకీయ పార్టీలు, అభ్యర్థులు గీతలు దాటకుండా ఏ స్థాయిలో స్వీయ నియంత్రణలో ఉన్నారో ఒకసారి నెమరు వేసుకుంటే నల్లధనంపై ఇప్పుడు మోడీ చేస్తున్న యుద్ధం అశాస్త్రీయతను వెల్లడిస్తుంది. నల్లధనం ఉన్న కుబేరులను పట్టుకోలేని కేంద్రం, ఆదాయపు పన్ను శాఖ దేశ ప్రజలందరిపైనా శరాఘాతాలను చేసే సమరం చేస్తుందని ప్రజలు వ్యాఖ్యానిస్తున్నారు. ఈ నల్లధనం వెలికితీత చర్యల వలన పెద్దనోట్ల మార్పిడి కేంద్రానికి లబ్ది చేకూర్చుతుంది. రాష్ట్రాల పరిస్థితి కుదేలవుతుంది. ఆర్థికవనరులు ధమాలుగా మారుతున్నాయి. ఇప్పటికే తెలంగాణ సిఎం కెసిఆర్ తాము తమ ఉద్యోగులకు డిసెంబర్ 2016లో నవంబర్ నెల జీతాలు కూడా ఇవ్వలేని పరిస్థితి ఉందని వాపోయారు. అదే విధంగా ఎపి సిఎం చంద్రబాబు కూడా స్వర తీవ్రత పెంచకపోయినా అదే భావనను వెల్లడించారు. నోట్ల రద్దులో లాభపడుతున్న కేంద్రం తనకు వచ్చి చేరే ఆదాయ వనరులలో రాష్ట్రాలకు కూడా కొంత మేర పంపిణీ చేసి సహకరించాలి. ఈ పరిస్థితి అంతా చక్కబడే వరకూ రాష్ట్రాల అవసరాల కోసం అర్థిక సహకారం అందించాల్సిన అవసరం ఉంది.

70 సంవత్సరాల స్వాతంత్ర్య భారతంలో కాంగ్రెస్ పార్టీ దేశానికి, ప్రజలకు అనేక అపచారాలు చేసిన మాట వాస్తవం. ఈ అపచారాలను మించి చేసిన మహాపచారమేమంటే 2014 ఎన్నికలలో మోడీ నేతృత్వంలోని బిజెపిని అధికారంలోకి రానివ్వడం. స్కాములంటూ, స్కీములంటూ, అవినీతి, ఆశ్రిత పక్షపాతాలతో హస్తం పార్టీ బస్మాసుర హస్తమై తన శిరస్సుపైనే కాక దేశ ప్రజల శిరస్సుపై కూడా పెట్టింది. అణు ఒప్పందం విషయంలో మన్మోహన్ సింగ్ చూపిన తెగువ అవినీతి విషయంలోనూ, మిత్ర పక్షాల వంకర పోకడలలోనూ ప్రదర్శించి ఉంటే తనను ప్రధాన మంత్రిని చేసిన పార్టీనీ, ప్రజలనూ సింగ్ కాపాడ గలిగేవారు. మతమంటూ, పశువులంటూ, ఆచారాలంటూ, సంస్కృతి అంటూ బిజెపికి రాజకీయాలు చేసే అవకాశముండేది కాదు. కేవలం నల్ల కుబేరులకు కాకుండా పెద్దనోట్ల రద్దు దేశ ప్రజలందరికీ శాపంగా మారకుండా ఉండేది.

అయితే బిజెపి ప్రజా వ్యతిరేక కార్యక్రమాల దూకుడుకు కళ్లెం వేసే అవకాశం అత్యంత సమీప భవిష్యత్‌లోనే ఉంది. బిజెపి ఏతర పార్టీలకు యుపి ఎన్నికలు ఒక వరంలా దగ్గరకొచ్చాయి. అంటే ఈ ఎన్నికలలో వారంతా ఐకమత్యంతో ప్రయాణిస్తేనే సఫలీకృతమౌతుంది. ఇందుకు ఇప్పటికే కాంగ్రెస్ ఆ దిశగా అడుగు వేసినప్పటికీ సమాజ్‌వాది నేత ములాయం ససేమిరా! అన్నారు. ఇంతటితో కాంగ్రెస్ వెనకడుగు వేయకూడదు. బిజెపి భవిష్యత్తంతా ఆధారపడి ఉన్న యుపి శాసన సభ ఎన్నికలలో కాంగ్రెస్ ముందుకొచ్చి ఎస్‌పి, బిఎస్‌పి, ఆర్‌జెడి పార్టీలతో కలిసి జట్టు ఏర్పాటు చేయాల్సిన అవసరం ఉంది. ఎస్‌పి, బిఎస్‌పిలకు ఆ రాష్ట్ర అధికార పంపిణీ అంగీకారం ద్వారా ఐక్య కూటమిగా ఏర్పడాలి. ఈ నాలుగు పార్టీలూ బిజెపిని వ్యతిరేకిస్తున్నందున ఐక్య కూటమి సాధ్యమే అవుతుంది. అందరిని ఒప్పించాల్సిన బాధ్యత కాంగ్రెస్ పైనే అధికంగా ఉంది. జట్టుకట్టి బిజెపిని యుపిలో ఓడించడం ద్వారా కాంగ్రెస్ చేసిన మహా పాపాన్ని కడుగుకోవాలని ఇక్కట్లు అనుభవిస్తున్న దేశ పౌరులు కోరుతున్నారు.

*(రచయిత గౌరవాధ్యక్షులు, గుంటూరు జిల్లా రచయితల సంఘం)* వీ

# పెద్ద నోట్ల రద్దు - నల్లధనం వెలికితీత?

***పెద్ద నోట్లను రద్దు చేసి నల్లధనాన్ని వెలికితీసినా అది సామాన్య ప్రజలకు ఉపయోగపడదనీ, ఆ ధనాన్ని మళ్లీ ప్రజా సంక్షేమానికి కాకుండా ప్రజా వ్యతిరేక విధానాలకే ఖర్చు పెడతారనీ అంటున్నారు* పి. పోలేశ్వరరావు**

ప్రధాన మంత్రి నరేంద్రమోడీ 2016 నవంబర్ 8 నుండి వెయ్యి, ఐదు వందల రూపాయల నోట్ల చలామణి రద్దు చేస్తున్నట్లు ప్రకటించారు. విషయం తెలియగానే చాలా మంది చాలా సంతోషించారు. మేధావులు, ముఖ్యంగా మధ్యతరగతి వారు, సామాన్య ప్రజలు అహో మోడీ, ఒహో మోడీ అని కీర్తించారు. ఈ ప్రక్రియ మొదలై మొదటి రోజు చాలా ఎక్కువగా, ఆ తర్వాత రోజు మొదటి రోజు కంటే కొంచెం తక్కువగా మోడీ భజన కొనసాగింది. టివిలలో, వార్తా పత్రికలలో ఇది గొప్ప అద్భుతమైన చర్యగా కీర్తించబడింది. చాలా గొప్ప పని అన్నారు. నల్లధనం ఇక కుప్పలు కుప్పలుగా బయట పడుతుందని అన్నారు. ఈ ప్రచార సాధనాల దాటికి సామాన్య ప్రజలు కూడా తమకు గొప్ప మేలు జరుగుతుందని భావించారు. మూడవ రోజు నుండి ప్రజల ఇక్కట్లు మొదలైనవి. వారి బాధలు చెప్పనలవి కాదు. వంద, యాభై, పది రూపాయల నోట్లు ప్రజలకు దొరకక చాలా కష్టమయింది. బ్యాంకులు, పోస్టాఫీసులలో వంద, యాభై నోట్లు అయిపోయాయి. ప్రజలు ఉదయం నుండి సాయంత్రం వరకు బ్యాంకుల వద్ద, పోస్టాఫీసుల వద్ద పెద్దగా బారులు తీరినారు. సామాన్య ప్రజలు తమ పనులన్నీ మాని చిల్లర కోసం పడిగాపులు కాయవలసి వచ్చింది. దీన్ని అదునుగా వెయ్యి నోటికి దొమ్మిది వందలు, ఐదు వందల నోటుకి నాలుగు వందలు అని కొందరు హవాలా ఏజెంట్లు ప్రజల అవసరాలను డబ్బు చేసుకున్నారు. ఇప్పటికీ అది జరుగుతుంది. నాల్గవ రోజు నుండి వంద రూపాయల నోట్లు లేక తాపి పనివారు, వడ్రంగి పనివారు పనికి రాలేకపోయారు. 2016 నవంబర్ 16 వరకు కూడా వారు పనిలోకి ప్రవేశించలేదు.

వంద నోట్లు లేక మాత్రమే. ఉదయం నుండి సాయంత్రం వరకు ప్రజలు పాలకు, కూరగాయలకు, చిల్లర సరుకులకు, పండ్లకు ఎన్నో రకాలుగా ఇబ్బందులకు గురయ్యారు. బజ్జికొట్టు వాళ్లు, కిరాణా షాపుల వాళ్లు, హోటల్ వాళ్లు, పాల బూతుల వాళ్లు, మందు షాపుల వాళ్లు, పండ్ల దుకాణాదారుల వద్ద చిల్లర నోట్లు లేకపోవడంతో ప్రజలు ఇబ్బందులకు గురయ్యారు. వారి వ్యాపారాలు ఘోరంగా దెబ్బతిన్నాయి. ప్రజలు ఇప్పటికీ ఆ కష్టాలకు గురవుతున్నారు. బ్యాంకుల వద్ద, పోస్టాఫీసుల వద్ద ప్రజలు రోజు రోజుకు పెరుగుతున్నారు. ఇలా ప్రజలు ఇబ్బంది పడుతూ ఉంటే మోడీ ఏమో గంభీరమైన ఉపన్యాసాలతో, అద్భుతంగా ప్రజల్ని తుప్తి పరుస్తున్నారు. ఇంకా అరుణ్ జైట్లీ, వెంకయ్యనాయుడు, రాజ్‌నాథ్‌సింగ్, మంత్రులు, పాలక వర్గ ఎంఎల్ఎలు, ఎంపిలు తదితర చోటాబడా నాయకులు మోడీ చర్యను వేనోళ్ల కీర్తిస్తూ భజన చేస్తున్నారు. ఎన్‌డిఎ ప్రభుత్వానికి కొమ్ము కాస్తున్నవారు ఈ భజనలో భాగస్వాములైనారు.

ఇంత గొప్ప ప్రక్రియ మొదలు పెట్టే క్రమంలో ప్రజలు చిల్లర నోట్లు లేక పడుతున్న బాధలు గుర్తించలేక పోయారు. మోడీ నుండి ప్రభుత్వంలో ఉన్న ప్రతి మంత్రి ప్రస్తుతం ప్రజలు కొంత ఇబ్బందులకు గురి అయినా భవిషత్తులో వారికి మేలు జరుగుతుందని సన్నాయి నొక్కులు నొక్కుతున్నారు. మేము పొరపాటు చేశాం, పొరపాటు జరిగింది. వంద, యాభై నోట్ల గూర్చి సరైన ఆలోచన చేయలేదు అని ఒక్కరు కాకపోతే ఒక్కరు కూడా అనలేదు.

ఇక క్యూలో ఎక్కువసేపు నిలబడలేక కళ్లు తిరిగి పడిపోతున్న వారు చాలామంది ఉన్నారు. అట్లాగే మరణాలు కూడా సంభవించాయి. ఇప్పుడు బ్యాంకుల్లో, పోస్టాఫీసుల్లో పాత వెయ్యి, ఐదు వందల నోట్లకు బదులు రెండు వేల రూపాయల నోట్లు ఇస్తున్నారు. వాటితో మార్కెట్లో కూరలు, పాలు, పెరుగు, పండ్లు, కిరాణా వస్తువులు, బియ్యం, గోదుమలు, మందులు కొనడం కష్ట సాధ్యమవుతున్నది. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ ప్రకటన వెలువడినప్పటి నుండి ప్రజలు పడే బాధలు ఇందిరా గాంధీ ఎమర్జెన్సీ విధించిన దానికంటే చాలా ఎక్కువ. ఇంత దారుణమైన బాధను ప్రజలు ఏనాడు అనుభవించ లేదు. ఇప్పుడు సామాన్య ప్రజల జీవితం అగమ్యగొచరంగా ఉంది. వంద నోట్లు, యాభై నోట్లు ప్రింట్ వచ్చేంత వరకు ప్రజలకు ఈ బాధలు తప్పవు. కొత్త రెండు వేల నోట్లు, వెయ్యి నోట్లు, ఐదు వందల నోట్ల సర్క్యులేషన్ ఎక్కువగా ఉండడం వలన ప్రజలకు పెద్దగా ఒరిగేది లేదు. వంద, యాభై నోట్లు కావాలి.

సరే అసలు విషయానికి వద్దాం. ఈ కోటాను కోట్ల నల్లధనం బయటకు వచ్చిన తరువాత ప్రజల ప్రయోజనం కోసం ఖర్చు చేయబడుతుందా? ఆ అవకాశం ఉన్నట్లు కనపడదు. ఈ నల్లధనం ప్రజల నిత్యావరాలకు ఉపయోగపడుతుందా? ఏమాత్రం నమ్మకం లేదు. 1) మంచినీళ్ల కోసం ఖర్చు చేస్తారా? ఇప్పటి ప్రజలకు శుద్ధమైన తాగునీరు దారలేదు. కొందరు కిలోమీటర్లు నడిచి తెచ్చుకుంటున్నారు. దీనికి ఖర్చు చేస్తారన్న నమ్మకం లేదు. 2) సాగునీరు కోసం. చిన్న చిన్న డ్యాములతో రైతులకు సాగునీరు అందిస్తారా? నమ్మకం లేదు. 3) గుడ్డ కోసం. కోటాను కోట్ల మంది ప్రజలు సరైన బట్టలు లేక అనేక బాధలకు గురవుతున్నారు. హాస్టల్‌లో ఉన్న విద్యార్థులకు కావలసిన దుప్పట్లు లేక చలికి బాధపడుతున్నారు. దీనికోసం ఉపయోగిస్తారా? నమ్మకం లేదు. 4) గూడు కోసం. ఈ 70 సంవత్సరాల నుండి ప్రతి సంవత్సరం ఇళ్లు కట్టిస్తున్నట్లు ఉంటుంది. ఇప్పటికీ కొన్ని కోట్ల మంది ప్రజలకు కనీసం నివసించడానికి చిన్న గూడు లేదు. దీనికి వినియోగిస్తారా? నమ్మలేం. 5) వైద్యం కోసం ప్రజల బాధలు చెప్పనలవి కాదు. ప్రభుత్వ ఆసుపత్రుల తీరు, ప్రజల ఇక్కట్లు ప్రైవేట్ ఆసుపత్రుల దోపిడి తెలియంది కాదు. భారతదేశంలోని ప్రజలకు కనీస వైద్యం కోసం 20 లక్షల మంది డాక్టర్లు, 40 లక్షల మంది నర్సులు కావాలట. మరి వీరిని నియమించడం జరుగుతుందా? ప్రభుత్వ వైద్య శాలలో ఉచితంగా అన్ని మందులు ప్రజల అవసరాలకు ఇస్తారా? అసలు నమ్మకం లేదు. 6) విద్య కోసం.

# నల్ల ధనంతో ప్రధాని అయిన మోడీ

***అవినీతితో నల్లధనానికి కాంగ్రెస్ పునాదివేస్తే, ఆ పునాదిపైనే అధికారంలోకి వచ్చిన మోడీ నల్లధనాన్ని పారదోలడానికి పెద్ద నోట్ల రద్దే పరిష్కారం అనడంలో అర్థం లేదనీ, అవి రెండూ ఒకటేననీ అంటున్నారు* వి. హనుమంత రావు**

ప్రధాని నరేంద్రమోడీ మచ్చలేని మనిషి. అటు గుజరాత్ ముఖ్యమంత్రిగా ఇపుడు ప్రధానిగా గాని నల్లధనం జోలికి పోలేదు. కాని నల్ల ధనంతోనే ప్రధాని అయ్యారు. గుజరాత్ సంగతి నాకు తెలియదు. అలాంటి మోడీ నల్ల ధనం మీద కత్తిసాము చేస్తారా?

దేశ ప్రధానిని ఇంత మాటంటారా అని మోడీ భక్తులే కాదు, కొంత మంది ఇతరులు, కొంత మంది మేదావులు నన్ను నిలదీయవచ్చు. 2014 సాధారణ ఎన్నికల్లో ఆయన గెలవడానికి కార్పొరేట్లు, బడా వ్యాపారస్తులు డబ్బుల సంచులు కుమ్మరించలేదా? వాళ్లు తమవద్ద పేరుకుపోతున్న నల్ల ధనాన్ని విదేశాలకు తరలించగా మిగిలిన డబ్బునే మోడీ విజయానికి విరాళం ఇచ్చారని అనుకోవచ్చుగా. అసలు బిజెపి అంటేనే వర్తకుల పార్టీ అనే పేరుంది. మొట్టమొదటి బడ్జెట్‌లోనే ఆదాయపు పన్నును 30 నుంచి 25 శాతానికి తగ్గించడం ద్వారా తనను గెలిపించిన వారికి కృతజ్ఞతలు చెప్పుకోవడం కాదా? రైలు చార్జీలు అదే బడ్జెట్‌లో పెంచి సామాన్యులంటే ఆయనకెంత తృణీకార భావం ఉందో తెలియచెప్పలేదా? సాధారణ ఎన్నికల్లో 31 శాతం మంది మాత్రమే ఆయన పార్టీకి ఓటు వేయడంతో, సామాన్యులపై కోపగించి, వర్షాభావ పరిస్థితుల కారణంగా రైతాంగం గిలగిలలాడి పోతూంటే వారి మానానికి వారిని వదిలిపెట్టి, దేశ దేశాలు తిరగడానికి వెళ్లిపోలేదా? అందుకోసం ప్రజలు పన్నుల రూపంలో చెల్లించిన డబ్బు ఖర్చు చేయలేదా? నల్లడబ్బు నదీ ప్రవాహంలా ఇతర దేశాలకు తరలిపోతూంటే చూస్తూ ఊరుకొని ఇపుడు నల్లడబ్బు మీద యుద్ధం ప్రకటిస్తే నమ్మాలా?

తెల్ల దొరలు పోయి నల్ల దొరలు అధికారంలోకి వచ్చిన తర్వాత నల్ల ధనానికి జన్మనివ్వడమే కాదు, దాని విస్తరణకు తోడ్పడింది. దాని పేరే పంచాయతీరాజ్. దాని ముసుగులో గ్రామస్థాయి వరకు నల్లధనం సృష్టికి బీజాలు పడ్డాయి. రహదారుల వేయడం కాలువలు తవ్వడం లాంటి పనులు చేయడానికి గ్రామస్థాయిలో ఛోటా కాంట్రాక్టర్లు, స్థానిక కాంగ్రెస్ నాయకులే కంట్రాక్టర్లు తయారయ్యారు. జిల్లా పరిషత్ అధ్యక్షుల ప్రాపకం సంపాదించి స్థానిక భూస్వాములు తమ గ్రామాల పరిధిలో తమ కింద పనిచేసే వారిచేత పనులు చేయించి ఛోటా కాంట్రాక్టర్లను సృష్టించారు. పంచాయతీరాజ్ వివిధ స్థాయిల్లో సభ్యులైనవారు, కాంట్రాక్టర్లు కలిసి వారి వారి స్థాయిల్లో నల్లధనం సృష్టికి బీజం వేశారు. ఈ స్థాయి నుంచి జిల్లా, రాష్ట్రం, కేంద్ర స్థాయిల మధ్య లింకులేర్పడ్డాయి. పరిపాలనలో నల్ల డబ్బు ఒక అంతర్భాగమైంది. పారిశ్రామికీకరణ చేపట్టిన తర్వాత కేంద్ర మంత్రులు, ఉన్నతాధికారులకు విదేశీ కంపెనీలతో సంబంధాలు, అంటే ఇచ్చి (లైసెన్సులు) పుచ్చుకునే (లంచాలు) సంబంధాలు మొదట వేలు, లక్షలు తర్వాత కోట్లలో చేతులు మారాయి. ఇదంతా నల్ల డబ్బు కాక మరేమిటి? 1991లో ఆర్థిక సంస్కరణలు ప్రవేశపెట్టిన తర్వాత హద్దేలేకుండా పోయి స్కాముల రూపం తీసుకొంది. ఇదంతా కాంగ్రెస్ సృష్టి. నల్ల డబ్బు వదలని జబ్బు ఎలా అయిందో చూద్దాం. నల్ల ధనం పై గత 70 సంవత్సరాల్లో కాంగ్రెస్ పలు కమిటీలను నియమించింది. పలు కమిటీలు నియమించడం అవి ఇచ్చిన నివేదికల నివ్వడం, వాటిని అటకెక్కించడం మామూలైపోయింది. కారణం ఆ కమిటీల సిఫారసులను అమలుపరిస్తే ఎంతోమంది మంత్రులు, నాయకులు, సీనియర్ అధికారులు తెగిపడతారని కాంగ్రెస్ భయం. అయితే పలువురు ప్రజానాయకులు, ఆర్థిక శాస్త్రవేత్తలు, ప్రతిపక్షాలు ఆందోళన చేయడంతో ప్రణబ్ ముఖర్జీ ఆర్థిక మంత్రిగా ఉన్నపుడు ఒక శ్వేత పత్రాన్ని విడుదల చేశారు. అయితే అది భారతీయులు విదేశాల్లో ముఖ్యంగా స్విస్ బ్యాంకుల్లో దాచుకొన్న సంపద గురించి మాత్రమే.

---

ప్రభుత్వ కళాశాలలో భోదన సరిగ్గా లేక మనం అన్ని రంగాలలోను, అన్ని విధాలుగా వెనుకబడి ఉన్నాం. ఈ వెనుకబాటును సరిచేయడానికి చర్యలు తీసుకుంటారా? నమ్మకం లేదు. (ఒకరిద్దరు మేధావులున్నా వారి సేవలు మన దేశ ప్రజలకు దక్కవు. విదేశీయులకు మాత్రమే వారి సేవలు రిజర్వు అయి ఉంటాయి) ఇంకా ప్రజల అవసరాలు తీర్చడానికి ఈ నల్ల డబ్బు ఉపయోగించ బడుతుంది అని నమ్మలేం.

ఐదు లక్షల కోట్లో, పది లక్షల కోట్లో నల్ల డబ్బు వస్తే మన ప్రభుత్వం ముఖ్యంగా పోలీసుల్ని పెంచుతుంది. ఇది కూడా అవసరమే అనుకోండి. సైనికుల్ని పెంచుతుంది. వారికి కావలసిన అయుధాలు తయారు చేయడానికి వినియోగిస్తుంది. పాకిస్తాన్ బూచిని, చైనా డ్రాగన్‌ని చూపిస్తూ ఇతర దేశాల నుండి ఆధునాతన ఆయుధాలు దిగుమతి చేసుకుంటుంది. ఈ మధ్య ఫ్రాన్స్‌లో 36 యుద్ధ విమానాలకు 64 వేల కోట్ల రూపాయలతో ఒప్పందమే కుదుర్చుకుంది. 36 చాలవు 100 కావాలని మన సైనిక అధికారులు చెపుతున్నారు. తప్పదు కదా? తప్పక దిగుమతి చేసుకోవలసిందే కదా?

నల్లధనం వెలికి తీసినా, తెల్లధనం బయటకు వచ్చినా దేశ ప్రజాక్షేమం ప్రభుత్వం, పాలకవర్గాల ఆలోచనపై ఆధారపడి ఉంటుంది. ఈ ప్రభుత్వం, పాలకవర్గాలు ఎన్ని మాటలు చెప్పినా సామాన్య ప్రజలకు ఉపయోగ పడుతుందని భావించలేం. మిలిటరికి ఖర్చుచేస్తుంది. యుద్ధ విమానాలకు ఖర్చు చేస్తుంది. ఆటం బాంబులకు, హైడ్రోజన్ బాంబులకు ఖర్చు చేస్తుంది. ఇది కూడా చాలా అవసరమే అనే మేధావులు మనకున్నారు. ఈ మేధావులకు సామాన్య ప్రజల అవసరాలు, సామాన్య ప్రజల ప్రయోజనాలు అంత ముఖ్యం కాదు మరి. చూద్దాం ఏం జరుగుతుందో.

*(రచయిత రిటైర్డ్ అసిస్టెంట్ పోస్టు మాస్టర్)* వీ

దేశంలో ఎన్నిలక్షల కోట్ల నల్ల ధనం ఉందో 2014 ఎన్నికల్లో తర్వాత వివిధ రాష్ట్రాల ఎన్నికల్లో వెల్లడైంది. అభ్యర్థులందరూ ఇన్ని లక్షల కోట్లు ఖర్చు చేసారంటూ పత్రికల్లో వచ్చిన లెక్కలు అంచనాలు మాత్రమే. అదంతా నల్ల ధనం అని వేరే చెప్పనక్కర్లేదు. మోడీ ప్రభుత్వం నియమించిన కమిటీ కూడా అదే డబ్బు గురించి మాత్రమే ఈ నల్ల ధనం ఎంతో వివిధ జాతీయ, అంతర్జాతీయ సంస్థలు తమ తమ అంచనాలు ప్రకటించాయి. ఫిబ్రవరి 2012లో సిబిఐ డైరెక్టర్ ఇచ్చిన గణాంకాల ప్రకారం విదేశాల్లో దాచిన నల్ల ధనం విలువ 500 బిలియన్ డాలర్లు. ఇతర అన్ని దేశాలకన్నా భారతీయులే ఎక్కువ ధనం దాచుకున్నారని స్విస్ బ్యాంకర్స్ అసోసియేషన్ అధికారులు 2011లోనే చెప్పారు. కాని ఆ అధికారులే ఇవి తప్పుడు లెక్కలన్నారు. నిజమైన లెక్క ఎంతో చెప్పలేదు. 2011లో ఎచ్ఎస్‌బిసిలో అకౌంట్లువున్న 782 మంది పేర్లు ప్రభుత్వానికి చేరాయని చెప్పారు గాని వాటిని వెల్లడించబోమని చెప్పారు. చెబితే లింకు భయటపడుతుందని భయం అయితే ఒక శ్వేత పత్రాన్ని విడుదల చేస్తామని చెప్పారు. దాని ప్రకారం స్విస్ ప్రభుత్వం నిర్ధారించిన లెక్కల ప్రకారం స్విస్ బ్యాంకులతో సహా ఇలాంటి దేశాల్లో దాచిన ధనం విలువ అంచనా 500 బిలియన్ డాలర్లు అని సిబిఐ డైరెక్టర్ 2012లో వెల్లడించారు.

భారతీయుల పేర్లను బహిర్గతం చేయరాదని ప్రభుత్వం తీసుకున్న వైఖరిపై మాజీ న్యాయశాఖ మంత్రి, ఇతరులు సుప్రీం కోర్టును ఆశ్రయించారు. దీనిపై 2011న సుప్రీం కేంద్రాన్ని నిలదీసింది. ఓ ఆరు నెలలు ఆగి జస్టిస్ జీవన్‌రెడ్డి నాయకత్వంలో ఒక ప్రత్యేక పరిశోధనా బృందాన్ని ఏర్పాటుచేసి నివేదికను తమకే నేరుగా అందజేయాలని సుప్రీం అదేశించింది. నల్ల ధనం విషయంలో కేంద్రం మెతక వైఖరినవలంబిస్తుందని కమిటీ అభిప్రాయపడింది. అధికారంలో ఉండి డబ్బు చేసుకొని విదేశీ బ్యాకుల్లో దాచింది కాంగ్రెస్ నాయకులు, మంత్రులు, వారిని బలపరిచే వ్యాపారులు కార్పొరేట్లే. అలాంటప్పుడు కాంగ్రెస్ తన కంటిని తానే పొడుచుకొంటుందా? అయినా సుప్రీంకోర్టు ఆదేశాన్ని కాదనలేదు జర్మనీ ప్రభుత్వం పంపిన 26 మంది పేర్లను సుప్రీంకు సమర్పించింది. తేనెతుట్టెను కదిలిస్తే తమ పీఠాలు కదిలిపోతాయి కదా. జస్టిస్ జీవన్ రెడ్డి ప్రభుత్వం ఎందుకు మెతక వైఖరిని అవలంబిస్తుందో గుర్రాల వ్యాపారి హసన్ ఆలీ వ్యవహారం చూస్తే తెలుస్తుంది. విదేశీ బ్యాంకుల్లో 380 బిలయన్ డాలర్లు దాచినట్లు వెల్లడై ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్ అతన్ని అరెస్టు చేసింది. ఎపుడో 2007లోనే ఆదాయపు పన్ను శాఖ అతని ఇంటి మీద దాడిచేసింది కూడా. అయితే ప్రభుత్వం తదనంతరం తీసుకోవాల్సిన చర్యలను తీసుకోలేదు. ఆ ఫైలును మోడీ ప్రభుత్వమైనా కదిలిస్తుందా? ఎందుకు కదిలిస్తుంది? ఇలాంటి విషయాల్లో కాంగ్రెస్, బిజెపి దొందుదొందే.

ఏ విషయం గురించైనా తక్షణ చర్య తీసుకోవాల్సి వస్తే వెంటనే చర్య తీసుకొనే బదులు ఓ కమిటీ వేయడం ప్రభుత్వానికి అలవాటు. ఆ కమిటీ నివేదికను సమర్పిస్తుంది. పరిశీలిస్తున్నాం అంటుంది ప్రభుత్వం. ప్రజలు మరిచిపోతారు ఫైలు అటకెక్కుతుంది. ఆ కోవలోనిదే 2011లో సెంట్రల్ బోర్డ్ ఆఫ్ డైరెక్ట్ టాక్సెస్ అధిపతి ఎం.సి. జోషీ నాయకత్వాన నియమించిన కమిటీ. ఇది జనవరి 2012న నివేదికను అందజేసింది. ఆ కమటీ కాంగ్రెస్, బిజెపిల బండారం బయటపెట్టింది. ఈ రెండు పార్టీలు ఎన్నికల్లో రు. 1,000–1500 కోట్లు ఖర్చు చేశాయి కాని అధికారికంగా చూపించినవి రు. 500 కోట్లు, రు. 200 కోట్లు. చర్య తీసుకోకపోగా ప్రభుత్వం తన శ్వేతపత్రంలో పన్నురేటు పెంచితే దొంగదారులు వెతుకుతారని, తగ్గిస్తే ప్రభుత్వ నియమాలు పాటిస్తారని సమర్థించుకొంది. స్వాతంత్రం వచ్చిన మొదట్లో ఆదాయపన్ను 80 శాతం ఉండగా, 30 శాతానికి తగ్గించింది. ఇపుడు మోడీ మరో 5 శాతం తగ్గించారు. తాజాగా మోడీ ప్రభుత్వం నల్లధనం వెలికితీతకు ఒక కమిటీని నియమించింది. ఇది మోడీ ప్రభుత్వం తీసుకున్న మొదటి నిర్ణయం. 2011లోనే నల్ల ధనం మీ వద్ద ఉంటే చెల్లిస్తే మీకు రాయితీలిస్తాం అని ప్రకటిస్తే, ప్రకటించిన వారు సగటున ఒక్కొక్క కోటి రూపాయలు వెల్లడించారు. ఇదే ఆఖరుసారి అని ఆర్థిక మంత్రి హెచ్చరించినా నిశ్శబ్దమే జవాబు. పరుపు కింద నేలమాళిగల్లోనూ దాస్తారనేది పూర్వకాలం పద్ధతి. నల్ల డబ్బును రియల్ ఎస్టేట్, బంగారం కొనుగోళ్లలో మార్చేస్తున్నారు. లేదా విదేశాలకు తరలించేస్తున్నారు. పనామా తాజా ఉదాహరణ.

మోడీ ప్రభుత్వం అధికారంలోకి రావడంతోనే ఒక కమిటీ ఏర్పాటు చేసిందని పైన చెప్పుకొన్నాం. రెండున్నర సంవత్సరాల తర్వాత కూడా కమిటీ నివేదిక సమర్పించలేదంటే ఆశ్చర్యపడాల్సిన పనిలేదు. ఇలాంటి విషయాల్లో కమిటీలు ఎందుకు వేస్తారో పైనే చెప్పుకొన్నాం. తాజాగా రు. 500, 1,000 నోట్లు రద్దు చేసి, అటు పాకిస్తాన్ మీద, ఇటు దేశ ప్రజల మీద ప్రతిపక్ష పార్టీల మీద యుద్ధం ప్రకటించారు మోడీ. చలామణిలో ఉన్న నోట్ల విలువ 86 శాతం ఇంత అత్యధిక శాతం విలువగల సొమ్మును సర్క్యులేషన్ నుంచి ఉపసంహరిస్తే, దేశం, మార్కెట్, ప్రజలు ఏమవుతారో మోడీ ఆలోచించలేదంటే ఆయన దేశ ప్రజల మీద ఎంతటి పాశవిక దాడి చేసారో ఆలోచించారా? కొత్తనోట్లు అచ్చువేసి బ్యాంకుల్లో ముందే ఉంచిఉంటే పాత నోట్లు తీసుకొని, కొత్త నోట్లు వెంటనే ఇచ్చే పద్ధతి అవలంబించి ఉంటే ప్రజలకు గంటలు గంటలు క్యూలో నిలబడాల్సిన అవసరం ఉండేది కాదేమో. ఈ ప్రకటనకు ముందు కొన్ని నెలలుగా ముందస్తు చర్యలు తీసుకొంటువస్తున్నాం అని అంటున్నారు. అంటే బిజెపి నాయకులకు ముందే వుప్పందిందన్న మాట. అన్ని నెలలుగా ముందస్తుగా తయారీ తిండి తిని ఉంటే, అర్ధరాత్రి ప్రకటన తర్వాత గతవారం దినాలుగా ఇన్ని మార్పులు ప్రకటించాల్సిన అవసరం ఎందుకు వచ్చింది? 86 శాతం విలువగల నోట్లను హఠాత్తుగా ఉపసంహరించడమంటే ప్రజల కొనుగోలు శక్తిని ఆ మేరకు ఉపసంహరించడమే. 1,000 రూపాయల నోట్లు ఉపసంహరించి అంతకు రెట్టింపు విలువగల నోట్లను ప్రవేశపెట్టడం ఏమిటి? అంటే ఓ బ్రీఫ్‌కేసులో లక్ష రూపాయల విలువగల నోట్లను తీసుకొని వెళ్లగలిగితే ఇపుడు రెండు లక్షల రూపాయల విలువగల నోట్లను దాటించేయవచ్చునన్నమాట.

దేశం మొత్తం మీద రోజుల పాటు లక్షలమంది క్యూలలో గంటల పాటు నిలబడి ఉండాల్సి వచ్చిందంటే ఎన్ని మ్యాన్ అవర్స్ నష్టం? 80.8 శాతం ప్రజలు బ్యాంకులు లేని గ్రామాల్లో నివసిస్తున్నారు. వారిలో అందరికీ బ్యాంకు ఎకౌంట్లు తెరిపించారు కాని బ్యాంకులే లేవు. వారేం చేయాలి? పేర్లు తెలియని దాతలు వివిధ పార్టీలకు గత దశాబ్ద కాలంలో ఎంత సొమ్ము ఇచ్చారో చూడండి. కాంగ్రెస్ రు. 3323 కోట్లు; బిజెపి రు. 2125 కోట్లు; సిపిఐ(ఎం) రు. 471 కోట్లు; బి.ఎస్.పి రు. 449 కోట్లు; నేషనల్ కాంగ్రెస్ రు. 243 కోట్లు; సిపిఐ రు. 0.29 లక్షలు.

మోడీ ప్రభుత్వం ఇలా 1,000, 500 రూపాయల నోట్లను రద్దు చేయడం చట్ట సమ్మతమేనా? రిజర్వు బ్యాంకు నియమ నిబంధనావళి ప్రకారం ఒక సిరీస్ నోట్లను రద్దు చేయవచ్చు కాని అదే విలువగల నోట్లన్నీ రద్దు చేయరాదు. దేశాన్ని ఇంత అల్లకల్లోలం చేసి ప్రధాని జపాన్‌కు పారిపోయారు!.

*(రచయిత వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు)* వీ

# ఆర్థిక సంక్షోభం దిశగా భారత్

***పెద్దనోట్ల రద్దు నిర్ణయం వల్ల అక్రమ సంపాదనాపరులు అన్ని జాగ్రత్తలు తీసుకున్నారని, సామాన్య ప్రజలు మాత్రం కూలీ పనులు దొరకక తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారనీ, ఇది ఆర్థిక సంక్షోభానికి దారితీసే ప్రమాదం ఉందనీ అంటున్నారు షేక్ కరిముల్లా***

వెనుకటికి ఎవడో ఇంట్లో ఎలుకలున్నాయని ఇల్లు తగులబెట్టుకున్నాడంటా! ఇంట్లోని ఎలుకలన్నీ పారిపోయి వేరే ఇండ్లలో తలదాచుకోగా వాడు వీధిన పడ్డాడు. ఇక్కడ నల్ల కుబేరులంతా విదేశాల్లో నల్లధనాన్ని వివిధ రూపాల్లో దాచుకోగా, పెద్ద నోట్ల రద్దుతో సామాన్య ప్రజలు మాత్రం వీధిన పడ్డారు. ప్రజల బతుకులు అతలాకుతలమై పోతున్నాయి. జేబుల్లో కట్టల కొలది డబ్బు నోట్లు ఉన్నా జ్వరం వస్తే కనీసం ఒక పారాసెట్‌మల్ బిళ్ల కూడా కొనుక్కోలేని స్థాయికి ప్రజల స్థితి దిగజారింది. ఆర్థిక జీవనం స్తంభించి పోయింది. ఈ కరెన్సీ కల్లోలంతో ప్రజలంతా కొట్టుమిట్టాడుతున్నారు. రైతులు, చిరు వ్యాపారులు, చిన్న, చితక పనులు చేసుకొని జీవనం గడిపే వారు అల్లాడిపోతున్నారు. నోట్ల మార్పిడి వ్యవహారం రాను రాను మరింత జటిలమైపోతుంది. ప్రారంభంలో నోట్ల మార్పిడి పరిమితి రు. 4,500 ఉంటే ఇప్పుడు దానిని 2000 తగ్గించి, మార్పిడి చేసుకున్న వ్యక్తి వేలిపై ఇంకు చుక్క వేస్తున్నారు. చేతినిండా డబ్బులున్నా, చలామణి చేయలేని దైన్యస్థితి. ఆర్థికవ్యవస్థ పూర్తి సంక్షోభ విషవలయంలో కూరుకుపోయింది.

ప్రజలు ఎదుర్కొంటున్న ఇక్కట్లపై దేశ అత్యున్నత న్యాయస్థానం తీవ్ర ఆందోళన వ్యక్తం చేసింది. 'బ్యాంకులు, పోస్టాఫీసుల ఎదుట భారీ క్యూలు తీవ్రమైన అంశమని, ప్రస్తుతం సామాన్యులు చాలా ఇబ్బందులు పడుతున్నారని, ఇదే పరిస్థితి కొనసాగితే అల్లర్లకు దారితీసే అవకాశం ఉందని' హెచ్చరించింది. ఇలాంటి పరిస్థితుల్లో కోర్టు తలుపులను మూయలేమని, ప్రజలు కోర్టును ఆశ్రయించే హక్కు ఉందని, పాత నోట్లు రద్దు చేస్తూ జారీ చేసిన నోటిఫికేషన్‌కు వ్యతిరేకంగా హైకోర్టులో దాఖలయ్యే పిటిషన్లను విచారణకు స్వీకరించవద్దని కేంద్రం దాఖలు చేసిన అభ్యర్థనను సుప్రీం ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ టి.ఎస్. ఠాకూర్, జస్టిస్ ఎ.ఆర్. దవేలతో కూడిన ధర్మాసనం తిరస్కరించింది. ప్రజలు ఇబ్బంది పడకుండా ఉండేందుకు ఏ చర్యలు తీసుకున్నారో లిఖిత పూర్వకంగా తెలపాలని ఆదేశించింది. ఇంత జరుగుతున్నా దున్నపోతు మీద వర్షం పడినట్లు ఉన్నది కేంద్రం వైఖరి.

ఎద్దైన ఒక నిర్ణయం లేదా చర్య తీసుకునే ముందు దాని పర్యవసానాలు ఎలా ఉంటాయి. ఏ వర్గ ప్రజలపై ఎలాంటి ప్రభావం పడుతుంది అనే అవగాహన పాలకులకు ఉండాలి. అందులో అత్యున్నత స్థానంలో ఉండే వ్యక్తికి తగిన మంచి విద్యార్హతలు, రాజకీయ ఆర్థిక విషయాల పట్ల కనీస అవగాహన ఉండి తీరాలి. ప్లేటో తన ఫిలాసఫిలో పాలించే వ్యక్తికి అత్యున్నత స్థాయి విద్య అభ్యసించిన వాడై ఉండాలంటాడు. అటువంటి వ్యక్తిని 'తాత్విక ప్రభువు'గా ఊహిస్తాడు. ఇతడికే పాలించే అర్హత ఉంటుందని అంటాడు. లేకుంటే ప్రజలకు కష్టాలు తప్పవని వివరిస్తాడు. ప్లేటో చెప్పింది నిజమని చరిత్ర అనేక సార్లు నిరూపించింది. దాదాపు 10 సంవత్సరాలు ప్రధానిగా పని చేసిన ఆర్థిక శాస్త్రం చదువుకున్న మన్మోహన్ సింగ్ కూడా చేయని పనిని మోడీ చేసి చరిత్రలో 21వ శతాబ్దపు 'తుగ్లక్'గా ఖ్యాతిగాంచాడు. ఈయన కొత్తగా తెచ్చిన రు. 2 వేల నోటుకు పదిరోజులకే నకిలీ నోట్లు తయారయ్యాయి. విజయవాడ కేంద్రంగా రు. 2 వేల దొంగ నోట్ల మార్పిడి జరుగుతుందనే వార్తలు షికార్లు చేస్తున్నాయి.

మోడీ అకస్మాత్తుగా పెద్ద నోట్ల రద్దుతో ప్రజలపై మెరుపుదాడి ఎందుకు చేసినట్లు? అనే చర్చ తీవ్రంగా జరుగుతుంది. నల్లధనంపై దాడిగా, నల్లధనాన్ని వెలికి తీయడానికని మోడీ చెప్పుకున్నాడు. కానీ వాస్తవం వేరుగా ఉంది. ఏ నల్లధనం సహాయంతో మోడీ త్రయం అధికారంలోకి వచ్చిందో, అదే నల్లధనంతో రాబోయే ఉత్తర ప్రదేశ్, పంజాబ్ సహా ఐదు రాష్ట్రాలలో జరిగే ఎన్నికలలో అధికారంలోకి రావడానికి నోట్ల రద్దుతో ప్రజలకు తిప్పలు తెచ్చిపెట్టాడు. ఇదేమిటి అనుకుంటున్నారా? మోడీ 2014 పార్లమెంటరీ ఎన్నికల ప్రచారంలో ప్రజలకు ఒక గొప్ప వాగ్దానం చేశాడు. పెద్ద మొత్తంలో నల్లధనం విదేశీ బ్యాంకుల్లో మూలుగుతున్నదని, విదేశీ బ్యాంకులలో డిపాజిట్ చేసిన నల్లధనం (దాదాపు 80 లక్షల కోట్ల రూపాయలు)ను అధికారంలోకి వచ్చిన వంద రోజుల్లో వెనుకకు తెచ్చి, ఒక్కొక్క పౌరుడి బ్యాంకు ఖాతాలో రు. 15 వేలు జమచేస్తానని మోడీ స్వయంగా ప్రకటించాడు. ఈ వాగ్దానం అమలులో ఘోరంగా విఫలమైనాడు.

ప్రస్తుత ఆర్థిక నిర్మాణం నల్లధనంను ప్రోత్సహించేదిగా ఉన్నందున నల్లధనంను లేకుండా చేయడం సాధ్యం కాని పని అని మార్క్సిస్టు ఆర్థిక నిపుణులు తేల్చి చెపుతున్నారు. మోడీ అధికారంలోకి వచ్చి రెండున్నర ఏళ్లు దాటిన ప్రజలకు చేసిందేమీ లేదు. ధరల పెరుగుదల (ఉదాహరణకు పప్పులు లాంటివి కిలో రు. 200, టమాటా కిలో రు. 100 అమారు) ఇలా ద్రవ్యోల్బణం మరో వైపు, ప్రతి ద్రవ్యోల్బణం. రూపాయి విలువ క్షీణత, నకిలీ కరెన్సీ బెడద, వరుసగా కరువు, రైతుల ఆత్మహత్యలతో మొత్తం ఆర్థిక వ్యవస్థ సంక్షోభ దశకు చేరుకుంది. గతంలో రాష్ట్రాలలో జరిగిన ఎన్నికలలో బిజెపికి చేదు అనుభవం ఎదురైంది. మోడీ పట్ల గల ఆదరణ రోజు రోజుకి తగ్గిపోతూ ఉంది. దీనివల్ల పార్టీకి నష్టం తప్పదని భావించిన పార్టీ పెద్దలు రాబోయే ఐదు రాష్ట్రాల ఎన్నికలలో ఎలాగైనా గెలవాలి. తమ వైఫల్యాలు కప్పి పుచ్చుకొని, ప్రజల దృష్టి మళ్లించాలి. నల్లధనం రాబోయే రాష్ట్రాల ఎన్నికల ప్రతిపక్షాలకు

ఆయుధం కారాదని భావించి ఆకస్మాత్తుగా పెద్ద నోట్ల రద్దును మోడీ ప్రభుత్వం నాటకీయంగా ప్రకటించి చేతులు కాల్చుకుంది. క్షేత్ర స్థాయిలో పరిస్థితిని అంచనా వేయడంలో ప్రభుత్వం విఫలమైంది. రద్దు అనంతరం ప్రజల కరెన్సీ అవసరాలను తీర్చే విషయంలో తగు ఏర్పాటు చేయడంలో ప్రభుత్వం పూర్తిగా విఫలమైంది.

ప్రజలు పనులు మానుకొని, ఎటిఎంలు, బ్యాంకుల ముందు రోజుల తరబడి నిలబడే స్థితి నెలకొంది. కొందరు ప్రాణాలు వదులుతున్నారు. మొత్తంగా ఆర్థిక జీవనం స్థంబించింది. నోట్ల రద్దు కొత్తేమి కాదు. 1946లో తొలిసారి, 1978లో రెండవ సారి జరిగింది. కానీ అప్పుడు ప్రజలు ఇబ్బంది పడలేదు. అప్పుడు చెలామణిలో పెద్ద నోట్లు కేవలం 2 శాతం. కానీ ఇప్పుడు 86 శాతం చేలామణిలో ఉన్న పెద్ద నోట్లను ఒక్క కలం పోటుతో రద్దు చేసి ప్రజలను కష్టాల పాలు చేయడమనేది ఉపఖండం చరిత్రలో ఇదే మొదటిసారి. వాస్తవానికి మొత్తం నల్లధనంలో 10 శాతం మాత్రమే నగదు రూపంలో ఉంది. మిగిలిన 90 శాతం రియల్ ఎస్టేట్, బంగారం, వజ్రాలు బులియన్ మార్కెట్‌లో బినామి లావాదేవీలలో విదేశాల్లో దాగి ఉంది. ఈ నోట్ల రద్దు 90 శాతం నల్లధనంపై ఏమాత్రం ప్రభావం చూపించే అవకాశం లేదని తేలిపోయింది. ఇంత చేసి 2000 రూపాయల నోటు విడుదల చేయడం దేనికి? ఈ పెద్ద నోట్లు నల్లధనాన్ని ఎలా అరికడతాయి? కాబట్టి మోడీ చేపట్టిన చర్య వెనుక రాజకీయ రసాయన శాస్త్ర ఉద్దేశాలున్నాయని, రానున్న ఎన్నికల దృష్ట్యా ఈ నిర్ణయాన్ని ఓ తురుపు ముక్కగా వాడుకోవాలని ఆశించి బోల్తా పడింది. మోడీ తీసుకున్న ఈ నిర్ణయం అంతిమంగా బెడిసికొడుతుంది. ఎవరు తీసిన గోతిలో వారు పడుతారన్న సామెతలా తయారైంది బిజెపి పరిస్థితి. ఫలితంగా తగిన మూల్యం చెల్లించుకోక తప్పదు.

**ఈ కరెన్సీ సంక్షోభం ఆర్థిక సంక్షోభమే**

ఆర్థిక లావాదేవీలు చాలా వరకు ఆన్‌లైన్‌లో జరుగుతున్నందున పెద్ద నోట్లను రద్దు చేయడం వలన ప్రయోజనం ఏమిటి? చాలా మందికి బ్యాంక్ ఖాతాలే లేవు. వారు పెద్ద నోట్లను ఎలా మార్చుకో గలుగుతారు? నోట్ల రద్దుతో సామాన్యుల బతుకులు అల్లకల్లోల మయ్యావే తప్ప, నల్ల కుబేరులకు కనీసం చెమటలు కూడా పట్టలేదు. నల్లధనానికి ముక్కు తాడు వేసే పద్ధతి ఇదా? అని ఈ అంశాలపై ప్రజలు అసహనంగా చర్చించుకుంటున్నారు. ఈ పరిణామాలు మన ఆర్థిక వ్యవస్థ సంక్షోభానికి చిహ్నం. 'అచ్చేదిన్' సంగతి ఎలాగున్నా, ప్రస్తుతం 'చచ్చేదిన్' వచ్చేశాయి. కరెన్సీ భౌతిక సంపదకు విశ్వ వ్యాప్తమగు ప్రతినిధి. సరకు విలువలను కొలవడం, సరకుల ప్రామాణిక ధరలను తెల్పడం ద్రవ్యం విధి. సరకు అమ్మకాలు, కొనుగోళ్ల అనేవి అప్పటి మార్కెట్లో ఉన్నటువంటి ద్రవ్యం మీద ఆధారపడి ఉంటాయి. సరిపడ డబ్బు చేలామణిలో లేనప్పుడు సరకుల ధరలు పడిపోతాయి. ఉత్పత్తి మందగిస్తుంది. నిరుద్యోగం పెరిగిపోతుంది. ప్రజల కొనుగోలు శక్తి తగ్గిపోతుంది. ఇది ఒక చైన్ సిస్టం. దేశం ఆర్థిక విషవలయంలో చిక్కుకొని, మొత్తంగా ఆర్థిక వ్యవస్థ సంక్షోభంలో కొట్టుమిట్టాడుతుంది. ఇలాంటి తరుణంలో కింగ్‌ఫిషర్ ఎయిర్‌లైన్స్ పేరిట విజయమాల్యా తీసుకున్న రు. 1200 కోట్ల రుణంతో సహా దాదాపు 63 మంది డిఫాల్టర్ల (ఎతవేత దారులు) కు చెందిన రు. 7,000 కోట్ల రుణాన్ని స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా రైటాఫ్ చేసిందన్న వార్తలు పార్లమెంట్‌ను కుదిపేశాయి. దేశంలో పెద్ద బ్యాంకింగ్ దిగ్గజం ఎస్‌బిఐకు నిరర్థక ఆస్తులు ఈ ఏడాది సెప్టెంబర్ నాటికి దాదాపు రు. 1.05 లక్షల కోట్లకు చేరాయి. టాప్ 100 మంది డిఫాల్టర్లకు చెందిన దాదాపు రు. 7.016 కోట్లను రైటాఫ్ (మాఫీ) చేసినట్లు ఎస్‌బిఐ తన ఖాతా పుస్తకాల్లో చూపించింది. ఈ వంద మందిలో విజయ్‌మాల్యాతో సహా టాప్ - 63 మంది ఎగవేత దారులు రుణాన్ని పూర్తిగా రైటాఫ్ చేయగా, మరో 31 మంది రుణాన్ని పాక్షికంగా రైటాఫ్ చేసింది. ఖాతా పుస్తకాల వివరాలతో సహా డిఎన్ఎ పత్రిక ఈ వార్తను ప్రచురించింది. 2016 జూన్ 30 నాటికి ఎస్‌బిఐ ఏకంగా రు. 48 వేల కోట్ల రుణాన్ని రైటాఫ్ చేసినట్లు తెలియజేసింది. ఈ చర్యలను పార్లమెంట్‌లో విపక్షాలు తీవ్రంగా తప్పుబట్టాయి. ఇవి గందరగోళానికి దారితీసింది.

నోట్ల రద్దుతో ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడుతుంటే మోడీ ప్రభుత్వం తీరు అగ్నికి ఆజ్యం పోసినట్లుంది. బడా కార్పొరేట్లకు రుణ మాఫీ చేయడంలో మోడీ ఉద్దేశం, లక్ష్యం ఏమిటి? విజయమాల్యాను స్వదేశానికి రప్పించడంలో విఫలం చెందిన మోడీ సర్కార్ కార్పొరేట్ వర్గాల ప్రయోజనాలే పరమావదిగా పనిచేస్తూ ప్రజల దృష్టిని మళ్లించడానికి ఇటువంటి గారడి జిమ్మిక్కులకు పాల్పడుతుంది. ఇలా కార్పొరేట్లకు అనుకూలంగా వ్యవహరించడానికి అసలు కారణం వేరే ఉంది. అన్ని రాజకీయ పార్టీలు ఎన్నికల సమయంలో ఈ బడా బాబుల నుంచి పార్టీ ఫండ్‌గా నిధులు సేకరిస్తాయి. ఓట్ల కొనుగోలు మొదలు మొత్తం ఎన్నికల ఖర్చునకు వాడుకుంటాయి. అధికారంలోకి వచ్చాక ప్రభుత్వ రంగ వాణిజ్య బ్యాంకులపై ప్రభుత్వం ఒత్తిడి చేసి మరి తమకు ఆర్థిక సహాయం చేసిన బడా బాబులకు కంపెనీలకు రుణాలిప్పిస్తాయి. తిరిగి మరి రుణాలిచ్చేలా చేస్తాయి. ఈ రూపేణ బడా బాబులు కంపెనీల రుణాన్ని తీర్చుకుంటాయి. ఇది ఇక్కడితో ఆగదు. ప్రభుత్వం ఈ కంపెనీలు అంతకు ముందు తీసుకున్న రుణాలను కూడా మాఫీ చేయిస్తాయి.

2013 - 15 సంవత్సరాల మధ్య 20 ప్రభుత్వ రంగ వాణిజ్య బ్యాంకులు మొత్తం లక్షా 14 వేల కోట్ల రూపాయల మొండి బకాయిల్ని మాఫీ చేశాయి. ఇలా మాఫీలు చేయమని బ్యాంకులపై ఒత్తిడి తెచ్చేది ప్రభుత్వమే. ఈ చర్యలతో బ్యాంకులు దివాళ. సామాన్యుడు గుల్లవడం మామూలే. ఇదియే కాక బడా బాబులు, కంపెనీలు చెల్లించాల్సిన పన్నులను కూడా (కార్పొరేట్, ఆదాయ పన్ను, కస్టమ్స్, ఎక్సైజ్ డ్యూటీస్) మాఫీ చేస్తుంది. ప్రభుత్వ బడ్జెట్ 2013 - 14 సంవత్సరానికి మొత్తం 5 లక్షల 32 వేల కోట్ల రూపాయల కార్పొరేట్ పన్నును మాఫీ చేసింది యుపిఎ ప్రభుత్వం. బిజెపి ప్రభుత్వం అధికారంలోకి వచ్చాక 2014 - 15లో మాఫీ అయిన కార్పొరేట్ పన్ను 5 లక్షల 89 వేల కోట్ల రూపాయలకు పెరిగింది. గత 10 ఏళ్లలో మాఫీ అయిన కార్పొరేట్ పన్నులన్నీ కూడుకుంటే మొత్తం 42 లక్షల కోట్ల రూపాయలకు చేరుకుంది. అంటే రోజుకు రు. 1,110 కోట్లు. అవును ప్రతి రోజూ కార్పొరేట్ శక్తులు అంత మొత్తాన్ని దోచుకుంటున్నాయి. ఇదంతా గమనిస్తే ఏ పార్టీ ప్రభుత్వమైన ఎవరి ప్రయోజనాల కోసం పనిచేస్తున్నాయో అర్థం చేసుకోవచ్చు. ఇటువంటి ప్రభుత్వాలు మనకు అవసరమా?

# 'నల్లధనం' కంటె 'తెల్లధనం' ప్రమాదకరం

**మూడు లక్షల మంది రైతులు ఆత్మహత్యలకు గురైనా కనీసం రుణ మాఫీ చేయని పాలకులు కార్పొరేట్‌ల రుణాలను మాఫీ చేస్తూ వారికి కొత్తగా మరిన్ని రుణాలు ఇవ్వడం కోసమే ఈ నోట్ల రద్దు పేరుతో బ్యాంకులు నింపుతున్నారని అంటున్నారు పి. ప్రసాద్**

తలకిందులుగా మనకు చూపించబడుతున్న ప్రపంచాన్ని మనం కూడా తలకిందులుగా చూస్తేనే తప్ప దాని వాస్తవ రూపం కనపడదు. నల్లధనానికి కూడా నిటారు రూపం, తలకిందుల రూపం రెండూ ఉంటాయి. దాని తిరగేసిన బొమ్మనే మనకు చూపించడం జరుగుతుంది. దాని వాస్తవ రూపాన్ని చూడాలంటే నిలబడి చూస్తే సరిపోదు. తలకిందులుగానే దర్శించాల్సివుంది. గత కొన్నేళ్లుగా నల్లధనం గురించి భారీ ప్రచారం సాగుతున్నది. అది వ్యూహాత్మకమైనదే. సమాజంలోని సర్వ సమస్యలకు నల్లధనమే మూల సమస్యగా ప్రచారం సాగుతున్నది. అంత స్థాయిలో మరే సమస్యలు లేనట్లుగా కూడా చిత్రించబడుతున్నది. నల్లధనాన్ని నియంత్రించితే సమాజం బాగుపడుతుందన్న భావన క్రమంగా ప్రజల్లో కూడా బలపడుతూ వచ్చింది. నిజానికి మార్క్సిస్టు విశ్లేషణ ప్రకారం సామాజిక దోపిడీ వ్యవస్థకు నల్లధనం ఇరుసు కాదు. దేవతావస్త్రాల ముసుగు ధరించి, ధర్మధనంగా అవతారమెత్తిన తెల్లధనమే దోపిడీ వ్యవస్తకు ఇరుసుగా ఉంటుంది. ఈ కుహనా ధర్మబద్ధమైన తెల్లధన విషవృక్షం నీడలో కుక్కగొడుగుల్లా పుట్టి పెరిగేదే నల్లధనం. ఈ విశ్లేషణ ప్రకారం ఈనాడు నల్లధనం గురించి జరుగుతున్న ప్రచారం అశాస్త్రీయ మైనది. మౌలిక సమస్యలను మరుగుపరిచే ప్రక్రియ కూడా.

నేడు నల్లధనాన్ని ఒక బూచిగా చిత్రించడం వెనక కుహనా తెల్లధనం కీలక పాత్రను పోషిస్తున్నది. నల్లధనాన్ని అసహ్యకరమైనదిగా చిత్రించడం ద్వారా తనను అత్యంత పూజనీయమైనదిగా చిత్రించుకునే లక్ష్యం తెల్లధనాధిపతుల వర్గానికి ఉంది. నిజానికి ఈ నాటి దోపిడీ సామాజిక రాజకీయ వ్యవస్థను పాలిస్తున్నదీ శాసిస్తున్నదీ ఈ తెల్లధనమే. అట్టి తెల్లధనాధిపతుల వర్గానికి తమ స్వీయ వర్గ ప్రయోజనాల కోసం ఒక వ్యవస్థీకృత 'ఆర్థిక యుద్ధం' చేపట్టాల్సిన చారిత్రక ఆవశ్యకత నేడు ఏర్పడింది. దానికి ఉత్ప్రేరకురాలుగా మోడీ సర్కారు వ్యవహరించింది. ఫలితమే 2016 నవంబర్ 8న 1000, 500 కరెన్సీ నోట్లను రద్దు చేస్తూ మోడీ సర్కారు ప్రకటించింది. ఇది గతంలో నాలుగు సార్లు పాకిస్తాన్‌తో, ఒకసారి చైనాతో చేసిన యుద్ధాలకంటే మన సమాజాన్ని ఎక్కువ ప్రభావితం చేసింది. ఇది నిజానికి ఆయుధాలు లేని యుద్ధం. కాని సాయుధ యుద్ధాలకంటే ఈ నిరాయుధ ఆర్థిక యుద్ధమే దేశ ప్రజల దైనందిన జీవితాలను అనేక రెట్లు అతలాకుతలం చేస్తున్నది.

గత కొన్నేళ్లుగా నల్లధనం దేశానికి అతిపెద్ద అరిష్టంగా వ్యూహాత్మక ప్రాచుర్యం పొందింది. 'ఒక ధర్మయుద్ధం' కోసం ఒక వీరభోగ వసంత రాయుడు రాక కోసం దేశ ప్రజలు ఎదురు చూసే పరిస్థితిని పథకం ప్రకారం సృష్టించడం జరిగింది. అందుకై కొన్నేళ్లపాటు ఒక సాంస్కృతిక ప్రచారం ద్వారా ప్రజలలో ఒక మానసిక భావన సృష్టించడం జరిగింది. రైతు విత్తనాలు విత్తే ముందు భూమిని ముందస్తు చదును చేసిన పద్ధతిలో ఇది ముందు నుంచి సాగింది. ఇలా పరిపక్వత సాధించిన నేపథ్యంలో

**దిగజారుతున్న ఆర్థిక స్థితి – చితికిపోతున్న సగటు మనిషి**

ఈ చర్యల మూలంగా మన ఆర్థిక వ్యవస్థ సంక్షోభంలో కూరుకు పోయింది. మోడీ అధికారంలోకి వచ్చినప్పటి నుండి గత కాంగ్రెస్ విధానాలనే మరింత దూకుడుగా అమలు చేస్తున్నాడు. చివరికి రక్షణ రంగంలో కూడా విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులను అనుమతించాడు. ఇది దేశ సార్వభౌమాధికారాన్ని విదేశాలకు తాకట్టు పెట్టే చర్య. మంచి రోజులు తేస్తానంటూ, 'మేక్ ఇన్ ఇండియా' అంటూ విదేశాల చుట్టూ తిరగడం తప్ప దేశీయంగా మన ఆర్థికవ్యవస్థ పటిష్టతకు చేసింది ఏమీలేదు. దేశంలో ద్రవ్యోల్బణం రేటు అన్ని హద్దులను దాటి పైకిపోతూ 6 శాతంను దాటింది. వినియోగదారుల ధరల సూచి కూడా గత జూన్ నెలలో 5.77 శాతానికి చేరుకుంది. పప్పులు, తృణధాన్యాలు, నిత్యావసరాల ధరలు గత ఏడాదితో పోలిస్తే గణనీయంగా పెరిగాయి. ప్రజల జీవన ప్రమాణాలు మాత్రం పెరగని కారణంగా సామాన్యుల బతుకు భారమై పోయింది. రూపాయి క్షీణత భారత ఆర్థిక వ్యవస్థకు గుదిబండగా మారింది. డాలర్‌తో రూపాయి మారకం రు. 68 చేరుకుంది. 2008 నుంచి రూపాయి విలువ క్రమంగా క్షీణిస్తూ ఉంది.

ఇది ఆర్థికవ్యవస్థ క్షీణదశను సూచిస్తుంది. దీనికి తోడు నకిలీ కరెన్సీ బెడదా మన ఆర్థిక వ్యవస్థను మరింత కుంగదీస్తుంది. దేశంలో సాలీనా రు. 70 కోట్ల నకిలీ కరెన్సీ చలామణి అవుతుంది. దేశం మొత్తం మీద చలామణిలో ఉన్న నకిలీ కరెన్సీ 12 వేల కోట్లు. ఎన్ని ప్రభుత్వాలు మారిన నకిలీ కరెన్సీ బెడదను అరికట్టే చర్యలు శూన్యం. ఫలితంగా ఆర్థిక వ్యవస్థ పూర్తిగా సంక్షోభంలో చిక్కుకుంది. వాస్తవం ఇది కాగా, ప్రభుత్వానికి బాకా ఊదే కిరాయి ఆర్థిక వేత్తలు, కొన్ని మీడియా సంస్థలు భారత ఆర్థిక వ్యవస్థ వికసిస్తోందని, సమీప భవిష్యత్తులో చైనాను మించి అభివృద్ధి సాధిస్తుందని, భారతదేశం 7 శాతం వృద్ధిరేటు సాధిస్తుందని గ్లోబెల్ ప్రచారం చేస్తున్నారు. అసలే ప్రపంచ వ్యాప్తంగా ఆర్థిక సంక్షోభం ముసురుకొని ఉన్నవేళ నోట్ల రద్దు లాంటి చర్యలు మన ఆర్థిక వ్యవస్థను పూర్తిగా సంక్షోభంలోకి నెట్టి వేశాయి. కొద్ది మంది మాత్రమే ధనవంతులు అయ్యే విధంగా ఉన్న ఆర్థిక నిర్మాణంను ధ్వంసం చేయాలి. సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ మాత్రమే అసమానతలు, సంక్షోభాలు లేని వ్యవస్థను నిర్మిస్తుంది. ఆ దిశగా ప్రజల కార్యాచరణ ఉండాలని ఆశిస్తూ...! 

*(రచయిత సామాజిక విశ్లేషకులు)* వీ

మోడీ చేత కుహనా తెల్లధనాధిపతుల వర్గంపై నోట్ల రద్దు ప్రకటన చేయించుకుంది. ఆయనని ఆరాధనీయుడుగా, నల్లధనంపై నడుం కట్టిన యుద్ధ వీరుడుగా దేశ ప్రజల హృదయాల్లో స్థిరపరిచే ప్రయత్నం కూడా వ్యూహాత్మకమైనదే. అందులో కూడా పైవర్గం బహుళ ప్రయోజనాలున్నాయి.

నేడు అత్యంత ధర్మధనంగా పూజించబడుతున్న తెల్లధనమే నిజానికి ఈనాటి దోపిడి రాజ్యానికి ఇరుసుగా ఉంది. రాజ్య పరోక్ష అండతోనే నల్లధనం కూడా పెరుగుతూ వచ్చింది. అయితే నల్లధన పురోగమనానికీ, విస్తరణకూ, పటిష్టతకూ రాజ్యం అన్ని కాలాల్లో ఒకే రకంగా సహకరించదు. కొన్ని దశల్లో పరిమితంగానైనా నియంత్రిస్తుంది. అయితే ఈ నియంత్రణకు ప్రజాప్రయోజనాలు కారణం కాదు. తెల్లధనాధిపతుల వర్గ ప్రయోజనాలకు ఏ మేరకు ఆటంకంగా ఉంటుందో ఆ మేరకు నల్లధనాన్ని రాజ్యం నియంత్రిస్తుంది. ఇపుడు అలా నియంత్రించాల్సిన ఒక ప్రత్యేక దశ మన ఆర్థిక వ్యవస్థలో ఏర్పడింది.

2008 ఆర్థిక సంక్షోభం తరువాత భారత దేశ ఆర్థిక వ్యవస్థ తీవ్ర ఒత్తిళ్లకు గురౌతున్నది. స్వదేశీ, విదేశీ బడాపెట్టుబడి సంస్థల చొరబాటు పెరుగుతూ వస్తున్నది. మన మార్కెట్లలోకి చొరబడగల వాటి శక్తి సామర్థ్యాలకూ మార్కెట్లలో వాటికి గల వ్యాపార అవకాశాలకూ మధ్య గల వైరుధ్యం క్రమంగా పెరుగుతున్నది. బహిరంగ రాజ్యామోదం గల కుహనా వ్యవస్థీకృత తెల్లధనానికీ బహిరంగ రాజ్యామోదం లేని నల్లధనానికీ మధ్య కూడా వైరుధ్యం ఏర్పడింది. ఈ సమయంలో మొదటి వర్గం వైపు రాజ్యం నిలబడుతుంది. మార్కెట్లో మొదటి వర్గ విస్తరణకు రెండో వర్గ ఉనికి కంటిలో నలుసుగా మారుతున్నది. ఈ నలుసుని తొలగించుకునేందుకు రాజ్య అండతో వ్యవస్థీకృత తెల్లధనాధిపతుల వర్గం చేస్తున్న సుదీర్ఘ ప్రక్రియలో తాజా "నోట్లరద్దు నిర్ణయం" ఒకటి.

రాజ్య మనుగడలో తెల్లధనమే ఎందుకు నిర్ణయాత్మక శక్తిగా ఉంటుంది? నల్లధనం స్థానం ఎందుకు అప్రధానమైనది? ఈ రెండింటి మధ్య సంబంధం ఏమిటి? వైరుధ్యమేమిటి? తెల్లధనాన్ని దిష్టిబొమ్మగా మార్చి నల్లధనమే సమాంతర రాజ్య శక్తిగా మారదా? ఈ సందేహాలను నివృత్తి చేసుకోవలిసిన సందర్భం ఇది.

నేటి సామ్రాజ్యవాద యుగంలో దోపిడీ రాజ్య వ్యవస్థలన్నింటి మనుగడకు సరుకుల ఉత్పత్తి ప్రక్రియ ప్రాణాధారంగా ఉంటుంది. అందుకై పెట్టుబడిని పెంచుకుంటుంది. దాని ఉనికి, విస్తరణలకు ఉత్పత్తి ప్రక్రియ నిరంతరంగా కొనసాగాలి. శ్రమశక్తి వినియోగం ద్వారా నూతన విలువ నిరంతరం సృష్టించబడడం ద్వారానే సంపద లేదా పెట్టుబడి పెరుగుతుంది. సరుకుల సృష్టికోసం పెట్టుబడిదారులు 1) స్థిరపెట్టుబడి. (యంత్రాలు, ముడిసరుకులు వగైరాలకై) 2) అస్థిర పెట్టుబడి (జీతాభత్యాలకై) వెచ్చిస్తారు. తయారైన సరుకుల అమ్మకం ద్వారా ఈ రెండు వ్యయాల కంటే మించిన సంపద చేకూరుతుంది. దానిని అదనపు విలువ అంటారని మార్క్స్ చెప్పాడు. దాని ముద్దు పేరు లాభం. మార్క్స్ విశ్లేషణ ప్రకారం ఇది కార్మికుల శ్రమ శక్తి నుంచి తస్కరించబడ్డ సంపద. పెట్టుబడిదారీ రాజ్య నియమాల ప్రకారం.. ఇది నికార్సైన ధర్మార్జితం. దీనినే రాజ్యం తెల్లధనంగా పరిగణిస్తుంది. కార్పొరేట్ సంస్థల భారీ లాభాలన్నీ తెల్లధనం నిల్వలే. ఈ తెల్లధన విషవృక్ష కుదురు నుంచి పిలకలుగా ఎదిగేదే నల్లధనం. నల్లధనం లేకుండా తెల్లధనం ఉంటుంది. కాని తెల్లధనం లేకుండా నల్ల ధనం జీవించలేదు. తెల్లధనం గ్రహంకాగా నల్లధనం దాని ఉపగ్రహం. పైన పేర్కొన్న 'దొంగిలించబడ్డ శ్రమశక్తి ఫలం' (అదనపు విలువ లేదా లాభం) స్వాధీనానికై శ్రామికవర్గం విప్లవించాలని మార్క్స్ రాజకీయ శాస్త్రం బోధిస్తుంది. పైన పేర్కొన్న దొంగిలించబడ్డ శ్రమశక్తి ఫలాన్ని వదిలేసి నల్లధనాన్ని స్వాధీనం చేసుకోవడం విప్లవ శక్తులకు సాధ్యంకాదు. తెల్లధనాన్ని స్వాధీనం చేసుకుంటే నల్లధనం దానంతటదే కనుమరుగైపోతుంది. అందుకే పీడిత ప్రజలకు పైన పేర్కొన్న తెల్లధనమే ప్రధాన శత్రువు. కాని ప్రజలను మరింత పీడించే లక్ష్యం గల ఈ తెల్లధనానికి నేడు నల్లధనం ఒక ఆటంకంగా మారింది. అందుకై అది చేపట్టిన నల్లధనం నిర్మూలన ప్రక్రియలో దేశ ప్రజల ప్రయోజనాలు లేవు.

నల్లధనాన్ని స్థూలంగా రెండు విభాగాలుగా విభజించవచ్చు. రాజ్యం చేత దేవతావస్త్రాల ద్వారా తెల్లధనంగా మార్చిన భాగం. ఇది ప్రాథమిక నల్లధనం. లేదా మౌలిక నల్లధనం. రెండోది రాజ్య అనధికార అండదండలతో పుట్టి పెరిగి, అధికారికంగా చట్టవిరుద్ధమైనదిగా నిర్వచించబడుతున్న నల్లధనం. ఇది మొదటిదైనా ప్రాథమిక నల్లధనం మీద ఆధారపడి జీవించే పరాన్నజీవి, దీనిని ద్వితీయ నల్లధనం అంటారు. (సెకండరీ బ్లాక్ మనీ). ఈ రెండు రకాల నల్లధనాల మధ్య ఐక్యతా, పోటీలుంటాయి. ఆయా పరిస్థితులను బట్టి అవి ప్రధాన, అప్రధాన స్థానాలకు మారతాయి. స్థూల పరిశీలనలో మన ఆర్థిక వ్యవస్థలో సుదీర్ఘ కాలం ఈ రెండింటి మధ్య ఐక్యతే ప్రధానాంశంగా ఉంది. అయితే నేటి ద్రవ్య మార్కెట్ల ఒత్తిడి పోటీని ముందుకు తెచ్చింది. అందులో మొదటి రకం నల్లధనానికి రాజ్య అండదండలున్నాయి. ఇంత వరకు రాజ్య అనధికార అండదండలతో పెరిగిన నల్లధనాన్ని నేరుగా నిర్మూలించడం రాజ్యానికి కూడా సాధ్యం కాదు. అందుకై ప్రజా సహకారం కావాలి. అందులో భాగమే నోట్ల రద్దు ద్వారా ప్రజల మధ్యకు మోడీ వచ్చారు.

ప్రజల కష్టార్జితం మాత్రమే నిజమైన తెల్లధనం. ఇందులో రెండు విభాగాలుంటాయి. మొదటిది, ఏ రోజుకారోజు వినియోగమయ్యేది. అంటే తమ జీతభత్యాల ద్వారా పొందే రాబడిని ఆహారం, ఇల్లు, వాకిలి, బట్టలు, విద్య, వైద్యం, వినోదం, విజ్ఞానాదుల కోసం ఖర్చు చేసేది. రెండోది పొదుపుగా దాచుకునేది. ఈ పొదుపు సేకరణకై బ్యాంకింగ్ వ్యవస్థ ఉనికిలోకి వస్తుంది. వీరి కష్టార్జితంలోని మిగులును బ్యాంకులు పొదుపుగా సేకరిస్తాయి. మరొక వైపు బడా పారిశ్రామిక సంపన్న వర్గాలకు దీనిని మదుపుగా (రుణం) బ్యాంకులు అందిస్తాయి. ప్రజల నుంచి నిజమైన తెల్లధనాన్ని పొదుపుగా సేకరించి, నిజమైన నల్లధనాధిపతులకు రుణాలను ఇస్తాయి. పొదుపు డబ్బుపై తక్కువ వడ్డీ చెల్లించి, మదుపు డబ్బుపై మరికొంత అదనపు వడ్డీ బ్యాంకులు సేకరిస్తాయి. ఇది బ్యాంకింగ్ పనివిధానం.

ప్రజల పొదుపు సొమ్ము మీద 7 శాతం వార్షిక వడ్డీ చెల్లించి, మదుపు సొమ్ము మీద 10 శాతం వసూలు చేసిందనుకుందాం. ఆ ఏడాది ఆరుశాతం ద్రవ్యోల్బణం ఉంటే రూపాయి విలువ ఆరు శాతం తగ్గినట్లు. పొదుపుదారులకు నికరంగా ఒక్క శాతం వడ్డీ లభిస్తుంది. ఒక పారిశ్రామికవేత్త వెయ్యికోట్ల అప్పు తీసుకుంటే వంద కోట్లు వడ్డీ చెల్లించాలి. ఆరు శాతం ద్రవ్యోల్బణం వలన అరవై కోట్ల విలువ తగ్గి నికరంగా నలభై కోట్లు మాత్రమే బ్యాంక్‌కు అతడు చెల్లిస్తాడు. ద్రవ్యోల్బణం పొదుపుదారులకే నష్టం చేస్తుంది. కాని మదుపుదారులకు లాభిస్తుంది. అయితే పారిశ్రామికవేత్త మదుపు సొమ్మును ఉత్పత్తి ప్రక్రియలో వినియోగిస్తాడు. దాని వలన తాను తీసుకున్న వెయ్యి కోట్ల మీద 30 నుంచి 50 శాతం వరకు ఏడాది కాలంలో సరుకుల ఉత్పత్తి ప్రక్రియ

ద్వారా లాభంగడిస్తాడు. పైన పేర్కొన్న నాలుగు శాతం నికర వడ్డీ బ్యాంకులకు చెల్లించగా మిగిలినదంతా కొత్తగా సృష్టించబడ్డ అదనపు విలువే. మార్క్స్ మాటల్లో నల్లధనమే. దీనిని బట్టి నేడు నల్లధనాన్ని నియంత్రించే వ్యవస్థగానూ, తెల్లధనానికి భద్రత కల్పించే వ్యవస్థగానూ ఘనంగా కీర్తించబడుతున్న బ్యాంకింగ్ వ్యవస్థ బూటకత్వాన్ని తేలికగానే అర్థం చేసుకోవచ్చు. అదనపు విలువ సిద్ధాంత దృష్టితో పరిశీలించితే నిజమైన తెల్లధనాన్ని జలగలా పిండుకునే దోపిడీ వ్యవస్థగానూ, ప్రాథమిక నల్లధనాన్ని(లాభాలు) కొత్తగా సృష్టించి పెట్టే దళారీ వ్యవస్థగానూ బ్యాంకింగ్ వ్యవస్థ మనకి కల్పిస్తుంది.

సాధారణ పెట్టుబడిదారీ శక్తులకు, ఆశ్రిత పెట్టుబడిదారీ (క్రోనీ కాపిటలిస్టు) శక్తులకు మధ్య కూడా ఒక వైరుధ్యం ఉంటుంది. అది కొన్ని నిర్దిష్ట సమయాల్లో తీవ్రతరం అవుతుంది. దీనిని కూడా పరిశీలించుదాం. 1) కార్పొరేట్ సంస్థల మొండిబకాయిల రద్దు కోసం. 2) తిరిగి కొత్త రుణాలను కార్పొరేట్ సంస్థలకు ఇప్పించడం కోసం 3) ప్రజల నుంచి అదనపు పొదుపు సేకరణకై పెద్ద నోట్ల రద్దు కోసం మోడీ ప్రభుత్వం సుమారు ఏడాది క్రితమే మాజీ ఆర్‌బిఐ గవర్నర్ ఎదుట ప్రతిపాదించింది. ఆయన తిరస్కరించాడు. ఆయనను సాగనంపి రిలయన్స్ మాజీ ఉద్యోగి ఉర్జిత్ పటేల్‌ని నియమించారు. ఇపుడు పై మూడింటి అమలుకై నిర్దిష్ట ప్రక్రియ సాగుతుంది.

ఒక చెరువులో చేపల వ్యాపారం సాగిస్తూ కిందనున్న పంట భూములకు నీళ్లు వదలడానికి కొన్ని విధివిధానాలుంటాయి. పై నుంచి కొత్త నీరు చెరువులోకి రాకుండా కిందికి వదులుతూ పోవడం వల్ల చేపల వ్యాపార ప్రయోజనాలు దెబ్బతింటాయి. గాన కిందికి అదనంగా నీళ్లు వదలాలంటే కొత్త నీళ్లు రావల్సిందే. బ్యాంకింగ్ వ్యవస్థలోకి కొత్తగా పొదుపు సొమ్ము వస్తే తప్ప కార్పొరేట్ సంస్థల పాత బ్యాంక్ బకాయిలను మాఫీ చేయటం సాధ్యం కాదు. ఇప్పటికే 1,14,000 కోట్ల రూపాయల మొండి బకాయిలను మోడీ ప్రభుత్వం రద్దు చేసింది. మరో రు. 8 లక్షల కోట్ల మొండి బకాయిల జాబితా మోడీ ఎదుట ఉంది. వాళ్లు ఆయనతో మాఫీ చేయించుకోవాలంటే దేశ ప్రజల నుంచి అంతే మొత్తం పొదుపు సొమ్మును రాబట్టుకునే ప్రతిపాదన కూడా ఆయన ఎదుట ఉంచాలి. నోట్ల రద్దు చర్య అందుకు ఉపయోగపడుతుంది. ఈ చర్యతో ప్రజా జీవితం అతలాకుతలమైనది. ముఖ్యంగా ప్రజలలో అభద్రత, అరక్షణలు పెరిగాయి. తమ కష్టార్జితంలోని నిధులను సొంత ఇంటిలో దాచుకోవడానికి కూడా భయపడుతున్నారు. బ్యాంకులు తప్ప భద్రత ఎక్కడా దొరకదని అందోళన చెందుతున్నారు. ఇంట్లో దాచుకున్న డబ్బును కూడా బ్యాంకులో దాస్తున్నారు. మోడీ ప్రకటన తరువాత రెండు వారాల్లోనే ఆరు లక్షల కోట్ల రూపాయల డిపాజిట్లు బ్యాంకుల్లోకి చేరాయి. డిసెంబర్ 30 లోపు మరో నాలుగైదు లక్షల కోట్లు చేరవచ్చని అంచనా. కార్పొరేటు కంపెనీల పథకం ఫలిస్తున్నది. చెరువులోకి కొత్త నీరు విడుదలైంది. ఇక పాత నీరు తరలించవచ్చు. మరో 8 లక్షల కోట్లు మొండి బకాయిలను మాఫీ చేయవచ్చు.

లాభాల కోసం శ్రామికుల నెత్తురు, చెమటలను పిండుకుని వారి మీద పరాన్నభుక్కుగా జీవించే సాధారణ పెట్టుబడిదారీ పందికొక్కుల నియమాలకు ఆర్‌బిఐ మాజీ గవర్నర్ కూడా సమర్థకుడే. అయితే కొద్ది మంది ఆశ్రిత పెట్టుబడిదారులకే సర్వరాయితీలిచ్చి ఒక వర్గంగా పెట్టుబడిదారీ వర్గాన్ని నిర్లక్ష్యం చేయటానికి ఆయన వ్యతిరేకి. ప్రాథమిక నల్లధనం (అదనపు విలువ లేదా లాభం) పట్ల మాజీ గవర్నర్‌కూ ప్రస్తుత గవర్నర్‌కూ ఎలాంటి విభేదం లేదు. దాని పంపిణీ పద్ధతుల దగ్గరే విభేదం ఉంది. ఇపుడు కొన్ని ప్రతిపక్షాలకు మాజీ గవర్నర్ ఆదర్శ మూర్తిగా కనిపిస్తున్నాడు. అది కొంత మెరుగైనది కావచ్చు కానీ ప్రజాదృక్కోణంలో ఎంతమాత్రం ప్రత్యామ్నాయం కాదు.

మోడీ నోట్ల రద్దు చర్యని ప్రధాన ప్రతిపక్షాలన్నీ విధానపరంగా బలపరిచాయి. అది వారి వర్గ ప్రయోజనాలకు అనుగుణ్యమైనదే. మోడీ లక్ష్యం మంచిదేనట. అనుసరించిన పద్ధతి సరిగా లేదట. ఇదో ప్రతిపక్షం వాదన. సదుద్దేశ్యంతో నోట్లను రద్దు చేశారు. కానీ ప్రజలను ముందుగా అప్రమత్తం చేయలేదు. ఇది మోడీ చేసిన పొరపాటు. ఇదిమరో ప్రతిపక్ష వాదన. పార్లమెంట్‌ను విశ్వాసంలోకి తీసుకోకుండా ఏకపక్షంగా నిర్ణయాన్ని ప్రకటించారు. నిర్ణయం మంచిదైనా అప్రజాస్వామికంగా వ్యవహరించారు. ఇది మరో ప్రతిపక్షం వాదన. మోడీ ముందుగా ప్రతిపక్షాలను సంప్రదించలేదు. అఖిలపక్ష సమావేశంలో చర్చించి ఉంటే ప్రజలకు ఇలాంటి బాధలు తప్పి ఉండేవి. ఆయన నియంతగా వ్యవరించారు. ఇది మరో ప్రతిపక్షం వాదన. దేశ ఆర్థిక వ్యవస్థను నల్లధనమే అధికంగా ఆస్థిరపరుస్తున్నది. అది నేడు దేశానికి అతి ప్రమాదకరమైన శత్రువు. అందుకే దానిపై రాజకీయాలకు అతీతంగా యుద్ధాన్ని అన్నిపక్షాలు సమర్థించాల్సిందే. కాని ఏకపక్షంగా నిర్ణయించినందున గురితప్పింది. సరైన ఫలితాలు రావు. ఇది మరో ప్రతిపక్ష వాదన. మోడీ చర్యతో నల్లకుబేరులు భీతిల్లుతున్న మాట నిజమే. ఇప్పటికే కొన్ని సత్ఫలితాలు వచ్చిన మాటా నిజమే. అంతకంటే ప్రజలకు మరిన్ని ఎక్కువ కష్టాలు సిద్ధించాయి. స్థూలంగా ఈ చర్య నష్టకరమైనది. ఇది మరో ప్రతిపక్షం వాదన. ఒక్క తృణమూల్ కాంగ్రెస్, ఆమ్‌ఆద్మీ పార్టీలు తప్ప మిగిలిన అన్ని ప్రతిపక్షాలూ ఇలాంటి వాదనలే చేస్తున్నాయి. వందేళ్ల దేశ ఆర్థిక వ్యవస్థ గమనాన్ని వెనక్కి తిప్పే తిరోగమన చర్యగా తృణమూల్ విమర్శించింది. 1947 తరువాత దేశంలో ఇదే అతి పెద్ద కుంభకోణమని ఆప్ విమర్శించింది. కారణాలు ఏమైనప్పటికినీ ఈ రెండు పక్షాలు మాత్రమే తాజా నోట్ల రద్దు చర్యను బేషరతుగా ఉపసంహరించుకోవాలని సూటిగా డిమాండ్ చేశాయి. మిగిలిన రాజకీయ పక్షాలన్నీ మోడీ ప్రభుత్వ మౌలిక లక్ష్యాన్ని విధానపరంగా సమర్థించి, వాటికి తగిన ఫలితాలు రావటానికి తగిన విధి విధానాలు అనుసరించలేదని మాత్రమే విమర్శించాయి. చెట్టు మొదలును బలపరిచి, కొమ్మలు, రెమ్మలను మాత్రమే విమర్శించే వైఖరిని చేపట్టాయి. వామపక్షాలు సైతం మోడీ వ్యూహాత్మక కుట్రలను బహిర్గతపరచలేదు. నల్లధనానికి వ్యతిరేకంగా "ఆశించిన ఫలితాలు" రావని మాత్రమే విమర్శించాయి. ఉపసంహరణకు బదులు సమీక్షించాలని కోరాయి. ఇది ఘోరవైఫల్యంగా తూర్పారపట్టాయి. కాని దీని వెనుక తిరోగమన కుట్ర ఉందని సూటిగా పేర్కొనలేదు.

పై ప్రకటన వెలువడిన తరువాత కార్పొరేట్ మీడియా మోడీని ఆకాశానికి ఎత్తింది. నల్లధనంపై ధర్మ పోరాటం చేస్తున్న సాహసికుడిగా, వీరాధి వీరుడుగా కీర్తించింది. అంతేకాకుండా ఇంత వరకూ నల్లకుబేరులు రహస్యంగా దాచుకున్న నల్లధనాన్ని రోడ్ల వెంట, కాలువలలో, చెత్తకుప్పల్లో విసిరివేసినట్లు పుంఖాను పుంఖంగా ప్రచార మాధ్యమాల్లో కథనాలు వెలువడ్డాయి. మోడీని చూసి నల్లకుబేరులు గడగడలాడుతున్నట్లుగా ప్రచారం జరిగింది. మోడీ పట్ల దేశ ప్రజల్లో పథకం ప్రకారం ఆరాధనా భావాన్ని పెంచే ప్రయత్నం జరిగింది. అసలు నల్లధనం ఇనుప బీరువాల్లో దాగి ఉండదనే నగ్నసత్యాన్ని కూడా మరుగుపరిచారు. ప్రభుత్వం

ప్రకటించిన మొత్తం నల్లధనంలో 90 శాతానికి పైగా నగదు రూపంలో కాకుండా స్థిరాస్తి , బంగారం వంటి వస్తురూపాన్ని ఎపుడో ధరించిందన్న వాస్తవాన్ని కూడా మైమరిపించింది. తెల్లధనం కంటే నల్లధనం చలామణి వేగం అధికంగా ఉంటుందనే సత్యాన్ని మరుగుపరిచారు. నవంబర్ 8 కంటే ముందున్న సాధారణ పరిస్థితుల్లో సైతం ఇళ్లల్లో దొంగతనంగా భయంతో దాచుకున్న నల్లధనాన్ని ఆ తరువాత అసాధారణ పరిస్థితుల్లో బయటకు తెచ్చి బహిరంగ ప్రదేశాల్లో నోట్ల కట్టలను ఎలా విసురుతారు?

మీడియా సృష్టించిన ఫోబియాలో (హిస్టీరియా) ఇలాంటి సందేహాలు కూడా తలెత్తలేదు. రేపటి రాజకీయ లాభాల కోసం నేడు కొన్ని కోట్ల నోట్ల కట్టలను దేశంలో వివిధ ప్రాంతాల్లో వ్యూహాత్మకంగా విసిరివేయించి ప్రచారం చేయించుకునే చౌకబారు ఎత్తుగడలకు ద్రవ్య పెట్టుబడి పూనుకోగలదన్న అనుభవాలు చరిత్రలో చాలా ఉన్నాయి. వాటిని కూడా మరిపించింది. ప్రజలు చాలా సందర్భాలలో ఫోబియాలో కొట్టుకుపోవటం సహజమే. అది కొత్త కాదు. కాని ప్రతిపక్షాలు దానిని సమర్థించే వైఖరిని చేపట్టడం గమనార్హం. ముఖ్యంగా వామపక్షాలు సైతం ఇలాంటి ద్రవ్యపెట్టుబడి కుట్రలను బహిర్గతపరిచే వైఖరిని చేపట్టకుండా నిశ్చేష్టులుగా నిలిచాయి.

మోడీ సర్కారు నిర్ణయం వలన దేశ ప్రజలకు కలిగిన అసౌకర్యాలను విమర్శించడంలో అన్ని ప్రతిపక్షాలు అత్యుత్సాహంతో పోటీపడ్డాయి. 2004 నుంచి 2014 వరకు బడా కార్పొరేట్ సంస్థలకు సుమారు 25 లక్షల కోట్ల పన్ను రాయితీలు కల్పించి, కొన్ని మొండి బకాయిల మాఫీకి కూడా పూనుకున్న కాంగ్రెస్ ప్రభుత్వ ప్రతినిధి రాహుల్ గాంధీ బ్యాంకుల ఎదుట క్యూలో నిలబడి షో చేశాడు. ఎవరికి తోచినట్లు వారు షోలు చేశారు. వీరి కంటే ధృఢస్వరంతో ప్రజల కష్టాల గురించి సుప్రీం కోర్టు ప్రధాన న్యాయమూర్తి విమర్శించారు. అయితే ఇలా విమర్శించడం సరిపోదు. బడా కార్పొరేట్ సంస్థల ప్రతినిధిగా మోడీ సర్కారు చేసిన నిర్ణయం వెనుక దాగిన కుట్రలను బహిర్గత పరచడం, దానిపై పోరాడడం ముఖ్యం. ఇలా చేయకపోవడం దేశ ప్రజలను వంచించడమే.

వాదన కోసం ప్రజల కష్టాలను భిన్నకోణంలో పరిశీలిద్దాం. తమ దేశ ప్రయోజనాల కోసం ఇరాక్, లిబియా, క్యూబా ప్రభుత్వాలు చేపట్టిన కొన్ని నిర్ణయాలు ప్రజలను కష్టాలకు గురిచేశాయి. అయినా ఆయా దేశాల ప్రజలు దేశభక్తియుత చైతన్యంతో వాటిని అధిగమించారు. ఒక వేళ మోడీ సర్కారు కూడా దేశ ప్రజల ప్రయోజనాల కోసం ఇలాంటి నిర్ణయాలు చేస్తే ప్రజలు కష్టాలను భరించడం తప్పు కాదు. అందుకు భిన్నంగా కార్పొరేట్ కంపెనీల కోసం తలపెడితే ప్రతిఘటించాల్సిన బాధ్యత దేశ ప్రజలపై ఉంది. ఈ మౌలిక రాజకీయ అవగాహనతో నిర్ణయాన్ని సమీక్షించి తగిన వైఖరి చేపట్టాలి.

గత పదిహేను ఏళ్లలో దేశంలో 3 లక్షల మంది రైతుల ఆత్మహత్యలు జరిగాయి. అయినా రైతు రుణమాఫీకి ప్రభుత్వాలు సిద్ధపడలేదు. దాని వలన బ్యాంకులు దివాళా తీస్తాయట! నిజానికి 2008లో రైతు రుణమాఫీ విలువ రు. 60 వేల కోట్లు మాత్రమే. కాని గత రెండేళ్లలో పందికొక్కుల వంటి కార్పొరేట్ సంస్థల కోసం 1,14,000 కోట్ల రూపాయలు మాఫీ చేసింది. అంటే రైతు రుణమాఫీ కంటే రెట్టింపు. మరో 8 లక్షల కోట్ల మాఫీకి పథకం పన్నింది. గత ఎనిమిదేళ్లలో సంపన్నులకు రు.35 లక్షల కోట్ల పన్ను రాయితీలిచ్చారు. పన్ను చెల్లిస్తే తెల్లధనం అంటారు. చెల్లించకపోతే నల్లధనం అంటారు. పన్ను రాయితీల వల్ల ఈ రు.35 లక్షల కోట్లు ప్రభుత్వ ఆదాయం కోల్పోయిందంటే అది చెల్లించాల్సిన అసలు ధనం అంతకంటే ఏడెనిమిది రెట్లు ఎక్కువే ఉంటుంది. అది చెల్లించనందున నిజానికి నల్లధనమే. కానీ రాయితీలిచ్చినందున ప్రభుత్వం చేత మార్చబడిన తెల్లధనం. అది నేడు నల్లధనం మీద యుద్ధాన్ని ప్రకటించటం గమనార్హం.

ఇటీవల కాలంలో జాతీయ బూర్జువా వర్గంతో సహా చిన్న, లఘు, కుటీర పరిశ్రమలు, చిల్లర వర్తకాలు, వ్యాపారాల మీద బడా విదేశీ, స్వదేశీ సంపన్న వర్గాల కన్నుపడింది. వాటిని దెబ్బతీస్తే తప్ప, వారి వ్యాపార ఆవృతిలో వీరు స్వేచ్ఛగా చొరబడలేరు. పారదర్శకత పేరిట ఈ చిన్న వర్గాల వ్యాపార వృత్తులన్నింటినీ రాజ్య నియంత్రణలోకి పటిష్టంగా తేవాలని ద్రవ్యపెట్టుబడిదారీ వర్గం వ్యూహం పన్నింది. ఈ చిన్న వర్గాల లావాదేవీలన్నీ నగదు సహితంగా సాగుతున్నాయి. ఫలితంగా ఆర్థికలావాదేవీలన్నీ పారదర్శకంగా ఉండకపోవడం సహజమే. అదేవిధంగా కార్పొరేట్ సంస్థలకు భవిష్యత్తులో మరిన్ని పన్ను రాయితీలు ఇవ్వాలంటే కొత్తగా ప్రజల నుంచి అదనపు పన్ను రాబడులకై మధ్యతరగతి, ఉద్యోగ వర్గాల మీద కన్నుపడింది. నాకు తెలిసిన ఒక సాఫ్ట్‌వేర్ ఇంజనీరు ఏటా రు.7 లక్షల ఆదాయ పన్ను చెల్లిస్తున్నాడు. నేను విన్న మరొకరు 13 లక్షలు చెల్లిస్తున్నారు. నిజానికి వీరిది అదనపు విలువ కాదు. అంటే వ్యాపార లాభం కాదు. నైపుణ్య శ్రమాధారిత కష్టార్జితం మాత్రమే. ఇంకా కార్మికులు, ఉపాధ్యాయులపై కూడా ఐటి పన్ను, వృత్తి పన్ను వసూళ్లు చేస్తున్నారు. ఈ రాబడులను అంతకంటే ఎక్కువగా అల్పాదాయ వేతన జీవులకు కూడా విస్తరించే లక్ష్యం కార్పొరేట్ ప్రభుత్వాలకు ఉంది. నేటి ఆర్థిక వ్యవస్థలు మునుముందు డిజిటల్ మార్గంలో ప్లాస్టిక్ ఆర్థిక వ్యవస్థగా మార్చాలని చూస్తున్నది.

భారత ఆర్థిక వ్యవస్థను "వస్తు సేవల చట్టం-2016"(జిఎస్‌టి) ద్వారా వ్యవస్థీకృత పన్నుల రాజ్యం (టాక్సింగ్ స్టేట్)గా మార్చే లక్ష్యం కార్పొరేట్ వ్యవస్థకు ఉంది. ఈ ప్రక్రియను చేపడుతున్నది తెల్లధనాధిపతుల వర్గమే. అది నేడు నేరపూరితమైన నల్లధనం మీద ధర్మయుద్ధానికి తెరవెనుక సారథ్యం వహిస్తుంది. నిజానికి నాడు హిరోషిమా, నాగసాకిలను విధ్వంసం చేసిందీ, నేడు ఇరాక్, ఆఫ్ఘనిస్తాన్, లిబియా తదితర దేశాలను మారణహోమానికి గురి చేస్తున్నదీ తెల్లధనాధిపతుల వర్గమే. మన దేశంలో సహజ వనరులను కబ్జా చేస్తున్నదీ, "మేకిన్ ఇండియా" పేరిట శ్రమశక్తిని చౌకగా కొల్లకొడుతున్నదీ, వ్యవసాయరంగాన్ని నాశనం చేస్తున్నదీ, గ్రీన్‌హంట్ పేరిట విస్తారమైన ఖనిజ సంపదను కొల్లగొట్ట జూస్తున్నదీ, ప్రజా ఉద్యమాలను నెత్తుటి ఏరుల్లో ముంచెత్తుతున్నదీ, విప్లవ శక్తులను ఎన్‌కౌంటర్ చేస్తున్నదీ. ఇంకా రకరకాలుగా దేశ ప్రజలపై యుద్ధాలు చేస్తున్నదీ, వీటి కొనసాగింపుగా అంతిమంగా నవంబర్ 8న మోడీ సర్కారుతో దేశ ప్రజలపై ఆర్థిక ఉగ్రవాద యుద్ధాన్ని ప్రకటింప చేయించిందీ కుహనా తెల్లధనాధిపతుల వర్గమే. అంతే తప్ప కుహనా తెల్లధనపు రాజ్య అండతో పుట్టిపెరిగిన కుక్కమూతి పిందె వంటి ద్వితీయ రకం నల్లధనం కాదు. తాను కని పెంచిన రెండోరకం నల్లధనాన్ని నియంత్రించే పేరిట ఆచరణలో దిగువ స్థాయి వ్యాపార, వర్తక, వాణిజ్య, ఉద్యోగ, ఉపాధ్యాయ, అధికాదాయ వేతన జీవులు, ఇతర మధ్యతరగతి వర్గాలు, రైతాంగం, కూలీలను పన్నుల రాజ్య చట్రం (ప్లాస్టిక్ ఆర్థిక వ్యవస్థ)లోకి వ్యూహాత్మకంగా ఈడ్చుతున్న అతి పెద్ద కుట్ర ఇది. ఈ మౌలిక సైద్ధాంతిక రాజకీయ అవగాహనతో స్పందించి, తగు కార్యాచరణను రూపొందించుకోవటం ప్రజాస్వామిక, ప్రగతిశీల, విప్లవ శక్తుల తక్షణ కర్తవ్యం.

*(రచయిత ఐఎఫ్‌టియు జాతీయ కార్యదర్శి)* వీ

# ఈ సంచలనాత్మక చర్య ప్రభావం శూన్యం

*పెద్ద నోట్ల రద్దు ఆశించిన ఫలితాలను సాధించదనీ, దీనివల్ల గిరాకీ సంకోచించి ఆర్థిక వ్యవస్థ దెబ్బతింటుందనీ అంటున్నారు* **ఆర్. కవితా రావు**

పెద్ద నోట్ల రద్దు చర్య భారత ఆర్థిక వ్యవస్థకు మేలు చేసేదేనని ఆర్థిక శాస్త్రవేత్తలు అంగీకరించడం లేదు. స్వయంగా కేంద్ర ప్రభుత్వ ఆర్థిక మంత్రిత్వ శాఖకు చెందిన పరిశోధనా సంస్థ నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పబ్లిక్ ఫైనాన్స్ అండ్ పాలసీ (ఎన్ఐపిఎఫ్‌పి), పెద్ద నోట్ల రద్దు తర్వాత వారంరోజులకు, నవంబర్ 14న ఒక పరిశోధనా పత్రం వెలువరించింది. పెద్ద నోట్ల రద్దు 'భారత ఆర్థిక వ్యవస్థకు పెద్ద ఆఘాతం' అని ఆ పత్రం వ్యాఖ్యానించింది.

నల్లధనం ఉన్నవారు తమ దగ్గర ఉన్న నోట్లను గంగానదిలో పారవేయడం కన్న గత్యంతరం లేదని ప్రధాన మంత్రి నరేంద్ర మోడీ అన్నారు. కాని నోట్ల రద్దు వల్ల నల్లధనం మీద పెద్ద ప్రభావం ఉండదని, పైగా 'ఆర్థిక వ్యవస్థలో ఆర్థిక కార్యకలాపాలన్నీ కుంచించుకుపోవడానికి' దారితీస్తుందని ఈ పత్రం విశ్లేషించింది. ఈ పత్ర రచయితలలో కీలకమైన అర్థశాస్త్రవేత్త డా. కవితా రావు, తన ఇంటర్వ్యూలో ఈ చర్యవల్ల వినియోగదారుల వైపు నుంచి సరుకుల గిరాకీ తగ్గుతుందని, తద్వారా మరెన్నో ప్రతికూల ఆర్థిక పర్యవసానాలు ఉంటాయని అన్నారు.

**ఆమె ఇంటర్వ్యూ నుంచి భాగాలు:**

**వినియోగదారుల గిరాకీ ఏ మేరకు కుంచించుకుపోవచ్చు?**

అది ఎంత ఉంటుందో కచ్చితంగా అంకెల్లో చెప్పలేం. బదిలీ ద్వారా బ్యాంకులకు తిరిగిరాని కరెన్సీ ఎంత ఉంటుందో, అంటే రద్దయిపోయే కరెన్సీ ఎంత ఉండబోతుందో కచ్చితంగా తెలియాలి. దానిలో ఎంత పొదుపుగా మారిందో, ఎంత లావాదేవీల కోసం వాడిందో తెలియాలి. ఈ రంగాల గురించి మనదగ్గర ఆధారపడదగిన అంకెలు లేవు.

కాని, పత్రికా వార్తల్లో చెపుతున్నట్టు, బహుశా మూడు లక్షల కోట్ల రూపాయల కరెన్సీ రద్దయిపోతుందని అనుకుంటే, అందులో సగం లావాదేవీలకు వాడుతున్నదనుకుంటే, అప్పుడు మొత్తం ఆర్థిక వ్యవస్థకు, స్థూల జాతీయోత్పత్తికి రు. 12 లక్షల నష్టం వాటిల్లుతుందని అంచనా వేయవచ్చు. మొత్తంగా చలామణీలో ఉన్న కరెన్సీకి స్థూల జాతీయోత్పత్తి ఎనిమిది రెట్లు ఉంది గనుక ఈ అంచనా వేయవచ్చు. పన్నెండు లక్షల రూపాయలంటే మన స్థూల జాతీయోత్పత్తిలో ఎనిమిది శాతం. మొత్తం ఆర్థిక వ్యవస్థలో డిమాండ్ కుంచించుకుపోవడం వల్ల జరిగే ప్రభావాన్ని లెక్కవేయకుండానే ఇంత మొత్తంలో నష్టం ఉంటుంది.

**మరి, గిరాకీ కుంచించుకుపోవడం ఫలితం ఆర్థిక వ్యవస్థ మీద ఎలా ఉంటుంది?**

ఈ ప్రభావాలలో మొదటి విడత ప్రభావం బ్యాంకులకు తిరిగిరాని, రద్దయిపోయే కరెన్సీకి సంబంధించినది కాదు. అది కొత్తకరెన్సీ ప్రవేశపెట్టే లోపు రద్దయిపోయే కరెన్సీకి సంబంధించినది. అది అన్ని రంగాలలోనూ గిరాకీ కుంచించుకుపోయేలా చేస్తుంది. మీ దగ్గర కొనుగోలుశక్తి ఉన్నప్పటికీ, రూపాయలు ఉన్నప్పటికీ, వాటిని కొత్త కరెన్సీగా మార్చుకో గలిగినప్పటికీ, మీరు పాత కరెన్సీని ఉపయోగించలేరు. ఇంకా మీ చేతుల్లోకి కొత్త కరెన్సీ రాలేదు. అందువల్ల మీరేమీ కొనలేరు.

దానితో మొట్టమొదట దైనందిన అవసరాల రంగాలన్నీ ప్రభావితమవుతాయి. వాటితోపాటు, అంత అవసరమైనవి కావని భావించే రంగాలమీద కూడ, లేదా విలాసాల మీద కూడ, ప్రభావం పడుతుంది. ఎందుకంటే మీ దగ్గర ఉన్న కరెన్సీని మొట్టమొదట అత్యవసరమైన సరుకుల మీదనే ఖర్చుపెట్టాలని మీరనుకుంటారు. అందువల్ల ఆర్థిక వ్యవస్థలోని అన్ని రంగాలూ దెబ్బతింటాయి. మోటరు వాహనాల తయారీ రంగం దెబ్బతింటుంది. వస్త్ర పరిశ్రమ దెబ్బ తింటుంది. దాదాపు అన్ని రంగాలూ దెబ్బతింటాయి.

**ఇక రెండో విడత ప్రభావాలు ఎలా ఉంటాయి?**

రెండో విడత ప్రభావాలు కొత్త కరెన్సీని ప్రవేశపెట్టిన తర్వాత వస్తాయి. ప్రజలు అప్పగించిన మొత్తం డబ్బుకు సమానమైన కొత్త కరెన్సీ ప్రవేశపెడతారా, అందులో కొంత భాగమే ప్రవేశపెడతారా అనేదాన్ని బట్టి ఈ ప్రభావం ఉంటుంది.

ప్రజలందరూ డిజిటల్ యుగంలోకి వెళ్లేలా చేయడమే తమ ఉద్దేశమని, అందులో బ్యాంకింగ్ వ్యవస్థ ప్రధాన పాత్ర వహించాలని ఆర్థిక మంత్రి అంటున్నారు. దాని అంతరార్థం ప్రజలు అప్పగించిన డబ్బునంతా మళ్లీ చలామణీలోకి తేబోము అనే.

అలా మొత్తం కరెన్సీని గనుక తిరిగి ప్రవేశపెట్టకపోతే, దానివల్ల రెండో విడత డిమాండ్ సంకోచం జరుగుతుంది. ఎందుకంటే డబ్బుతో వ్యవహరించడం అలవాటైన ప్రజలు అంత తొందరగా డబ్బేతర లావాదేవీలు నిర్వహించలేరు. నా బ్యాంక్ ఖాతాలో డబ్బు ఉండవచ్చు గాని, కరెన్సీ రూపంలో కాకుండా ఇతర రూపాల లావాదేవీలు జరపడానికి ధైర్యం చేయలేను. కనుక ఈ సంధి దశలో కూడ దాదాపు అన్ని రంగాల లోనూ ప్రభావం ఉంటుంది.

**ఈ సంధి దశ ఎంత కాలం ఉండవచ్చు?**

ఆ దశ చాలకాలం ఉంటుందని నాకనిపిస్తుంది. ఎందుకంటే ఇక్కడ మనం ప్రజలు తమ అలవాట్లను మార్చుకోవడం గురించి మాట్లాడుతున్నాం. ఒక కూరగాయల వ్యాపారి పేటిఎం కు మారవచ్చు. ఒక దుకాణదారు తన దగ్గర స్వైప్ మిషన్లు పెట్టుకోవచ్చు. కాని ఒక వినియోగదారుడు వాటికి మారడానికి ఎక్కువ సమయం పడుతుంది. ఇక ఒక రోజు కూలీ తన కూలీ డబ్బును పేటిఎం మీద తీసుకుంటాడా, తనకు అవసరమైన కొనుగోళ్లు పేటిఎం మీద చేస్తాడా? అదంతా ఆ రోజుకూలీ మూడు నెలల్లో నేర్చుకుంటాడా?

**ద్రవ్య విషయాలలో, డిజిటల్ సాంకేతిక పరిజ్ఞానంలో నిరక్షరాస్యత వల్ల, తగినంత అక్షరాస్యత లేనందువల్ల ఈ డబ్బురహిత లావాదేవీలకు చేరడం కష్టమవుతుందా?**

మనందరమూ డబ్బును ఆర్థిక వ్యవస్థలో ఒక సాధనంగా, మధ్యవర్తిగా చూడడం నేర్చుకున్నాం. ఈ నోటు ఇంత విలువకు సమానం అని నేర్చుకున్నాం. అంతేకాదు, మన దేశంలో ఒక్కొక్క నోటు ఒక్కొక్క రంగులో ఉంటుంది. ఆ రంగు ద్వారానే జనానికి వాటి విలువ తెలుస్తుంది. ఇప్పుడు, హఠాత్తుగా మన జనమందరూ ఒక్కగంతు వేసి పేటిఎం మీద అచ్చయిన ఒక పదం లోకి చేరాలనుకుంటున్నారు. వారికి వెంటనే ఆ పదానికి అర్థమేమిటో తెలియాలనుకుంటున్నాం. అంటే అందరికీ చదవడం వచ్చని అనుకుంటున్నాం.

ఈ పరివర్తన జరుగుతుంది. నిజమే, కాని ఎంత బలవంతపెట్టినా, అత్యధిక సంఖ్యాక ప్రజలు ఈ డబ్బేతర సాధనాలకు మారడానికి చాల సమయం పడుతుంది.

ఈ నోట్ల రద్దు వల్ల బ్యాంకులలో నిలువ ధనం పెరిగిపోతుందని, దానివల్ల బ్యాంకులకు రుణాలిచ్చే అవకాశం పెరుగుతుందనీ ఒక అభిప్రాయం ఉంది.

సరే, అలా రుణాలకూ, పరపతికీ అవకాశం వచ్చిందనే అనుకుందాం, కాని ఆ రుణాలకూ, పరపతికీ డిమాండ్ ఉందా? ప్రస్తుతానికైతే ఎక్కువ లేదనే అనిపిస్తుంది. అసలు రుణాల, పరపతి సౌకర్యాలకు ఎక్కువ డిమాండ్ లేని ఈ సంవత్సరంలో ఈ నోట్ల రద్దు జరిగింది. నోట్ల రద్దు తర్వాత డిమాండ్ సంకోచంతో అసలు రుణాలు, పరపతి అడిగేవారే లేకపోవచ్చు.

ఒకవేళ బ్యాంకులు రుణాలు ఇద్దామనుకున్నా, వాళ్లు తిరిగి వస్తాయోరావో తెలియని ప్రమాదకరమైన రుణాలు ఇవ్వవలసి వస్తుంది. వడ్డీ రేట్లు తగ్గిపోతాయి. ఇప్పుడు బ్యాంకుల దగ్గర బోలెడు డబ్బు పోగయిందనుకోండి. ఆ డబ్బును రుణంగా ఇచ్చి ఆదాయం సంపాదించవలసి ఉంటుంది. అలాకాకపోతే ఖాతాదార్లు జమ చేసిన డబ్బుకు వడ్డీ ఇవ్వడం సాధ్యం కాదు. మరి డిమాండే లేకపోతే, మొదట తమ దగ్గర నిలువ చేసే ధనం మీద వడ్డీ రేట్లు తగ్గించవలసి వస్తుంది. దానితర్వాత, రుణాలు తీసుకోవడానికి జనాన్ని ప్రోత్సహించడం కోసం, రుణాల మీద కూడ వడ్డీ రేట్లు తగ్గించవలసి వస్తుంది. అయితే, మొత్తంగా ఆర్థిక వ్యవస్థలోని డిమాండ్ పరిస్థితే సరిగ్గా లేనప్పుడు, కేవలం వడ్డీ రేట్లు తగ్గించడం మదుపు డిమాండ్ ను ప్రోత్సహించడానికి సరిపోదు.

అప్పుడు బ్యాంక్ ఏం చేస్తుంది? తన దగ్గర ఎవరు అప్పు తీసుకుంటారా అని వెతకవలసి వస్తుంది. లేదా, తన దగ్గర ఉన్న నిలువల మీద వడ్డీ ఇవ్వకుండా ఉండవలసి వస్తుంది. లేదా, ప్రభుత్వ బాండ్లు వంటి రూపాలలో చట్టబద్ధ ద్రవ్యరూప ఆస్తుల నిష్పత్తి పెంచుకోవలసి వస్తుంది. అంతకన్న మెరుగైన ప్రతిఫలం ఇచ్చే మార్గాలు దాని ముందు లేవు. వీటిలో ఏ ధోరణి అయినా ఆర్థిక వ్యవస్థ వ్యాకోచానికి దారితీసేది కాదు.

తక్షణ పర్యవసానాలలో రుణాల కోసం పెద్ద ఎత్తున డిమాండ్ వచ్చి గణనీయమైన విస్తరణ జరుగుతుందని నేననుకోవడం లేదు. అటువంటి డిమాండ్ వస్తేనే ఒక చక్రం తిరగడం ప్రారంభమై విస్తరణ సాధ్యమవుతుంది. పోనీ, ప్రైవేట్ రంగం మరిన్ని రుణాలు కోరడానికి ముందుకు వస్తుందనే ఆశ కూడ లేదు. ప్రభుత్వమే పూనుకుని ప్రజామదుపు కార్యక్రమాలు సాగించాలి. లేదా మౌలిక సదుపాయాలు కల్పించడానికి ప్రత్యేక లక్ష్యాల సాధనాలను రూపొందించాలి. కాని ప్రభుత్వానికి అటువంటి ఆలోచనలున్నట్టు కనబడడం లేదు.

**మీ పత్రంలో మీరు, వినియోగదారుల రుణభారం పెరిగే అవకాశం ఉందని హెచ్చరించారు. కారణాలేమిటో వివరిస్తారా?**

డబ్బు చెల్లించేటప్పుడు ఎంత ఖర్చు చేస్తున్నారనే విషయంలో జాగ్రత్తగా ఉంటారని చూపే పరిశోధనాత్మక అధ్యయనాలు ఎన్నో ఉన్నాయి. ఊరికే ఆలోచిస్తే కూడ ఆవిషయం అర్థమవుతుంది. కార్డుల ద్వారా ఖర్చు చేసేటప్పుడు, ఎంత ఖర్చు చేస్తున్నామో లెక్క తెలియదని, అందువల్ల కార్డు ఉపయోగించేటప్పుడు జనం అవసరమైనదానికన్న ఎక్కువ ఖర్చు చేస్తారని పరిశోధనలు చెపుతున్నాయి.

ఇప్పుడు బ్యాంకుల దగ్గర రుణాలు ఇవ్వడానికి డబ్బు ఉందని అనుకుందాం. ఆ డబ్బును వాళ్లు తీసుకున్న రుణాలుగా మార్చవలసి ఉంటుంది. అందువల్ల బ్యాంకులు ప్రజలను రుణాలు తీసుకోవడానికి ప్రోత్సహిస్తాయి. లేదా పెద్ద ఎత్తున క్రెడిట్ కార్డుల వ్యవస్థను తయారు చేస్తాయి. కార్డు మీద ఎంత ఖర్చు పెడుతున్నామో చూసుకునే అలవాటు తక్కువ అయినప్పుడు, వినియోగదారులు కొనుగోళ్లు, ఖర్చులు పెరగవచ్చు. కాని అదే సమయంలో వారి రుణభారం కూడ పెరుగుతుంది.

అంటే మీరు వినియోగదారుల ప్రవర్తనను మార్చదలచుకున్నారు. వారిని మరింత ప్రమాదకర ప్రవర్తన వైపు నెడుతున్నారు. విస్తృతమైన సామాజిక భద్రతా ఏర్పాట్లు లేనప్పుడు, దివాళా తీస్తే పరిరక్షించే నిబంధనలు లేనప్పుడు, ప్రజలను ఇటువంటి ప్రవర్తనలోకి నెట్టడమంటే, వారి జీవితాలను మరింత దారుణ పరిస్థితిలోకి నెట్టడమే. డబ్బుల నుంచి ప్లాస్టిక్ కు మారుతున్నప్పుడు దీర్ఘకాలంలో దాని పర్యవసానాలేమిటో ప్రభుత్వానికి విధానపరంగానే తెలిసి ఉండవలసి ఉంటుంది.

**నల్లధనం తయారు కాకుండా చూడడంలో ఈ చర్య ప్రభావం ఏమిటి?**

ప్రజలలో అత్యధిక సంఖ్యాకులను ఆర్థిక వ్యవస్థలోని డిజిటల్ విభాగానికి మార్చకుండా ఉన్నంతకాలం నల్ల ఆదాయాలు తయారవుతూనే ఉంటాయి. నల్ల ఆదాయాలు రెండు మార్గాలలో తయారవుతాయి. మీ ఆర్థిక కార్యకలాపం ఏదైనా సరే, మీ అమ్మకాలనూ కొనుగోళ్లనూ చెప్పకుండా దాచినప్పుడు, మీ డబ్బు అజ్ఞాతానికి వెళ్తుంది. లేదా మీరు మీ అమ్మకాలను తక్కువచేసి, కొనుగోళ్లను ఎక్కువచేసి చూపవచ్చు. లేదా మీరు మీ అమ్మకాలను సరిగానే చూపి, కొనుగోళ్లను మాత్రం ఎక్కువ చేసి చూపవచ్చు. ఆర్థిక లావాదేవీలన్నిటినీ డిజిటల్ రూపంలోకి మారిస్తే, వీటిలో మొదటిదాన్ని నియంత్రించడం సాధ్యమవుతుంది గాని రెండో మార్గాన్ని నియంత్రించలేం. అంతేకాదు, డిజిటల్ రూపంలోకి మారినచోట్ల నల్లధనం లేదని చెప్పడానికేమీ లేదు.

బ్యాంకులకు తిరిగివచ్చిన డబ్బులో ఎంత భాగాన్ని తిరిగి చలామణిలోకి తెస్తారనే విషయంలో విధానపరమైన నిర్ణయం ఏమిటో బహిరంగ చర్చలో లేదు. దేశంలోని కరెన్సీలో గణనీయమైన భాగాన్ని తగ్గించాలని మనం లక్ష్యంగా పెట్టుకున్నామా? అలా అయితేనే జనం చచ్చినట్టు డిజిటల్ మార్గాల వైపు వెళ్తారని అనుకుంటున్నామా? లేక, ఈ పరివర్తన క్రమానుగతంగా జరగాలని అనుకుంటున్నామా? ఆర్థిక వ్యవస్థలో తయారవుతున్న నల్లధనం ఏ రూపంలోకి మారుతుందనేది మన నిర్ణయం మీద ఆధారపడుతుంది.

ఉదాహరణకు, బ్యాంకులకు అందిన డబ్బులో చాల మొత్తాన్ని తిరిగి ప్రజల చేతుల్లో పెట్టారనుకోండి, అప్పుడు వ్యాపారాలు యథావిధిగా సాగుతాయి. నల్ల ఆదాయాలు కూడ యథాతథంగానే తయారవు తుంటాయి. ఇక్కడ ముఖ్యమైన ప్రశ్నేమిటంటే, ప్రజలు నల్లధనం వైపు

# ఫిడెల్ కాస్ట్రో



**క్యూ**బా విప్లవ నాయకుడు, విప్లవానంతర క్యూబా సమాజాన్ని ఐదు దశాబ్దాల పాటు ప్రగతి పథంలో నడిపిన యోధుడు ఫిడెల్ అలెజాండ్రో కాస్ట్రో రూయిజ్ నవంబర్ 25 శుక్రవారం రాత్రి క్యూబా రాజధాని హవానాలో కన్నుమూశారు. కమ్యూనిస్ట్ పార్టీ ఆఫ్ క్యూబా నాయకుడిగా, అప్పటి వరకు క్యూబాలో సాగుతున్న బటిస్టా నియంతృత్వ పాలనను కూలదోసి 1959లో క్యూబాలో ప్రజా ప్రభుత్వం స్థాపించినప్పుడు అది ప్రపంచ చరిత్రలోనే అసాధారణమైన సంఘటన అయింది. దక్షిణ అమెరికాను, కరేబియన్ సముద్రాన్ని తన సొంత పెరడుగా, జాగీరుగా భావించే అమెరికన్ సామ్రాజ్యవాదానికి దిమ్మతిరిగి పోయేలా కాస్ట్రో కరేబియన్ సముద్ర ద్వీపంలో అమెరికా పక్కలో బల్లాన్ని సృష్టించారు. శక్తిసంపన్నమైన అమెరికాను ఎదురించి ఈ చిన్న దేశం నిలవగలదా అనే సందేహాలను పటాపంచలు చేస్తూ ఐదు దశాబ్దాల పాటు విప్లవ ప్రభుత్వాన్ని నడిపారు. ప్రజారోగ్యం, ప్రాథమిక విద్య, సుపరిపాలన, భూసంస్కరణలు, వెనుకబడిన సమాజానికి అవసరమైన పారిశ్రామికీకరణ వంటి అనేక రంగాలలో విప్లవానంతర ప్రభుత్వ నమూనాను సృష్టించారు.

విప్లవ యోధుడు చేగువేరాతో కలిసి నియంతృత్వం మీద పోరాటం ప్రారంభించిన నాటి నుంచి, విప్లవ విజయానికన్న ముందు మన్‌కాడో రాజప్రాసాదం ఆయుధాగారం మీద దాడి చేసిన నాటి నుంచి కాస్ట్రో జీవిత కథ ఉజ్వలమైన వీరోచిత గాథ.

వైశాల్యంలోనూ, జన సంఖ్యలోనూ అతి చిన్న దేశమే అయినప్పటికీ వ్యూహాత్మకంగా అమెరికా పొరుగున ఉన్న క్యూబాలో విప్లవం సాధించడానికీ, సోషలిజాన్ని నిర్మించడానికీ ఎంత కఠోరమైన కృషి సాగించవలసి ఉందో కాస్ట్రో ముందు నుంచి దూరదృష్టితో ఉన్నారు. కేవలం 80 మంది కార్యకర్తలతో ప్రారంభమైన విప్లవంలో దేశంలోని యాభైకి పైగా పార్టీలను, సంఘాలను ఏకం చేసి విశాల ఐక్య సంఘటన సృష్టించి, చివరికి నియంత పాలనను కూలదోయ గలిగారు. విప్లవ ప్రభుత్వం ఏర్పడిన నాటి నుంచి ఇప్పటి దాకా పది మంది అమెరికా అధ్యక్షులు క్యూబాను శత్రువుగా పరిగణించారు. వాణిజ్య, ఆర్థిక ఆంక్షలు విధించారు. రాకపోకలు నిషేధించారు. చిన్న పిల్లలకు అవసరమైన ఔషధాలు కూడా దిగుమతి చేసుకోవడానికి వీలులేని స్థితి కల్పించారు. ఎప్పుడైనా పేలుస్తామనే హెచ్చరికతో అణ్వాయుధాలు ఎక్కుపెట్టారు. సిఐఎ కాస్ట్రోను హత్య చేయడానికి కనీసం ఆరు వందల ముప్పై సార్లు ప్రయత్నించింది.

ఈ దమననీతినంతా ఎదుర్కొంటూ తన ప్రజల సంపూర్ణ మద్దతును సమీకరించుకొని 1959 నుంచి 2008 దాకా ప్రభుత్వానికి వేరు వేరు స్థాయిల్లో నాయకత్వం వహించారు. కాన్సర్ బారిన పడిన తరువాత 2008లో పదవి త్యజించినా ప్రభుత్వానికి మార్గదర్శకత్వం వహిస్తున్నారు.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో మహా చర్చ జరిగి రెండు శిబిరాలుగా విడిపోయినప్పుడు సోవియట్ యూనియన్ పక్షం వహించి నందుకు విప్లవ శక్తుల అసమ్మతిని మూటకట్టుకున్నప్పటికీ అమెరికాను ఎదిరించే దృఢ దీక్షలో దేశీయ అవసరాల కోసం ఆ వైఖరి తీసుకున్నారు. సోవియట్ యూనియన్‌లో సాగుతున్నది సోషలిజం కాదని నిర్మొహమాటంగానే చెప్పారు.

వ్యక్తిగత, రాజకీయ, విదేశాంగ విధానాలలో లోపాలు ఉన్నట్టు అనిపించినా అమెరికాను ఏడు దశాబ్దాల పాటు స్థిరంగా ప్రతిఘటించి నిలిచిన మహత్తర సామ్రాజ్యవాద వ్యతిరేక స్ఫూర్తికి చిహ్నంగా కాస్ట్రో కలకాలం నిలుస్తారు. అలాగే ఒక బలమైన మట్టికాళ్ల మహారాక్షసిని ఒక గడ్డిపోచ కూడా ఎదిరించి నిలవగలదని, మానవ శక్తి ముందు అణుశక్తి కూడా ఓడిపోక తప్పదని తన జీవితంతో, పోరాటంతో రుజువు చేసినందుకు కూడా కాస్ట్రో ప్రపంచ ప్రజల గౌరవానికి అర్హుడవుతారు. వీ

---

చూడకుండా ఉండడానికి మనం ఏ ప్రోత్సాహకాలు, శిక్షలు తయారు చేశామనేదే. ప్రస్తుత నోట్ల రద్దు ఒక్కసారిగా సంపదనంతా తుడిచిపెట్టేసింది. నల్ల ఆదాయాలను సంపాదించడం గురించి ప్రజల ప్రవర్తనలను, ఆలోచనలను మార్చడానికి దానికది మాత్రమే సరిపోదు.

ద్రవ్యవ్యవహారాలలో సంఘటిత రంగంలో ఉండడమే మంచిదని మనం మన ప్రజలనింకా ఒప్పించలేదు. ఒక దేశంగా మనం ఇంకా ఆ పని చేయవలసే ఉంది.

**ప్రజలను డిజిటల్ రూపంలోకి మారమని బలవంతపెట్టడం, వ్యాపారాలు యథాతథంగా సాగనివ్వడం ? ఈ రెండూ తప్పుడు పరిణామాలు కావా?**

ఔను. వాటిని బట్టే తేలేదేమంటే నోట్ల రద్దు నల్లధనం సమస్యను పరిష్కరించజాలదు. వెంటనే ఉపసంహరించిన డబ్బుకు సమానమైన డబ్బు చలామణీలోకి తేకపోవడమంటే అతి కొద్ది మందిని శుభ్రం చేయడానికి, తగ్గించడానికి అసంఖ్యాక ప్రజలను కష్టభరితమైన మార్గంలోకి పంపించడమే.

"సంఘటిత రంగమే మేలు" అని మేమనడం లేదు. "అసంఘటిత రంగం ఉండగూడదు" అంటున్నాం. అవి రెండూ ఒకే నాణానికి రెండు ముఖాలు. కాని సంఘటిత రంగమే మేలు అని వివరించాలంటే మనం ఇంకా ముందుకు సాగాలి.

**ధరల పెరుగుదల మీద దీని ప్రభావం ఎలా ఉంటుంది?**

తాత్కాలికంగా, సరుకుల సరఫరా కుంచించుకుపోతుంది. అందువల్ల ధరలు పెరుగుతాయి. కాని అదే కాలంలో డిమాండ్ కూడ తగ్గితే ధరలు తగ్గే అవకాశం కూడ ఉంటుంది.

అయితే మరొక పెద్ద అనిశ్చితి గాలిలో వేలాడుతోంది. అది వస్తు, సేవల పన్ను విషయంలో ప్రభుత్వం ఏం చేయబోతున్నదనేది. ఈ చర్యతోనే మనం ఆర్థిక వ్యవస్థను పెద్ద ఆఘాతానికి గురి చేశాం. ఈ ఆఘాతం వల్ల నిజంగా దెబ్బతిన్నవాళ్లు వ్యాపారులు. ఇప్పుడు వాళ్ల పద్ధతులన్నీ మార్చుకుని, వస్తు, సేవల పన్ను పద్ధతికి సిద్ధం కమ్మని అడగడం అంటే వారిని ఇంకా ఇబ్బందులకు గురిచేయడమే.

మూలం: *http://scroll.in/*

వీ

# ప్రజల సొమ్ము వాస్తు పాలు

*రాష్ట్రంలో రైతు రుణాలు మాఫీ చేయకుండా, ప్రభుత్వ ఆసుపత్రుల్లో మౌలిక సదుపాయాలు కల్పించకుండా, వాస్తు పేరుతో అధికార భవనాలకు, నివాస గృహాలకు పాలకులు ప్రజాధనాన్ని వృథా చేస్తున్నారని అంటున్నారు* **బైరెడ్డి సతీష్**

తెలంగాణ రాష్ట్ర ముఖ్యమంత్రి రాష్ట్రం మొత్తం పాలనా వ్యవస్థకు గుండెకాయలాంటిదైన సచివాలయానికి చాలా అరుదుగా వచ్చిపోయే అతిథిగా దర్శనమిస్తుంటాడు. తన క్యాంపు ఆఫీసు నుండో లేదా ఫామ్ హౌస్ నుండో పాలనా వ్యవహారాలను నిర్వర్తిస్తుంటాడు. ఈ రెండున్నర ఏళ్ల కాలంలో సచివాలయానికి రాకపోవడానికి ఏ భద్రతా కారణాలో, అసౌకర్యమో కాదు గానీ వ్యక్తిగత నమ్మకానికి సంబంధించిన అంశం ఆధారంగానే అనే విషయం సామాన్య ప్రజలకు పెద్దగా తెలియకపోవచ్చు.

అప్పటికే కోట్లాది రూపాయలతో నిర్మించబడిన బేగంపేట క్యాంపు కార్యాలయం కూడా 'బాగా' లేదని దాని వెనకాలే లక్ష చదరపు అడుగుల విస్తీర్ణంలో 50 కోట్ల వ్యయంతో భారీ భవనం అనేకన్నా ఓ రాజసౌధాన్నే తన వ్యక్తిగత అభిరుచి మేరకు నిర్మించుకున్నాడు. వారి కుటుంబ సభ్యుల నక్షత్రబలం మేరకు మొక్కలు కూడా నాటించుకున్నాడు. పోచమ్మ ఆలయం ప్రారంభం కూడా అయింది. ఈ భవనంలోని బాత్‌రూమ్‌లు కూడా బుల్లెట్ ప్రూఫ్‌ను కలిగి ఉన్నాయని తెలుస్తున్నది. మరి వచ్చే ఎన్నికల తర్వాత మరో పార్టీ అధికారంలోకి వచ్చి మరో నాయకుడు ముఖ్యమంత్రి అయితే అప్పుడు వాళ్ల కుటుంబ సభ్యుల పేరు మీద ఇప్పుడు నాటిన మొక్కలు అప్పుడు చెల్లైతే వాటిని నరికి మరోచోట నాటిస్తారేమో? జాతకాలు, నక్షత్ర బలాలు, మనిషికోరకంగా పనిచేస్తాయి కదా! అప్పుడు వచ్చే ముఖ్యమంత్రి ఏ మతంవాళ్లయితే ఏ ఆచారాన్ని పాటిస్తే దానికనుగుణంగా ఓ చర్చీనో, మజీదో నిర్మించుకోవచ్చన్న మాట! ఈ దేశంలో సెక్యులర్ వ్యవస్థ కాగితాలమీద వెలిగిపోతుంది, ఆచరణలో వెలవెలబోతుంది.

దేశ రాజ్యాంగ సెక్యులర్ స్ఫూర్తికి అనుగుణంగా కంటే వ్యక్తిగత విశ్వాసాలు, చాదస్తాలు, ఛాందసాల కనుగుణంగానే పాలనా వ్యవహారాలుండడం ఈ దేశ రాజకీయ వ్యవస్థలో సర్వ సాధారణమై పోయినవి. పదవుల్ని, పైసల్ని, పెత్తనాన్ని మాత్రమే ప్రేమించే రాజకీయాల్లో విలువలకు, రాజ్యాంగ స్ఫూర్తికి పెద్దగా గౌరవం ఉండదు. గత రెండున్నర సంవత్సరాల కాలంలో ఈ రాష్ట్ర ప్రభుత్వం ప్రజల అవసరాలు, సంక్షేమం, అభివృద్ధి అంశాల కంటే తమ వ్యక్తిగత విశ్వాసాలు, అభిరుచులకు అనుగుణమైన విధానాలకే ప్రాధాన్యతనిచ్చి ఆయా పథకాలను యుద్ధ ప్రాతిపదికన అమలు చేసేందుకు అధికార యంత్రాంగాన్ని పురమాయిస్తున్నది. ప్రభుత్వ ప్రాధామ్యాలన్ని పాలక వర్గాల వ్యక్తిగత అంశాల ప్రాతిపదికనే రూపొందించబడుతున్నాయి. సమిష్టి తత్వానికో, మెజారిటీ అభిప్రాయానికో ప్రాధాన్యతనిచ్చే బదులు వ్యక్తిగత నిర్ణయాలే ఫైనల్ అని అదే ప్రజా ప్రయోజనకరమైనదని, ప్రజాస్వామికమైనదని ప్రజాభిప్రాయాన్ని ఆ దిశగా కూడగట్టే ప్రయత్నాలు బలంగా జరుగుతున్నాయి. తెలంగాణ స్వరాష్ట్రం కోసం ప్రజాస్వామికంగా ప్రజా ఉద్యమం సమిష్టిగా సబ్బండ వర్ణాల భాగస్వామ్యంతో విజయవంతం అయితే పాలన మాత్రం ఏకపక్షంగా కొనసాగుతున్నది. ప్రజాస్వామ్యం అంటే మెజారిటీ అభిప్రాయానుసారం నిర్ణయం జరగచ్చేమో కానీ మెజారిటీ నిర్ణయాలెపుడూ ప్రజాస్వామికంగా ఉంటాయనే గ్యారెంటీ లేదు. తెలంగాణ పాలనలో మెజారిటీ అభిప్రాయం ఏమో కానీ అసలు రెండో అభిప్రాయమనేదే ఉండకూడదని దేన్నైనా బుల్డోజ్ చేయవచ్చనే ధోరణి కొనసాగుతున్నది. అదీ వ్యక్తిగత విశ్వాసాల, బలహీనతల ఆధారంగా జరగడం పెద్ద విషాదమే. పాలనలో వ్యక్తిగత ముద్రలు, ప్రభావాలు ఉంటాయేమో కానీ మొత్తంగా పాలననంతా వ్యక్తిగత పైత్యంపైననే నిలబెట్టి బలంగా ముందుకు తోసే ప్రయత్నాలు ప్రమాదకరమైనవి. ఉద్యమంలో సమిష్టి భాగస్వామ్యం అవసరం, అనివార్యమైనప్పుడు పాలనలో కనీసమైన పౌర సమాజపు వాయిస్‌ను ఎందుకు నిరాకరించాలి?

సంవత్సరంన్నర క్రితమే తెలంగాణ సచివాలయాన్ని నూతనంగా నిర్మించాలనే ప్రతిపాదనను రాష్ట్ర ముఖ్యమంత్రి ముందుకు తీసుకు వచ్చాడు. ఎర్రగడ్డలోని టి.బి., ఛాతివ్యాధుల ఆసుపత్రిని అనంతగిరి వికారాబాద్‌కు తరలించి అక్కడ 'బ్రహ్మాండమైన', 'అద్భుతమైన' కొత్త సచివాలయాన్ని నిర్మించాలనే ఆనాటి ప్రతిపాదనకు అన్ని వర్గాల నుండి తీవ్ర నిరసన, ప్రతిఘటన రావడంతో అది అంతటితో ఆగిపోయింది. కానీ 'కొత్త' సచివాలయ నిర్మాణమనే ఆలోచన ఆగిపోలేదు. జింఖానా గ్రౌండ్స్ కూడా పరిగణనలోకి వచ్చింది కానీ ఆ ప్రాంతం కేంద్ర రక్షణ శాఖ ఆధ్వర్యంలో ఉండడంతో అదీ సాధ్యపడలేదు. తీరా ఇప్పుడు ఉన్నచోటనే 'పాత' భవనాన్ని కూల్చివేసి కొత్త సచివాలయాన్ని 360 కోట్ల వ్యయంతో నిర్మించాలని ముఖ్యమంత్రిగారి అలోచన.

అయితే ఈ భారీ నూతన సచివాలయ నిర్మాణ ప్రతిపాదనా నేపథ్యం, అందుకు ప్రభుత్వం చూపుతున్న సహేతుక కారణాలేమిటి అని ఆలోచిస్తే విస్తుపోయే, విస్మయపరచే కారణాలే కనిపిస్తాయి. పాత సచివాలయ కూల్చివేతను నిలిపివేయాలని ఒక కాంగ్రెస్ నాయకుడు, ఫోరం ఫర్ గుడ్ గవర్నెన్స్ అనే సంస్థ ప్రజా ప్రయోజన వ్యాజ్యాన్ని హైకోర్టులో వేసింది. మరో వైపు సచివాలయ తరలింపు పనులను మరింత వేగవంతం చేసి నవంబర్‌లోనే ఆ ప్రక్రియను ముగించి కూల్చివేతను చేపట్టాలనే నిర్ణయాన్ని హైకోర్టు అడ్డుకున్నది. కానీ తరలింపు అనేది ప్రభుత్వ విధాన నిర్ణయమని దాన్ని అడ్డుకోజాలమని స్పష్టం చేసింది. ఈ కేసు విచారణ, వాదోపవాదాల సందర్భంలోనే సచివాలయ కూల్చివేత నిర్ణయానికి గల కారణాలను హైకోర్టుకు తెలిపింది ప్రభుత్వం. అసలు మొత్తంగా ప్రస్తుతం ఉన్న సచివాలయ నిర్మాణమే అక్రమమని, హైద్రాబాద్ మున్సిపల్ కార్పొరేషన్ అనుమతి ఈ కట్టడానికి లేదని, అగ్ని ప్రమాద నివారణ

ఏర్పాట్లు, పార్కింగ్ సదుపాయాలు లేవని, ఉద్యోగులు, సందర్శకులు, విఐపిల ప్రాణాలకు ముప్పు ఉందని, దేశ విదేశీ అతిథులతో మీటింగ్ ఏర్పాటు చేసుకొనే విశాలమైన స్థలం లేదని చెప్పడమే కాకుండా జాతీయ భవన నిర్మాణ నిబంధనలు – 2005ను అనుసరించి నిర్మాణాలు జరగలేదని 2005కు ముందు చేపట్టిన నిర్మాణం గురించి వాదించడమే కాకుండా 'పునరాకృతి–పునర్నిర్మాణం' (రీడిజైనింగ్ అండ్ రీస్ట్రక్చరింగ్) పేరుతో కొత్త నిర్మాణానికై పాత భవనాన్ని కూల్చివేయాలనుకున్నట్లు ప్రభుత్వం హైకోర్టుకు తెలిపింది.

ఈ వాదనలను నిశితంగా పరిశీలిస్తే కొత్త సచివాలయ ప్రతిపాదన వచ్చిన తొలినాళ్లలో ప్రభుత్వం చెప్పినదానికి విరుద్ధంగా ఉన్నాయి. పోనీ ఇవే కారణాలు అపుడూ ఉన్నాయనుకున్నా ఒక అక్రమ నిర్మాణంలో దశాబ్దాలుగా కీలకమైన పాలనా యంత్రాంగ మంతా కొలువు తీరినట్టా? కనీస అనుమతులు లేకుండా సచివాలయాన్ని నిర్మించడమేమిటి? చిన్న నిర్మాణానికైనా అన్ని భద్రతా చర్యలు తీసుకోవాలనే ప్రభుత్వం పాలనకు కేంద్రబిందువైన సచివాలయ నిర్మాణంలో ఏ నిబంధనను, భద్రతా ప్రమాణాలను పాటించలేదా? అదే సచివాలయంలో ప్రస్తుత ముఖ్యమంత్రి, ఇప్పటి మంత్రులు అనేకులు గతంలో కూడా మంత్రులుగా ఉన్నారు కదా? అప్పుడు ఈ అంశాలు వాళ్లకు తెలియదా? ఇన్ని ప్రభుత్వాలు, ఇంతమంది ముఖ్యమంత్రులు, అధికారులు, సాంకేతిక పరిజ్ఞానం ఉన్నవాళ్లు, గొప్ప ఇంజనీర్లు ఏం చేసినట్టు ఇంతకాలం? ఆ నిర్మాణంలో వీళ్లందరు భాగస్వాములే కదా?

నిజానికి ఇవన్నీ హైకోర్టుకు అనివార్యంగా చెప్పాల్సి వచ్చిందికాని ఇవేవి అసలైన కారణాలు కావు అనేది తెలంగాణ సమాజానికే కాదు బయటి ప్రపంచానికి కూడా తెలిసి పోయింది! 'ఇండ్ల ఉన్నోడు ఎవ్వడు బాగు పడలేదు తెలంగాణకు కూడా ఈ గతి పట్టొద్దు' అని స్వయంగా ముఖ్యమంత్రే ప్రకటించిండు. వ్యక్తిగత బాగు అన్నప్పుడే ఈ నిర్ణయం వెనకాల ఇవాళ ప్రభుత్వం చెబుతున్న కారణాలు ఏవీ కావని తేటతెల్లం అవుతున్నది. అసలు కారణాన్ని పైకి చెప్పలేదు కనుక ప్రభుత్వ పరంగా 'శాస్త్రీయ' కారణాలను బయటకు చెబుతున్నారు. అసలైనది అశాస్త్రీయ, అహేతుకమైన, ముఖ్యమంత్రి వ్యక్తిగత వాస్తు విశ్వాసం అని అర్థం చేసుకోవడానికి పెద్ద చింతన అవసరం లేదు. సచివాలయానికి 'వాస్తు' దోషం ఉన్నదని, దాంట్లో ఉన్నవాళ్లెవరు కొసెల్ల లేరని అది నాకు కూడా (తెలంగాణ పేరు మీద) ఎదురు కావద్దని, ఇంకా కుటుంబ సభ్యుల రాజకీయ భవిష్యత్తుకు అస్సలు ఆటంకం కాకూడదని కంకణం కట్టుకున్నారు ముఖ్యమంత్రి గారు. అయితే ఇలాంటి విశ్వాసాలను ప్రభుత్వానికి ఆపాదించలేం కనుక, అవి చెల్లవు కనుక సడెన్‌గా పరిశోధన చేసి కొత్త బిల్డింగ్‌కు కొత్త సాకులు తేల్చేశారు. పాలనా యంత్రాంగ అవసరాలు, ప్రజా ప్రయోజనాలు, సంక్షేమం రీత్యా ఎటువంటి మౌలిక సౌకర్యాలనైనా కల్పించుకోవడానికి ఎవ్వరికి అభ్యంతరం ఉండకూడదు. ఉన్న భవనాలు, కార్యాలయాలు పాతబడినా, శిథిలమైనా ఉపయోగార్హమైనవి కాకపోయినా కూల్చివేసి కొత్త వాటిని నిర్మించాల్సిందే! ఆ సూత్రం దేనికైనా వర్తిస్తుంది!

ప్రభుత్వం అనే వ్యవస్థ ప్రజలందరి ఉమ్మడి అస్థిత్వ ప్రతిబింబం, వ్యక్తీకరణ. వ్యక్తుల ఇష్టానుసారం కాకుండా సమాజ సమిష్టి ప్రయోజనాలను కాపాడాలనే సూత్రబద్ధవైఖరికి అనుగుణంగా నిర్ణయాలుండాలి. ప్రభుత్వంలో ఉన్న వ్యక్తుల వ్యక్తిగత నమ్మకాలు, ఆచారాలకు అనుగుణంగా పాలనా వ్యవహారాలుండకూడదు. వ్యక్తిగా ఏ మత విశ్వాసమైనా, ఆచారాన్నైనా, ఎంత మూఢ నమ్మకమైనా కలిగి ఉండే హక్కు, స్వేచ్ఛను సామాజిక అనుభవాల ద్వారా రాజ్యాంగంలో పొందు పర్చబడింది. మరీ లౌకిక రాజ్యంలో అయితే వ్యక్తులకే ఆ విశ్వాసాలు ఉంటాయి కానీ రాజ్యానికి, ప్రభుత్వానికి ఉండవు. ప్రజలు ప్రభుత్వాన్ని నడపమని మ్యాండేట్ (అధికారం) ఇస్తే అది వ్యక్తి ఇష్టానుసారం కాకుండా ప్రజా ప్రయోజనాలు, ఆకాంక్షల మేర బాధ్యతలను నెరవేర్చమనే కానీ తన వ్యక్తి గత బలహీనతలని సమాజం మీద రుద్దడం కోసం మాత్రం కాదు. వ్యక్తులకు ఉండే జ్ఞానం, నిపుణత అనేవి సమాజ ప్రయోజనాలకు మరింతగా ఉపయోగపడాలే కానీ అధికారం మాటున వ్యక్తిగత పైత్యాన్ని, బలహీనతను మొత్తం వ్యవస్థపై రుద్దడం అవాంఛనీయం. 'సెక్యులర్ మనీ'ని సెక్యులర్‌గా సమిష్టి సంక్షేమానికే ఖర్చు చేయాలి తప్ప యాదాద్రికి వందకోట్లు, వేములవాడకు మరో వంద కోట్లు, రంజాన్‌కు బట్టలు, బహుమతులు, క్రిస్మస్‌కు అన్నదానం, గుళ్లు, గోపురాల మొక్కుల చెల్లింపు పేరుతో కోట్ల రూపాయల సొమ్మును సమర్పించడం పూర్తిగా రాజ్యాంగ స్ఫూర్తికి, లౌకిక విలువలకి విరుద్ధమైనది.

మళ్లీ సచివాలయ కూల్చివేత నూతన భవన నిర్మాణానికే వస్తే, అది అవసరమా? ఉన్నదానిని మరింత సౌకర్యవంతంగా మార్చడమా? అనేవే ప్రాతిపదిక కావాలి కానీ సార్వజనీనమైన, సార్వకాలికమైన సైన్స్ కాని వాస్తుపేరుతో విలాసవంతమైన సౌదాల నిర్మాణం అంటే ప్రజల సొమ్ము వాస్తుపాలైనట్టే. ఉగాది నాడు పార్టీకో పంచాంగం, పండితుడు ఉన్నట్టే మనిషికో వాస్తు రీతి, పండితునికో వాస్తు పద్ధతి ఉన్నాయి. ఇదే ఆధారమైతే పార్టీలు, ప్రభుత్వాలు మారినప్పుడల్లా భవనాలు కూల్చాల్సి వస్తుంది. ప్రజలు వాస్తు 'పోటు' ను భరించాల్సి వస్తుంది. ప్రస్తుత సచివాలయం మరీ పాతదైపోయిందని ఎవరూ చెప్పలేదు. ఏవో కొన్ని లోపాలున్నప్పటికి వసతుల విషయంలో అధ్వాన్నమైన పరిస్థితి అయితే ఏమీ లేదు.

బ్లాకుల వారీగా విభజించబడిన ఆ భవనం సరాసరి వయస్సు 15 నుండి 40 ఏళ్లే! నార్త్ (ఎచ్), సౌత్ (ఎచ్) వంటివి అయితే కేవలం నాలుగేళ్ల క్రితమే నిర్మించారు. ఎ–బ్లాకు 1998, బి–బ్లాక్ 1978, సి–బ్లాక్ 1978, డి–బ్లాకు 2003, జె–బ్లాకు 1990, కె–బ్లాకు 1964. వీటి నిర్మాణ కాలం చూసినప్పుడు నిజాం కాలం నాటి భవనాలు, వందేళ్లు దాటిన ప్రభుత్వ ప్రధాన కార్యాలయాలు రాష్ట్ర రాజధానిలో, జిల్లా, ఆయా పట్టణాలల్లో వందల సంఖ్యల్లో ఉన్నాయి. ప్రభుత్వ వాదన ప్రకారమైతే మొదట వాటిని కూల్చి నూతన భవనాలు నిర్మించాలి. మరి వాటి గురించి ప్రభుత్వం ఏమీ అనట్లేదెందుకో? ఓహో వాటి 'వాస్తు' బాగుందేమో! వాస్తు బాగుండి ఎంత పాతదైనా, ఎంత శిథిలావస్థకు చేరుకున్నా ఏ ప్రమాదమూ జరగదేమో!? నిజానికి ఒక్క జి–బ్లాకు మాత్రమే 1888 సంవత్సరంలో నిర్మించబడి 128 ఏళ్లు పూర్తి చేసుకున్నది. ఆంధ్రకు కేటాయించబడిన ఎల్–బ్లాకు అయితే 27 కోట్ల 'మరమ్మత్తుల'తో మరింత ఆధునీకరించింది ఆంధ్రా ప్రభుత్వం. ఈ వాస్తవ పరిస్థితి ఇలా ఉంటే ప్రభుత్వ పెద్దలకు మాత్రం మరోలా కనిపిస్తున్నది. ఈ నూతన సచివాలయ నిర్మాణానికి 500 కోట్లా, 1000 కోట్లా అనేది ఎవరి అంచనాకు అందకుండా ఉన్నది. మరోవైపు నూతన జిల్లా కేంద్రాల్లో నూతన ప్రభుత్వ భవనాలకు 3000 కోట్లకు పైగానే ఖర్చుయ్యే అవకాశం ఉంది. రైతు రుణాల మాఫీకి, ఫీజు రీ ఇంబర్స్‌మెంటుకు, పేద విద్యార్థుల మధ్యాహ్నం భోజన బిల్లులకి, ఉద్యోగుల పిఆర్‌సి బకాయిల చెల్లింపులకు, డిఎ సకాలంలో ప్రకటించడానికి మాత్రం ప్రభుత్వానికి నిధుల కొరత ఉంటుంది. అనేక

# టాటాల ఎత్తులకు మిస్త్రీ చిత్తు

*ప్రపంచ వాణిజ్య రంగ దిగ్గజం అయిన టాటా గ్రూప్‌లో చైర్మన్ మిస్త్రీని తొలగించడానికి గల కారణాలనూ, ఇటీవల సంవత్సరాలలో ఆ సంస్థలో చోటు చేసుకున్న పరిణామాలనూ విశ్లేషిస్తున్నారు* **డా. ఎ. పున్నయ్య**

ప్రపంచ పారిశ్రామిక విప్లవం తర్వాత వ్యాపార వాణిజ్య రంగాల్లో పెట్టుబడిదారుల దారులన్నీ వలసరాజ్యాల వైపు కదలడం ఆరంభించాయి. బడా పెట్టుబడిదారులంతా, సామ్రాజ్యవాద కాంక్షతో వ్యాపార విస్తరణతో పాటు లాభాపేక్షే పునాదిగా సంస్థలు నెలకొల్పడం ప్రారంభించాయి. తిరుగులేని ఆర్థికశక్తులుగా అవతరించిన అనంతరం అవి ప్రభుత్వాలను శాసించడం ఈస్ట్ ఇండియా కంపెనీ నుండి ఇవాళ్టి దాకా అనేక సందర్భాలు పాలితులుగా ప్రజల అనుభవంలో కోకోల్లలు. ప్రజల అవసారల కనుగుణంగా అతితక్కువ ధరలకే తమ ఉత్పత్తులు అందుబాటు లోకి తెస్తున్నట్లు ఈ ఉత్పత్తిశక్తులు విస్తారమైన వ్యాపార ప్రకటనలతో సామాన్య వినియోగదారుని ప్రమేయం లేకుండా ఆర్జిత శక్తినంతా కొనుగోలు శక్తిగానే వినియోగించే స్థాయికి అనివార్యంగా నెట్టివేస్తూ తమ అంతర్గత లాభాలను అద్దెలుగా పేర్చుకోవడం జరుగుతుంది. అంతేగాక వినియోగదారుని విశ్వాసాన్ని చూరగొన్న తర్వాత సామాన్యునికి దగ్గరగా ఉన్నట్లు భ్రమింపజేస్తూ, పోటీ ప్రపంచంలో అంతర్గత లాభాలకు పెద్దపీట వేస్తూ వ్యాపారాన్ని ఆకాశానికెత్తాలని చూడటం పరిపాటి.

ఈ క్రమంలో నూతన ఉత్పత్తులకోసం భిన్న రంగాల్లో తాము తీసుకునే నిర్ణయాల్లో కొన్ని తలకిందులు కావడం జరుగుతుంది. దీంతో వ్యాపార ప్రపంచంలో బహుళజాతి కంపెనీల నడుమ ప్రతిష్టా భంగానికి గురికావడంతోపాటు, ఆధిపత్యపోరుకై తాము తీసుకున్న స్వంత నిర్ణయాలనే వెనక్కు తీసుకునే దుస్థితి దాపురించింది. ఈ వ్యాపార కుతంత్రంలో చాలాకాలంగా ఆ సంస్థ బ్రాండ్ ఇమేజ్ పట్ల అత్యంత విశ్వసనీయంగా ఉన్న ప్రజల్లో ఒక గందరగోళం నెలకొనడం సర్వసాధారణం. సాధారణంగా ఒకస్థాయికి చేరిన మల్టీనేషనల్ బ్రాండెడ్ కంపెనీలన్నీ తమ వ్యాపార విస్తృతి కోసం ప్రజలనుండి పెట్టుబడులను సేకరించడం ఆ పెట్టుబడులను తాము విశ్వసించిన రంగాల్లో పెట్టుబడులుగా పెట్టి మరిన్ని లాభాలు ఆర్జించాలనుకుంటాయి. అట్లా ప్రజల నుండి పెట్టుబడులను వాటాలుగా, షేర్‌హోల్డర్స్‌గా మార్చుకుని 'విశ్వవిపణి'లో తిరుగులేని శక్తిగా ఎదిగిన 'టాటా' ఇవాళ తాను తీసుకున్న నిర్ణయంతో వ్యాపార రంగంలో తీవ్ర చర్చకు దారితీసింది.

శతాబ్దమున్నర వ్యాపార ప్రపంచంలో తిరుగులేని వాణిజ్య దిగ్గజంగా ఎదిగి సుస్థిర స్థానం సంపాదించుకున్న 'టాటా'లు శతాధిక సంస్థలతో ఆసియా, ఐరోపా దేశాలతో పాటు గల్ఫ్ దేశాల్లోను వ్యాపార సామ్రాజ్యాన్ని విశ్వవ్యాప్తంగా విస్తరించుకున్న టాటా, పెట్టుబడులతో విభిన్న రంగాలలో తిరుగులేని ఉత్పాదక శక్తిగా నిలబడింది. ఇటీవల తాను ప్రారంభించిన కొన్ని కంపెనీల పెట్టుబడులపై నష్టాలు చవిచూసిన కారణంగా ఒక ప్రముఖ కంపెనీ చైర్మెన్‌ను అప్రజాస్వామికంగా వెనుకకు పిలవడం, ఉద్యోగాలు, పదవులు పొందిన వారిని ఎన్నడూ తొలగించని సుదీర్ఘ టాటా చరిత్రను ఒక కుదుపు కుదిపింది. టాటా గ్రూప్ చైర్మెన్ సైరస్ మిస్త్రీ తొలగింపులో వ్యాపార కారణాలతో పాటు ఆధిపత్య పోరు స్పష్టమౌతుంది. ఇది కంపెనీ కుటుంబ వ్యవహారమైనా ప్రజా ప్రయోజనాలేమైన ఉన్నాయా అనేది ప్రధానాంశంగా పరిశీలించాలి.

**టాటా కంపెనీల స్థాపన**

స్వతంత్ర భారతావనికి 80 ఏళ్ల క్రితమే 1868లో టాటా వాణిజ్య

---

ప్రభుత్వ పాఠశాలలు, కళాశాలలు, యూనివర్సిటీలు కొత్తగా ప్రకటించ బడ్డప్పటికి మౌలిక సదుపాయాలకు మాత్రం ప్రభుత్వం నిధులను అందివ్వటం లేదు. అనేక ప్రాంతాల్లో ఆసుపత్రుల్లో తగినన్ని గదులు, పడకలు లేక రోగులు నేలమీదనే వైద్యం చేయించుకోవాల్సిన దుస్థితి నెలకొని ఉన్నది. ఖజానాకు సంరక్షకులుగా ఉండి ప్రజల సొమ్మును ఆడంబరాలకు, అట్టహాసాలకు వృథా చేయడం ఉచితమనిపించుకోదు. నల్లకార్లు అరిష్టమని తెల్ల కార్లు మార్చుకోవడం, ఆరు సంఖ్య అచ్చి వస్తుందని ఐదు లక్షల చదరపు అడుగుల విస్తీర్ణ నిర్మాణంతో వాస్తు, సంఖ్యా శాస్త్రాలకనుగుణంగా సచివాలయ సౌధం నిర్మిస్తామనడం, క్యాంపు కార్యాలయాలపేరుతో విలాస భవనాలు నిర్మించుకోవడం ఏ ప్రజల అభివృద్ధికి దారితీస్తుందో ఏలికలే సెలవివ్వాలి. ప్రజలకు హామీ ఇచ్చిన డబుల్ బెడ్‌రూం ఇళ్లేమో కానీ పాలకులకు మాత్రం సర్వాంగసుందరంగా, విలాసాలతో కూడిన సౌధాలు మాత్రం చకాచకా రూపుదాలుస్తున్నాయి. గత ముఖ్యమంత్రులు వై.ఎస్. రాజశేఖర్ రెడ్డి కూడా వాస్తు నిపుణులచేత నిర్మించుకున్న దాంట్లోనే ఉన్నాడు కానీ ఏమైంది? రోశయ్య తన కార్యాలయానికి వాస్తు దోషాల పేరుతో మరమ్మత్తులు చేయించుకున్నాడు కానీ పూర్తి కాలం పదవిలో కొనసాగలేక పోయిండే? కిరణ్‌కుమార్ రెడ్డి వాస్తు మరమ్మత్తులు చేయించుకోకున్నా పదవీకాలం మొత్తాన్ని అనుభవించాడు కదా! గుడ్డి నమ్మకాలతో పాలన సాగించడం అనాగరికం అనిపించుకుంటుంది. నిజమైన ప్రజాభివృద్ధితో ప్రజల విశ్వాసం చూరగొనడం ద్వారా అధికారంలో నిలదొక్కుకోవచ్చు నేమో కానీ మూఢ నమ్మకాలు, అశాస్త్రీయ చర్యలతో రాజకీయ అధికారాన్ని నిలబెట్టుకోలేం కదా ప్రజల్లో మరింత మూఢాచారాలు అజ్ఞానాన్ని పెంచినవాళ్లౌతారు. సుపరిపాలన నిర్మించాలే తప్ప అనాగరికపు, అందవిశ్వాసాల ఆధారంగా భౌతిక నిర్మాణాలు చేపట్టడం వ్యర్థం. కాకతీయ తోరణంలోనో, చార్మినార్‌లోనో వాస్తులోపాలున్నాయని కూల్చి మళ్లీ కట్టుకోలేంకదా పాలకులు ఆలోచించండి.

(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు) వీ

చరిత్ర ప్రారంభమైంది. చిన్నతరహా పరిశ్రమలతో ప్రారంభమై బహుళజాతి కంపెనీ స్థాయికి ఎదిగిన టాటా గ్రూప్‌లో వందకు పైగా విభిన్న వ్యాపార రంగాలను సొంతం చేసుకుంది. ఇందులో 41 లక్షల షేర్ హోల్డర్స్ కలిగి 7 లక్షల మందికి పైగా ఉద్యోగులతో ఆరు ఖండాల్లో 100 పైగా దేశాల్లో తన సామ్రాజ్యాన్ని విస్తరించుకుంది. ప్రపంచంలోనే అత్యంత పెద్ద కార్పొరేట్ శక్తిగా ఎదిగిన టాటా గుండు సూది మొదలుకొని విమానం దాకా, ఉప్పు నుండి ఉక్కు పరిశ్రమల దాకా, కాలి చెప్పుల నుండి విలాసవంతమైన కార్ల దాకా, సాధారణ మనిషి అవసరాల ఉత్పత్తుల నుండి స్టార్ హోటల్స్ దాకా, సమాచార సాంకేతిక రంగాలలో తన పెట్టుబడులతో వాణిజ్య రంగాన్ని ఊహించని స్థాయికి తీసుకెళ్లారు. ఈ క్రమంలో టాటాలు 29 లిస్టెడ్ కంపెనీలు 70కి పైగా అన్‌లిస్టెడ్ సంస్థలకు హోల్డింగ్ కంపెనీగా టాటా సన్స్ సంస్థ పరిణామం చెందింది. టాటా గ్రూప్ పెట్టుబడుల్లో ప్రజల నుండి సేకరించిన పెట్టుబడులను కలుపుకొని 66 శాతం వాటాతో అతి పెద్ద భాగస్వామి టాటా సన్స్ కాగా 18.4 శాతం వాటాలతో పల్లోంజి మిస్త్రీలు 2వ స్థానంలో నిలిచారు. మిగిలిన వాటాలు అనేక కంపెనీల భాగస్వామ్యం.

**టాటాల ముందుచూపు**

టాటాల చరిత్ర ప్రారంభమైన నాటి నుండి జెమ్‌షడ్‌జీ టాటా మొదలుకొని రతన్‌టాటా వరకు సంస్థల ఆధిపత్యం ఆ టాటా కుటుంబ సభ్యుల నేతృత్వంలోనే కొనసాగుతూ వచ్చింది. ప్రధానంగా సామాజిక, ధార్మిక కార్యకలాపాలను నిర్వహించే అతిపెద్ద సరోద్ రాపుజీ టాటా ట్రస్టు, సర్ రతన్ టాటా ట్రస్టుల ఆధ్వర్యంలో సంస్థల కార్యాకలాపాల నిర్వహణ ట్రస్టులే టాటా సన్స్ బోర్డు డైరెక్టర్లుగా వ్యవహరిస్తూ టాటా గ్రూప్ చైర్మెన్ ఎంపిక, తొలగింపు అధికారాలు కలిగి ఉండేలా నిబంధనలను ఏర్పరుచుకోవడంలోనే టాటాల ముందుచూపు కన్పిస్తుంది. బిలియన్ డాలర్ల సంపదను సృష్టించుకున్న టాటా గ్రూప్ కేవలం విశ్వసనీయత మీదనే వ్యాపార రంగంలో ఎదురులేని శక్తిగా అవతరించింది. నమ్మకం, నాణ్యతా ప్రమాణాలకు రాజీ పడకుండా తాను ప్రారంభించిన సంస్థలు ఒడిదుడుకులకు లోనైనా తన విధానాల నుండి పక్కకు తప్పుకోలేదు. నిబద్ధతే వినియోదారుల్లో, షేర్ హోల్డర్స్ హృదయాల్లో చెరగని స్థానాన్ని సంపాదించుకుంది.

**పల్లోంజీ మిస్త్రీల ప్రవేశం**

జెఆర్‌డి టాటా నుండి వారసత్వాన్ని పుణికి పుచ్చుకున్న రతన్ టాటా కేవలం రెండు దశాబ్దాల కాలంలో టాటా గ్రూప్ సామ్రాజ్యాన్ని విస్తరించడంలో తన సర్వశక్తులు ఒడ్డి టాటా గ్రూప్‌ను వాణిజ్య శిఖరాలకు చేర్చినాడు. 1991లో గ్రూప్ కంపెనీల మొత్తం టర్నోవర్ 10 వేల కోట్లు కాగా 2011-12 నాటికి 100.9 బిలియన్ డాలర్లు (4.75 లక్షల కోట్ల)కు చేర్చగలిగాడు. తన కాలంలో 57 రెట్లు కంపెనీ వృద్ధికి తోడ్పడ్డాడు. టాటా సంస్థ ప్రారంభమైన ఏడు దశాబ్దాల అనంతరం టాటా గ్రూప్‌లోకి పల్లోంజీ మిస్త్రీల ప్రవేశం 1936లో అనివార్యంగా జరిగింది. వాస్తవానికి 1926లో ఎఫ్ ఇ దిన్‌షా కుటుంబీకులు టాటా సన్స్ ఏర్పాటు చేసిన విద్యుత్ యూనిట్ కోసం అవసరమైన కోటి రూపాయలను అప్పుగా తీసుకోవడం జరిగింది. దానిని దాదాపు 10 సంవత్సరాల కాలంలో తిరిగి చెల్లించలేని స్థితిలో ఆ రుణాన్ని టాటా సన్స్‌లో 12.5 శాతం వాటాగా మార్చడం జరిగింది. అయితే ఈ 12.5 శాతం వాటాను దిన్‌షా కుటింబీకుల నుండి షాపూర్‌జీ పల్లోంజి మిస్త్రీ కొనుగోలుతో టాటా సన్స్‌లోకి మిస్త్రీ కుటుంబం అడుగుపెట్టినట్లైంది. క్రమేపి టాటా బంధువుల నుంచి కూడ మరికొన్ని షేర్లను షాపూర్‌జీ కొనుగోలు చేయడంతో టాటా సన్స్ గ్రూప్‌లో మిస్త్రీల వాటా 18.5 శాతానికి చేరింది. వ్యాపార రంగంలో దగ్గర అయిన టాటా, మిస్త్రీలు బంధుత్వంలో దగ్గరైనారు. మిస్త్రీ సోదరి ఆలును రతన్‌టాటా సోదరుడైన నోయల్ టాటా వివాహం చేసుకోవడంతో టాటా కుటుంబీకులతో మిస్త్రీలకు మరింత సన్నిహిత సంబంధం ఏర్పడింది. కాని టాటా కుటుంబానికి మిస్త్రీలతో సంబంధం అసౌకర్యంగానే ఉందన్నది టాటాలను దగ్గర నుండి గమనిస్తున్న వ్యక్తుల అభిప్రాయంగా కన్పిస్తుంది. అయినప్పటికి పల్లోంజి మిస్త్రీ టాటా కుటుంబంతో స్నేహంగా మెదులుతూ టాటా సన్స్ కార్యాకలాపాలతో ఏమాత్రం జోక్యం చేసుకోకుండా తన వ్యాపార భాగస్వామ్యాన్ని కొనసాగించడం మూలంగా 2005లో పల్లోంజీ టాటా సన్స్ నుంచి వైదొలిగిన తరువాత అతని కొడుకు సైరెస్ మిస్త్రీ బోర్డు మెంబర్‌గా వచ్చాడు.

2011 నాటికి 75 వసంతాలు పూర్తి చేసుకున్న రతన్ టాటా టాటా సన్స్ గ్రూప్ చైర్మెన్ బాధ్యతల నుండి వైదొలగి సమర్థవంతమైన మరో చైర్మెన్ నియామకానికి అన్వేషణ కమిటీని వేసింది. లండన్ ఇంపీరియల్ కాలేజ్ ఆఫ్ సైన్స్ టెక్నాలజీ అండ్ మెడిసిన్ నుంచి సివిల్ ఇంజనీర్ గ్రాడ్యుయేషన్ పూర్తి చేసుకొని లండన్ బిజినెస్ స్కూల్‌లో మేనేజ్‌మెంట్ డిగ్రీ పట్టాను అందుకున్న సైరెస్ మిస్త్రీ తన 48వ ఏట బోర్డు డైరెక్టర్‌గా కొనసాగుతుండడం టాటా సన్స్‌లో టాటాయేతర ఏకైక అతి పెద్ద వాటాదారుగా ఉండడం చైర్మెన్ నియామకం కమిటీని ఆకర్షించింది. దీనితో సైరెస్ పల్లోంజీ మిస్త్రీ 150 ఏండ్ల చరిత్ర కలిగిన టాటా సన్స్ గ్రూప్ చైర్మెన్ నియామకమయ్యారు. నౌరోజీ షక్లత్‌వాలా తర్వాత టాటాయేతర చైర్మెన్ మిస్త్రీయే.

**టాటా సన్స్ సంక్షోభానికి కారణాలు**

వినియోగదారుల విశ్వాసానికి గీటురాయిగా కోట్లాది ప్రజల నమ్మకానికి లక్షలాది ఉద్యోగుల ఉపాధికి కేంద్రమైన టాటా సన్స్ గ్రూప్ మౌలిక లక్ష్యం తాను ప్రారంభించిన కంపెనీ ఏదైనా నష్టాల్లో ఉన్నప్పటికీ దానిని మరింత వృద్ధిలోకి తెచ్చుకుంటూ లాభాలు ఆర్జించే కంపెనీలను మరింత ముందుకు తీసుకుపోయే విధానాల కొనసాగింపుకు వారధిగా సారధిగా ఉంటాడనుకున్న సైరస్ మిస్త్రీ టాటాల ఆలోచనలకు ఆచరణలకు భిన్నంగా ఆలోచించడం కేవలం లాభాపేక్షతో నష్టాన్ని చవిచూస్తున్న కంపెనీల పట్ల అశ్రద్ధ వహించడం.

టాటాలకు దశాబ్దాలుగా అనుకూలురైన డైరక్టర్లను మార్చి టాటాలు అసమర్థులని భావించిన వారిని డైరక్టర్లుగా నియమించడం టాటా సన్స్ చరిత్రలో నియామకమైన ఒక చైర్మెన్‌ను నాలుగు సంవత్సరాలు పూర్తికాక ముందే తొలగించాల్సి రావడం వ్యాపార సామ్రాజ్యవాదు లందరిని ఆశ్చర్యానికి గురిచేసింది.

మిస్త్రీని తొలగించిన విధానం, ఒకసారి నియామకమైన ఉద్యోగిని కూడ తొలగించని టాటా ఏకంగా చైర్మెన్‌ను అప్రజాస్వామికంగా తొలగించడం అనేది కార్పొరేటు వ్యాపార రంగంలో సంచలనాన్ని సృష్టించింది. ఈ తొలగింపుకు ముందు రతన్ టాటా ప్రధానమంత్రిని, మంత్రులను కలవడం విశేషం. ఈ నేపథ్యంలో మిస్త్రీపై వేటుకు భిన్న కారణాలను టాటా గ్రూప్ చూపించింది.

**టాటాలకు వ్యతిరేకంగా మిస్త్రీ తీసుకున్న నిర్ణయాలు**

యూరప్‌లో టాటా గ్రూప్‌కున్న ఉక్కు వ్యాపారాన్ని విక్రయించడంపై టాటాలు తీవ్రంగా పరిగణించినారు. ఒక నష్టాల్లో ఉన్న వ్యాపారానికి కారణాలు తెలుసుకొని నివారించి తిరిగి ప్రాణం పోయాలి కాని విక్రయించడమనేది టాటాల విధానం కాదు. బ్రిటన్‌లో టాటా స్టీల్స్ ఆస్తులను రైటాఫ్ (రద్దు) చేయడంలో గ్రూప్ కంపెనీ వ్యవస్థను కాని వాటాదార్ల సునిశితత్వాన్ని కాని మిస్త్రీ పరిగణలోనికి తీసుకోలేదు. డొకొమో న్యాయపోరాటం టాటాలిచ్చిన మాటకు విరుద్ధంగా జరిగింది. ఒకవేళ జేవి నుంచి వైదొలిగితే కొనుగోలు చేసిన 26.5 శాతం వాటా విలువలో 50 శాతం నిష్క్రమణ రుసుముగా జేవికి టాటాలు చెల్లించాలి. ప్రధానంగా రతన్‌టాటా భారత్‌లో డొకొమో పెట్టుబడులను రక్షిస్తామని హామీ ఇచ్చాడు. విదేశీ చట్టాల మార్పును సాకుగా చూపించి ఆ చెల్లింపును నిరాకరిస్తే టాటా సన్స్‌ను అమెరికా కోర్టుకు లాగింది. స్వయంగా రతన్ టాటా జపాన్ రాయబారిని కలిసి సమస్యను సానుకూలంగా పరిష్కరించండని కోరినప్పటికీ మిస్త్రీ దానిని నిరాకరించడం టాటా గ్రూప్ ప్రతిష్టకు భంగం వాటిల్లినట్లయింది. దీని పట్ల టాటా ట్రస్టులు తీవ్రమైన అసంతృప్తిని వ్యక్తం చేసారు. బ్రెగ్జిట్ ఒప్పందాల కారణంగా (జెఎల్ఆర్) జగ్వార్ లాండ్ రోవర్ పైన ప్రతికూల ప్రభావం పడింది. దీనిని ఎదుర్కొనే ప్రత్యామ్నాయ ప్రణాళిక మిస్త్రీ దగ్గర లేకపోవడమే ప్రతియేటా టాటా మోటార్స్ రెండు కొత్త కార్లను ప్రవేశపెడుతుంది. టియాగో (జీకా పేరు మార్చారు), 'బోల్ట్', 'జెస్ట్'లు కూడా దేశీయ మార్కెట్‌ను నిరాశ పరిచినాయి. హామీలిస్తే ఎట్టి పరిస్థితుల్లోనైనా నిలబెట్టుకోవాలనేదే టాటాల విధానం కాని ముడిపదార్థం ధరలు, ఉత్పత్తి వ్యయాల పెరుగుదలను సాకుగా చూపించి లక్ష రూపాయలకు 'నానో' కారును అందించలేమని మిస్త్రీ స్పష్టం చేస్తూ రతన్ టాటా మానస పుత్రిక నానో కారును మార్కెట్‌కు దూరం చేయడం వల్ల టాటా తీవ్ర ఉద్వేగానికి లోనైనారు. టాటా సన్స్ బాధ్యతలు తీసుకున్న అనంతరం స్వచ్ఛందంగా ఐరిష్ పౌరసత్వాన్ని మిస్త్రీ వదులుకోకపోవడం టాటా నిబంధనలను పాటించలేదని చర్చించారు. షాపూర్‌జీ గ్రూప్‌కు ప్రయోజనం చేకూర్చడం కోసమే స్థిరాస్తి ప్రాజెక్టు వైపు మిస్త్రీ ఆసక్తి చూపి పలు కాంట్రాక్టులు ఈ గ్రూప్‌కు అప్పజెప్పాడు. ఇండియన్ హోటల్స్ మేనేజింగ్ డైరెక్టర్ టాటాలకు అత్యంత సన్నిహితుడైన రేమండ్ బిక్సన్‌ను మిస్త్రీ తొలగించి ఆయన స్థానంలో రతన్ టాటా చైర్మెన్‌గా ఉన్నకాలంలో పలు ఆరోపణలున్న రాకేశ్ సర్నాను నియమించాడు. సౌర విద్యుత్ క్షేత్రాలను టాటాలను గాని ఇతర కీలక వాటాదారులను గాని, వ్యక్తులను గాని సంప్రదించకుండానే టాటా పవర్ ద్వారా మిస్త్రీ ఏకపక్షంగా కొనుగోలు చేసాడు. మొత్తంగా టర్నోవర్ పెద్దగా పెంచలేదు. వ్యాపారంలో వృద్ధి నామమాత్రంగా ఉండుట నాయకత్వ లోపమని నిర్ధారించుకొని ప్రపంచంలోని నలుమూలలనుండి వచ్చిన అనేక ఇ-మెయిల్స్, కాల్స్ అనంతరం టాటా ట్రస్టు సూచనల మేరకు మిస్త్రీని తొలగించే నిర్ణయానికి వచ్చినట్లు బోర్డు ప్రకటించింది.

**సైరస్ మిస్త్రీ వివరణ**

టాటాలు చైర్‌మెన్ బాధ్యతలను అప్పగించినప్పటికీ తెరవెనుక నుంచి కథంతా రతన్ టాటా నడిపించాడు. కార్పొరేట్ నైతిక నియమావళి (గవర్నెన్స్) ఒట్టి మాటేనని మిగతా డైరెక్టర్లను పోస్టుమెన్‌లుగా మార్చుకొని బోర్డు సమావేశాల్లో కీలక నిర్ణయాల్లో మధ్యలో బయటకు వెళ్లి రతన్ టాటా నుంచి సూచనలు తీసుకొని వచ్చి వారి అభిప్రాయంగా చెప్పేవారు. చైర్మన్‌కు స్వేచ్ఛనిస్తానని చెప్పి టాటా కుటుంబ నిర్వహణలో ఉన్న ట్రస్టులు టాటా సన్స్ బోర్డుల మధ్య నిర్ణయాధికారాలకు సంబంధించిన కంపెనీ నిబంధనలన్నింటినీ మార్చేసారు. ప్రత్యామ్నాయ అధికార కేంద్రాలను సృష్టించారు. గ్రూప్ నాయకత్వ బాధ్యతలప్పజెప్పి చేతులు కట్టేశారు. అచేతన చైర్మన్‌గా మార్చారు. కుటుంబ అధిపత్యంతో టాటాలు తమను అగౌరవపరిచి బయటకు పంపారని మిస్త్రీ తన తొలగింపు తర్వాత వెల్లడించిన వివరాలను బట్టి తెలుస్తుంది. ఈ టాటా కుటుంబ ఆధిపత్య పోరు అటు దేశంలోను ప్రపంచ వాణిజ్య రంగంలోను ఇటు సామాన్య వినియోగదారు ప్రయోజనాలకు గాని ఎదురైన, ఇప్పటికీ ఎదురవుతున్న సమస్యలే ప్రధానంశంగా భావించిన నేపథ్యంలో జరిగిన పరిణామాలు.

**ప్రజా ప్రయోజనాలు**

ప్రపంచవ్యాప్తంగా టాటా గ్రూప్ కంపెనీలలో వివిధ మ్యూచువల్ ఫండ్స్ వేలకోట్ల రూపాయలు పెట్టుబడి పెట్టినారు. దీనితోపాటుగా ప్రసిద్ధి పొందిన మ్యూచువల్ ఫండ్స్‌లో వివిధ రంగాలలో టాటా కంపెనీ కూడా భారీగా పెట్టుబడులు పెట్టింది. ఈ వివాదం కారణంగా టాటా కంపెనీల షేర్ల ధరలు భారీగా పతనమైనాయి. టాటాలు ఇతర మ్యూచువల్ ఫండ్స్ నుండి తమ నిధులను అర్ధాంతరంగా ఉపసంహరించు కుంటాయన్న ఆందోళనలు మరొక వైపుగా ఊపు అందుకున్నాయి. ఈ అనిశ్చితి కారణంగా కంపెనీ షేర్లపై మరింత ప్రభావం కన్పించింది. షేర్లన్నీ నష్టాలబాటలో ఉన్నాయి. ప్రపంచ దేశాల్లో నాణ్యత, నమ్మకం విషయంలో ప్రజల విశ్వాసం ఉన్న కంపెనీ నుండి వినియోగదారులు కొత్త సంస్థలను వెతుక్కోవడం కొంత అసౌకర్యమే. లాభాల మీద వ్యాపారం చేయాలి కాని మోసాల మీద కాదని, ఇచ్చిన మాటకు కట్టుబడి నష్టాలు వచ్చినప్పటికీ ఎన్నికష్టాలనైనా అధిగమించి సంస్థలను లాభాల బాటలోకి తీసుకు పోవాలని టాటాల విధానాన్ని ప్రజలకున్న దశాబ్దాల విశ్వాసాన్ని ఈ వివాదం కొంత గందరగగోళంలోకి నెట్టివేసింది. 40కి పైగా కంపెనీల ఇన్వెస్టర్లకు డివిడెండ్లు భారీగానే తగ్గాయి, వ్యయాలు మరింతగా పెరిగాయి.

అత్యంత బలమైన కార్పొరేట్ కంపెనీ టాటా చైర్మన్ మిస్త్రీని నాలుగు సంవత్సరాలకే అనివార్యంగా అనూహ్యంగా తొలగించి రతన్ టాటా తాత్కాలిక బాధ్యతలు చేపట్టడం, అనంతరం నాలుగు మాసాల కొరకు ఇషాంత్ హుస్సేన్‌ను చైర్మన్‌గా నియమించడం అసాధారణ సంఘటనే. ఈ ఘటన భిన్నాభిప్రాయాల మధ్య జరిగిన భీకరయుద్ధంగా భావించాలి. ఈ నిర్ణయం ప్రపంచవ్యాప్తంగా వ్యాపార పరిశ్రమలను భారీ కుదుపుకు గురి చేసింది. కార్పొరేట్ వ్యవస్థలో సంచలనం సృష్టించింది. ఈ తొలగింపు విధానం ప్రపంచ మార్కెట్ వ్యవస్థలో కార్పొరేట్ శక్తుల ఆధిపత్య భావజాలానికి, నిరంకుశ విధానాలకు అద్దం పడుతుంది. అంతేగాక అప్రజాస్వామిక విధానాలకు మిగిలిన మల్టీనేషనల్ కంపెనీలకు ఈ దుర్మార్గపు తొలగింపు బాటలు పరిచినట్లయింది. భాగస్వామ్య పక్షాల ఆమోదం నుండి చైర్మన్‌గా నియామకమైనప్పటికీ అందరి ఆమోదం లేకుండా తీవ్ర వత్తిడి నడుమ తమ అభిప్రాయాలకు మాత్రమే టాటాలు ప్రాధాన్యతనిస్తూ బయటకు పంపడం న్యాయ విరుద్ధం. కంపెనీల సహజ న్యాయ సూత్రాలకు వ్యతిరేకంగా, ప్రజాస్వామ్య విధానాలకు విరుద్ధంగా జరిగిన నియామకాలను గానీ, తొలగింపులను గానీ, తర్కబద్ధంగా ప్రజాపక్షాన ఆలోచించే బుద్ధిజీవులుగా చర్చించాల్సిందే, అవసరమైతే అటువంటి విధానాలను ఖండించాల్సిందే.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలంగాణ యూనివర్సిటీ)* వీ

# భోపాల్ ఎన్‌కౌంటర్ వేస్తున్న ప్రశ్నలు

*భోపాల్‌లో ఎన్‌కౌంటర్ జరిగిన తీరు, ఘటనకు సంబంధించిన వీడియో దృశ్యాలు అనేక అనుమానాలనూ, ప్రశ్నలనూ లేవనెత్తుతున్నాయని అంటున్నారు* **సంతోష్**

అక్టోబర్ 24-31 మధ్యలో వేర్వేరు రాష్ట్రాల్లో జరిగిన ఎన్‌కౌంటర్ల సంఘటనలు యావత్ దేశాన్ని కుదిపేశాయి. ఒకటి ఆంధ్ర - ఒడిశా సరిహద్దులో 31 మంది నక్సలైట్లను ఎన్‌కౌంటర్ పేరుతో హతమార్చడం, మరొకటి మధ్యప్రదేశ్ రాజధాని భోపాల్‌లో జైలులో విచారణ ఖైదీలుగా ఉన్న సిమి మిలిటెంట్లకూ, పోలీసులకూ మధ్య జరిగిన ఎన్‌కౌంటర్‌లో అక్టోబర్ 31న ఎనిమిది మంది మరణించారని వచ్చిన వార్త సంచలనం సృష్టించింది. మృతులంతా వేకువజామున జైలు నుంచి తప్పించుకు పోయారని అడ్డుకోబోయిన గార్డును హతమార్చారని పోలీసులు చెబుతున్నారు. కారాగారానికి ఎనిమిది కిలోమీటర్ల దూరంలో ఉన్నట్లు వారి ఆచూకీ తెలిసి నిర్బంధించడానికి వెళ్తే తిరగబడ్డారని, గత్యంతరం లేక కాల్పులు జరపగా ఆ 8 మంది హతమయ్యారని వారంటున్నారు. కొన్ని దశాబ్దాలుగా పోలీసులు వినిపిస్తున్న ఎన్‌కౌంటర్ కథలకు ఇదేమీ భిన్నంగా లేదు.

భోపాల్ ఎన్‌కౌంటర్ పరిణామాలు పోలీస్ కథనానికి భిన్నంగా ఉంది. ఎన్‌కౌంటర్ జరిగిన కొన్ని గంటలకే సామాజిక మాధ్యమాల్లో విడుదలైన రెండు వీడియోలు అందరినీ దిగ్భ్రాంతికి గురిచేశాయి. నలుగురైదుగురు వ్యక్తులను పోలీసులు చుట్టుముట్టడానికి ప్రయత్నించడం ఒక వీడియోలో కనబడితే... నిరాయుధుడిగా ఉన్న వ్యక్తిని ఒక కానిస్టేబుల్ గురి చూసి కాల్చి చంపుతున్న దృశ్యం మరో వీడియోలో ఉంది. ముగ్గురు పరారు కావడానికి ప్రయత్నిస్తున్నారని, అయిదుగురు ఏదో చెబుతున్నారని ఒక కానిస్టేబుల్ వైర్‌లెస్ సెట్‌లో పై అధికారులకు తెల్పడం మొదటి వీడియోలో వినబడుతోంది. వీటిని గమనిస్తే అదుపులోకి తీసుకున్న ఉగ్రవాదులను ఎలాంటి ప్రతిఘటనా లేకుండానే పోలీసులు చంపారని అర్థమవుతుంది. సజీవంగా పట్టుకోవడానికి అస్కారం ఉన్నప్పుడిలా ఎందుకు జరిగింది?

పరారైనట్లుగా చెప్పుతున్న 8 మంది 'సిమి' (స్టూడెంట్స్ ఇస్లామిక్ మూవ్‌మెంట్ ఆఫ్ ఇండియా) విచారణ ఖైదీలు ఎంతో కట్టుదిట్టమైన భద్రత ఉన్న జైలు నుండి ఎలా తప్పించుకున్నారు, వారికి ఆయుధాలు ఎలా లభించాయి. ఎన్‌కౌంటర్ ఎలా జరిగింది, వీడియోలను ఎలా చిత్రించ గలిగారు? వీటన్నింటిపై ప్రభుత్వం, పోలీసులు చెబుతున్న అంశాలు పరస్పర విరుద్ధంగా ఉన్నాయి. ఆ రాష్ట్రంలో బిజెపి ప్రభుత్వం అధికారంలో ఉంది. నరేంద్రమోడీ ప్రభుత్వం, ఆర్‌ఎస్‌ఎస్‌లు ప్రతి సంఘటనను మతాల ఆధారంగా ప్రజలను విభజించి వారి ఎజెండాను ముందుకు తీసుకెళ్లడానికి ఉపయోగించుకుంటూ, వాటిని వ్యతిరేకించే ప్రతిపక్ష పార్టీలను, లౌకిక ప్రజాస్వామిక వాదులను జాతి వ్యతిరేకమైన వారిగా ముద్ర వేస్తున్నాయి. ఇప్పుడు భోపాల్ కేంద్ర కారాగారం నుండి సిమి ఉగ్రవాదులు తప్పించుకోవడంపై మీడియాలో వచ్చిన సందేహాలను నివృత్తి చేయడానికి బదులుగా ప్రశ్నలను లేవనెత్తిన వారిని, పోలీసుల దుశ్చర్యలను ప్రశ్నించిన వారిని జాతి వ్యతిరేకులుగా, జాతీయ భద్రతకు ప్రమాదకారులుగా బిజెపివాదులు ఖండించడం దురుద్దేశ పూరితం. కొందరు బిజెపి వాదులు ఒకడుగు ముందుకు వేసి మధ్యప్రదేశ్ పోలీసులను సరిహద్దులలో పోరాడుతున్న వీరజవాన్లతో పోల్చారు. ఇది బూటకపు ఎన్‌కౌంటర్లను సమర్థించడమే అవుతుంది.

బిజెపి నేతలు, ప్రభుత్వంలోనివారూ వాదిస్తున్న ప్రకారం మరణించిన వారంతా ఉగ్రవాదులే కావొచ్చు. వారిపై తీవ్ర నేరారోపణలు ఉండవచ్చు. గార్డును చంపి పరారైనవారే కావొచ్చు. వారివల్ల సమాజానికి పెను ముప్పు కలిగే అవకాశమూ ఉండొచ్చు. ఈ విషయంలో వారితో ఏకీభవించే వారికి సైతం కొన్ని అనుమానాలు కలుగుతున్నాయి. ఆ ఎనిమిదిమందీ ఇంత ప్రమాదకారులు గనుకే వారిని సజీవంగా పట్టుకుని ప్రశ్నించి రాబట్టవలసిన అంశాలు ఎన్నో ఉంటాయి. ఎందుకంటే వారు తప్పించుకున్న సెంట్రల్ జైలు దేశంలోనే అత్యంత కట్టుదిట్టమైన భద్రత గలది. దాని చుట్టూ 35 అడుగుల ఎత్తయిన గోడ, ఆ గోడపై విద్యుత్ తీగల వలయాలు, నలు దిశలా నిత్యం రెప్పవాల్చని నిఘాలో ఉండే సెక్యూరిటీ పోస్ట్‌లు, సిసి కెమెరాల వంటివి ఉన్నాయి. అలాంటిచోట ఎనిమిది మంది ఒక గార్డును చంపి దుప్పట్ల సాయంతో తప్పించుకోవడం సాధ్యమేనా? అనే ప్రశ్న సహజంగానే కలుగుతుంది. తప్పించుకున్న ఖైదీలు వేర్వేరు దిశల్లో పారిపోకుండా అందరు కట్టగట్టుకొని ఒకే దిశగా వెళ్లడమేంటి? వారి ఒంటిమీద జీన్స్, బూట్లు, బెల్టులు ఎక్కడివి? జైలులో హత్యకు గురైన జైలుగార్డు రామకిషన్ యాదవ్‌ను హత్య చేసింది వారేనా లేదా దీనివెనుక మరేదైనా కుట్ర ఉందా? ఇలా ఎన్నో ప్రశ్నలు తలెత్తుతున్నాయి.

నిషేధిత సంస్థ సభ్యులను హతమారిస్తే తప్పేమిటని వాదించే వాళ్లు ఆర్‌ఎస్‌ఎస్‌పై కూడ అనేకసార్లు నిషేధం ఉండిందన్న విషయాన్ని గుర్తు చేసుకోవాలి. సిమి - ఇస్లామిక్ రాజ్యం ఏర్పాటు లక్ష్యంగా గల మతసంస్థ, మరి హిందూత్వవాదులైన ఆర్‌ఎస్‌ఎస్‌ది హిందూరాజ్య స్థాపన లక్ష్యం కాదా? అంటే మెజారిటీ మతతత్వానికి ఒక నీతి, మైనారిటీ మతతత్వానికి మరో నీతి ఉంటుందా? మరోవైపు మధ్యప్రదేశ్ బిజెపి ప్రభుత్వం వ్యాపం వంటి కుంభ కోణాల్లో నిండా మునిగి ఉంది. ఇందులో సాక్షులుగా ఉన్నవారు ఇప్పటి వరకు కనీసం 25 మంది శవాలై తేలారు. దీనిపై రాష్ట్ర ప్రజల్లో తీవ్ర ఆగ్రహం ఉంది. ఒక ప్రత్యేక మతానికి చెందిన అనుమానిత ఉగ్రవాదులను తీవ్రంగా అణచివేయడం లేదా చంపేయడం ద్వారా మెజారిటీ మతానికి చెందిన ప్రజల భావోద్వేగాల్ని రెచ్చగొట్టి, వారికి ప్రాతినిధ్యం వహించే మొనగాడిగా తనను తాను నిరూపించుకోవడం బిజెపికి ఇప్పుడు అవసరం.

2014 ఎన్నికల ముందు ఉత్తరప్రదేశ్, గుజరాత్ రాష్ట్రాలలో బూటకపు ఎన్‌కౌంటర్లు జరిగాయి. నిజానికి గుజరాత్‌లో వామపక్ష తీవ్రవాదం గానీ, వేర్పాటువాద తీవ్రవాదం గాని ఏమి లేనప్పటికీ లెక్కలేనన్ని ఎన్‌కౌంటర్లు జరిగాయి. ఈ కేసుల్లో కొందరు మంత్రులు, పోలీసు అధికారులు, అమిత్‌షా వంటి వారు ముద్దాయిలుగా జైలుకు వెళ్లాల్సి వచ్చింది. సమీప భవిష్యత్తులో పలు కీలక రాష్ట్రాల్లో ఎన్నికలు జరగాల్సిన పరిస్థితుల్లో మతం ఆధారంగా ప్రజల్లో చీలిక తేవడం, తద్వారా మెజారిటీ మతస్తుల ఓటు బ్యాంకును గట్టి పర్చుకోవడమే వ్యూహంగా అది ఇలాంటి ఘోరాలకు పాల్పడుతోంది. మరోవైపు గోరక్షణ పేరుతో దళితులపై దాడులకు తెగబడుతుంది.

భోపాల్ సంఘటనను బిజెపి రాజకీయంగా ఉపయోగించు కొనేందుకు అన్ని ప్రయత్నాలను చేస్తున్నది. విచారణ ఖైదీలను ఉగ్రవాదులుగా పేర్కొనడం విడ్డూరంగా ఉంది. సిమి సభ్యులపై ఎటువంటి అభియోగం ఇంకా న్యాయస్థానంలో నిరూపితం కానందువలన వారు విచారణ ఖైదీలుగానే ఉంటారు. వారిని నేరస్థులుగా పేర్కొనడం దారుణం. గతంలో రెండు డజన్లకు పైగా కేసుల్లో ఉగ్రవాద నేరారోపణలపై కొందరిని అరెస్టు చేసి రెండు దశాబ్దాలకు పైగా జైళ్లలో ఉంచి వారిపై దర్యాప్తు సంస్థలు ఆరోపణలను నిరూపించడంలో విఫలమైనందున కోర్టులు వారిని నిర్దోషులుగా విడుదలచేసిన ఉదంతాలు గమనించవలసి ఉంది. పార్లమెంటుపై దాడి కేసులో అరెస్టు చేసిన వారి విషయంలో దర్యాప్తు సంస్థలు సేకరించిన సాక్ష్యం ఆధారంగా కాక 'జాతి అంతరాత్మను' సంతృప్తి పరిచేందుకు అంటూ హిందూత్వ భావనతో కోర్టు శిక్షించింది.

ఈ ఉదంతం విషయంలో ఐజి యోగేష్ చౌధరి, రాష్ట్ర హోంమంత్రి భూపేంద్ర సింగ్ చేసిన ప్రకటనలు పొంతన లేకుండా ఉన్నాయి. కంచాలు, చెంచాలతో గార్డును హతమార్చారని భూపేంద్రసింగ్ అంటుండగా... తుపాకులతో దాడిచేసి చంపారని ఐజి చెబుతున్నారు. ఈ ఉదంతం విషయంలో జాతీయ దర్యాప్తు సంఘం (ఎన్ఐఏ) దర్యాప్తు చేస్తుందని సిఎం శివరాజ్‌సింగ్ చౌహాన్ చెప్పడం బాగానే ఉంది. కానీ ఆ దర్యాప్తులు సరిపోవు. అంతమంది తప్పించుకుపోయారంటే అందులో బయటి వ్యక్తుల ప్రమేయం ఉండి ఉండాలి. జైలు సిబ్బంది సహకారం ఉండాలి. వారివద్ద ఆయుధాలు ఉండి ఉంటే అవి ఎలా వచ్చాయో తేల్చాల్సి ఉంటుంది. మరోపక్క సులభంగా పట్టుకోగలిగి ఉన్నా వారిని కాల్చిచంపారని వీడియోలు స్పష్టంగా చెబుతున్నాయి. మరోవైపు ఎన్‌కౌంటర్‌లో రాజకీయ కుట్ర ఏమైనా ఉందా అన్నది కూడ పరిశీలించవలసి ఉంది. ఈ అంశాలన్నిటినీ ఎన్ఐఏ పరిధిలో జరిగే దర్యాప్తు తేల్చలేదు. సమగ్రమైన న్యాయ విచారణతోనే అసలు విషయాలు వెలుగులోకొస్తాయి. ఇంతకూ శివరాజ్‌సింగ్‌కు సుప్రీంకోర్టు ఇలాంటి ఉదంతాలపై గతంలో ఇచ్చిన మార్గదర్శకాలు గుర్తున్నట్టు లేవు. కనుక హైకోర్టు జడ్జితో న్యాయవిచారణ జరిపించాలి.

ఈ ఘటనలపై మీడియా కథనాల ఆధారంగా సుమోటోగా స్పందించిన ఎన్‌హెచ్ఆర్‌సి భోపాల్ జైలు నుంచి తప్పించుకున్న ఎనిమిది మంది సిమి కార్యకర్తల ఎన్‌కౌంటర్‌పై మధ్యప్రదేశ్ ప్రభుత్వానికి నోటీసులు జారీ చేసింది. మధ్యప్రదేశ్ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి, డిజిపి, డిజి జైళ్ల శాఖ ఐజికి నోటీసులు జారీ చేసింది. ఈ ఘటనపై ఆరు వారాల్లోగా సవివరమైన నివేదికలు సమర్పించాలని నోటీసుల్లో ఆదేశించింది. మరోవైపు నిషేధిత సిమి కార్యకర్తలను పోలీసులు హతమార్చిన ఘటనకు సంబంధించి వెల్లడయిన వీడియో కలకలం రేపుతోంది. 'అతడు బతికే ఉన్నాడు కాల్చి చంపండి' అని ఒక పోలీసు చెబుతున్నట్లు ఉన్న మొబైల్ ఫోన్ వీడియోపై దుమారం రేపుతోంది. అదే వీడియోలో 'ఛాతీలోకి కాల్చు... అతడు చచ్చిపోతాడు' అనే అరుపులు వినిపించాయి. వీడియోలలో ఓ వ్యక్తి చేతులు పైకిలేపి వేడుకుంటున్నా పోలీసులు కాల్పులు జరుపుతున్న దృశ్యాలు చోటుచేసుకున్నాయి. దీంతో నిరాయుధులై లొంగి పోదామనుకున్న సిమి కార్యకర్తలను పోలీసులు ఎన్‌కౌంటర్ చేశారన్న ఆరోపణలకు ఈ వీడియో ఊతమిస్తోంది. గతంలో మాలేగావ్, మక్కా మసీదు, సంఝౌతా ఎక్స్‌ప్రెస్‌పై దాడుల వంటి కేసుల్లో మైనార్టీ వర్గానికి చెందిన అమాయక ప్రజలను అరెస్టు చేశారు. ఆ పిదప అభినవ్ భారత్ వంటి విభిన్న హిందూత్వ సంస్థలు ఆ దాడులకు పాల్పడినట్టు గుర్తించారు. ఆ కేసుల్లో మైనార్టీ వర్గానికి చెందిన నిందితులను విడుదల చేసినప్పటికీ కట్టుకథలు అల్లి అమాయక ప్రజలను జైలుపాలు చేసిన పోలీసు అధికారులపై మాత్రం ఎట్టి చర్య తీసుకోలేదు. కల్నల్ పురోహిత్, సాధ్వీప్రగ్నా వంటి నిజమైన దుండగులపై కేసులను నీరు గార్చేందుకు ఇప్పటికే ప్రయత్నాలు జరుగుతున్నాయి. కొంతమందిని పోలీసులు లేదా దర్యాప్తు సంస్థలు అరెస్టు చేసినందున ఆర్ఎస్ఎస్ శ్రేణులు వారిపై ఉగ్రవాదిగా ముద్రవేయడాన్ని దేశంలోని లౌకిక ప్రజాతంత్ర శక్తులు అభ్యంతరం చెప్పవలసిన సమయం ఆసన్నమయింది. భోపాల్ ఉదంతం దృష్ట్యా ఇప్పటికే కొన్ని ఏళ్ళ తరబడి చెరసాలల్లో మగ్గుతున్న ముస్లిం మైనార్టీ వర్గాలకు చెందిన వందలాది మంది యువకుల కేసులను దేశ సర్వోన్నత న్యాయస్థానం సుమోటోగా స్వీకరించాలి. వారిపై పెట్టిన నేరారోపణలు నిరూపించడంలో పోలీసులు విఫలమైనందున వారి విడుదల విషయంలో కూడా సర్వోన్నత న్యాయస్థానం కల్పించుకోవాలి.

దేశంలో ఇప్పటి వరకూ దాదాపు 368 బూటకపు ఎన్‌కౌంటర్లపై జాతీయ మానవహక్కుల సంఘం కేసులు నమోదు చేసింది. ఎన్‌హెచ్ఆర్‌సి గణాంకాల ప్రకారం పరిశీలిస్తే.. 2011-12లో 185, 2012-13లో 126, 2013-14లో 49, 2015-16లో 8 బూటకపు ఎన్‌కౌంటర్లపై జాతీయ మానవహక్కుల సంఘం కేసులు నమోదు చేసింది. అయితే జాతీయ మానవ హక్కుల సంఘం బాధితులకు పరిహారం చెల్లించాలని హోంశాఖను ఆదేశించినా స్పందన అంతంత మాత్రమే. 368 కేసుల్లో 46 బూటకపు ఎన్‌కౌంటర్లలో బాధితులకు రు. 2.83 కోట్ల మేరకు పరిహారం చెల్లించాలని జాతీయ మానవహక్కుల సంఘం ఆదేశించింది. ఈ 368 కేసుల్లో కేవలం ఒకే ఒక కేసులో బూటకపు ఎన్‌కౌంటర్‌కు బాధ్యులపై చర్యలు తీసుకోవాలని కేంద్ర ప్రభుత్వాన్ని ఎన్‌హెచ్ఆర్‌సి ఆదేశించింది. ఏ బూటకపు ఎన్‌కౌంటర్‌ను పరిశీలించినా... కేసుల విచారణ ఏళ్లకు ఏళ్లు కొనసాగడం... బాధితులపై పోలీసుల ఒత్తిళ్లు పెరగడంతో సాక్ష్యాలు నిలవక కేసులు నీరుగారిపోతున్నాయి.

ఇదిలా ఉంటే... ముంబైలో ఎన్‌కౌంటర్లు మరోలా ఉంటాయి. గ్యాంగ్‌స్టర్లను ఖతం చేసే ప్రతి పోలీసు అధికారి ఓ సెలబ్రిటీగా మారిపోయాడు. ఈ ఎన్‌కౌంటర్లను ఓ విజయ గాథలుగా బాలీవుడ్ తెరకెక్కించి... పోలీసు అధికారులను హీరోలుగా చూపించడమే కాదు... ఎన్‌కౌంటర్ స్పెషలిస్టులన్న బిరుదులను ప్రదానం చేసింది. పోలీస్ అధికారి ప్రదీప్ శర్మ అత్యధికంగా 104 ఎన్‌కౌంటర్లు చేశాడు. ఆయన తరువాత దయానాయక్ 83, ప్రఫుల్ భోస్లే 77, రవీంద్రనాథ్ ఆంగ్రే 54, సచిన్ వాజే 63, విజయ్ సలస్కార్ 61 ఎన్‌కౌంటర్లు చేశారు. ఈ కేసులన్నింటిపై జాతీయ మానవ హక్కుల సంఘం దర్యాప్తు కొనసాగుతూనే ఉంది. ఇవన్నీ జాతీయ మానవ హక్కుల సంఘం దృష్టికి

వచ్చిన బూటకపు ఎన్‌కౌంటర్లే. ఎన్ని కమిషన్లు వేసినా... బూటకపు ఎన్‌కౌంటర్ల అంతు మాత్రం తేలడం లేదనేది సగటు భారతీయుడి అభిప్రాయం.

'శత్రువును చంపడమొక్కటే అందుబాటులోని ఏకైక పరిష్కారం కాదు. దేశానికి శత్రువు అనే ఆరోపణతోనో, అనుమానం మీదనో పౌరులను కాల్చి చంపడానికి సాయుధ దళాలను వినియోగించడాన్ని చట్టమే కాదు, ప్రజాస్వామ్యం కూడా అంగీకరించదు' అని సుప్రీంకోర్టు తేట తెల్లం చేసింది. శత్రువని అనుమానించే పౌరులను కూడా రాజ్యాంగం 21వ అధికరణ కల్పించిన జీవనహక్కు సహా ప్రాథమిక హక్కులన్నీ ఉంటాయని న్యాయమూర్తులు మదన్ బిలోకూర్, యు.యు. లలిత్‌లతో కూడిన ధర్మాసనం కుండబద్దలు కొట్టింది. ప్రత్యేక చట్టాల అధికారం కింద సైన్యం ఏది చేసినా చెల్లిపోతుందనడం సరికాదని, ఎన్‌కౌంటర్ హత్యలని అది చెబుతున్న వాటిపై విచారణలు జరిపి శిక్షలు విధించే అధికారం సాధారణ క్రిమినల్ కోర్టులకు ఉంటుందని చేసిన విశదీకరణ తరువాతనైనా దేశ భద్రత పేరుతో సాధారణ పౌరులపై సాయుధ బలగాలు సాగిస్తున్న దురాగతాలకు అడ్డుకట్టవేయక పోవడం శోచనీయం.

సుప్రీంకోర్టు ఏం చెప్పింది? నిందితుల కదలికల గురించి సమాచారం అంది వారిని పట్టుకోవడానికి వెళ్ళే పోలీసులు కీలకమైన సమాచారం మినహా మిగిలిన అంశాలను పోలీస్‌స్టేషన్‌లో లిఖితపూర్వకంగా నమోదు చేసి మరీ ఆ ప్రాంతానికి వెళ్లాలన్నది అందులో మొదటిది. అలాగే ఎన్‌కౌంటర్‌లో ఏ వైపు మరణాలు సంభవించినా వెనువెంటనే ఎఫ్ఐఆర్ నమోదు చేయాల్సి ఉంటుంది. ఈ ఉదంతంలో పాలుపంచుకోని పోలీస్‌స్టేషన్‌కు చెందిన అధికారితో లేదా సిఐడి వంటి మరో విభాగంతో స్వతంత్ర దర్యాప్తు జరిపించాలన్నది మరో సూచన. అది శాస్త్రీయంగా, డాక్యుమెంటరీ సాక్ష్యాలతో నిర్ణయాత్మకమైనదిగా ఉండాలి. దర్యాప్తు ప్రగతిపై ఆర్నెల్లకోసారి రాష్ట్ర, జాతీయ మానవ హక్కుల సంఘాలకు నివేదికలు ఇస్తుండాలి. ఎన్‌కౌంటర్ నిజమైనదేనని తేలేవరకూ బాధ్యులకు అవార్డులు, పదోన్నతులు ఇవ్వకూడదు. తప్పు చేశారని దర్యాప్తులో రుజువైతే బాధ్యులను వెనువెంటనే సస్పెండ్ చేసి వారిపై చర్యలు ప్రారంభించాలి. రెండేళ్లక్రితం ఒక తీర్పునిస్తూ వెలువరించిన ఈ మార్గదర్శకాలను గమనిస్తే సర్వోన్నత న్యాయస్థానానికి మన పోలీసు వ్యవస్థ పైనా, పాలకుల తీరుపైనా ఎంత అపనమ్మకం ఏర్పడిందో సులభంగా అర్థమవుతుంది.

ఎవరినైనా ఎన్‌కౌంటర్‌ల పేరుతో హతమార్చినప్పుడు విచారణ జరపాలని కోరే హక్కుల సంఘాల నేతలనూ, ఇతరులనూ నక్సలైట్ల లేదా ఉగ్రవాదుల మద్దతుదార్లుగా చిత్రీకరించడానికి పోలీసులు ప్రయత్నిస్తారు. సుప్రీంకోర్టు ఇచ్చిన మార్గదర్శకాల తర్వాతనైనా ఎన్‌కౌంటర్లు ఆగలేదు. పౌరుల్లో సందేహాలూ తీరలేదు. ఇకనైనా ప్రజాస్వామ్య వ్యవస్థను ప్రహసనప్రాయం చేస్తున్న ఈ ఎన్‌కౌంటర్లకు ముగింపు పలకాలి. చట్టబద్ధ పాలనకు ప్రభుత్వాలు కట్టుబడాలి. ఆ సంస్కృతిని పెంపొందించినప్పుడే, పాలనలో పారదర్శకత ముఖ్యమని గుర్తించినప్పుడే పాలకులకూ, ప్రభుత్వాలకూ విలువ ఏర్పడుతుంది. విశ్వసనీయత పెరుగుతుంది. నిజాన్ని ప్రజల ముందుంచేందుకు అన్ని ఎన్‌కౌంటర్లపై దర్యాప్తు చేయవలసిన అవసరం ఉందని గతంలో సర్వోన్నత న్యాయస్థానం అభిప్రాయ పడింది. తన స్వీయ పర్యవేక్షణలో ఉన్నతస్థాయి న్యాయ విచారణకు సుప్రీంకోర్టు ఆదేశించేందుకు భోపాల్ ఎన్‌కౌంటర్ తగిన కేసు. ఈ విషయంలో సర్వోన్నత న్యాయస్థానం ఆ దిశగా అడుగులు వేసి లౌకిక ప్రజాస్వామ్య వ్యవస్థకు బాసటగా నిలుస్తుందని ఆశిద్దాం.

'కాల్పులు - ఎదురుకాల్పులు, దాడి-ప్రతిదాడి' వంటి సమస్యల పరిష్కారానికి మార్గం చూపజాలవు. సమస్యలకు మూలాలను అన్వేషించి, తదనుగుణంగా కార్యాచరణతో ముందుకు సాగి, చిత్తశుద్ధితో పరిష్కారాలను సాధించాలి. కేంద్రంలో గానీ, రాష్ట్రాల్లో గానీ పాలకులు సమస్యను జటిలం చేయకుండా సామరస్యతతో రాజకీయ పరిష్కారానికి మార్గాలను కనుగొనాలి. పాలకుల అభిప్రాయాలతో ఏకీభవించని వారిని నిర్బంధించడం లేదా బూటకపు ఎన్‌కౌంటర్లు చేయించే నియంతృత్వ పోకడలకు పోతున్న పాలకులు ప్రజా ఉద్యమాలపై, ఉద్యమకారులపై ఉక్కుపాదం మోపడానికి వెనకాడరు. నాజీ హిట్లర్ చేసింది కూడ సరిగ్గా ఇదే! దేశ లౌకిక, ప్రజాస్వామ్య వ్యవస్థను పరిరక్షించాలని, మోడీ ప్రభుత్వ ఫాసిస్టుదాడిని ఓడించాలని కోరుకునే వారు ఐక్యమై ఆర్ఎస్ఎస్ బిజెపిల దుష్టపన్నాగాలకు, అప్రజాస్వామిక విధానాలకు వ్యతిరేకంగా ప్రజలను సమీకరించి, క్రియాశీలం చేయవలసిన సమయం ఆసన్నమయింది.

*(రచయిత ఉపాధ్యాయులు)*

వీ

# బస్తర్ పోలీసు రాజ్యంపై టెలిగ్రాఫ్

*బస్తర్‌లో పోలీస్ ఇన్‌స్పెక్టర్ జనరల్ ఎస్ఆర్‌పి కల్లూరి నిరంకుశ రాజ్యం గురించి స్వానుభవంతో వివరిస్తున్నారు*

*టెలిగ్రాఫ్ విలేఖరి* **సోనియా సర్కార్**

జగదల్‌పూర్ విమానాశ్రయంలోకి ఆ తెల్లకారు ప్రవేశించగానే అక్కడి వాతావరణం ఒక్కుమ్మడిగా మారిపోతుంది. యూనిఫారాలు వేసుకున్న వాళ్లందరూ వెన్నెముకలను నిటారుగా నిలబెడతారు. సాధారణ పౌరులందరూ లేచి నిలబడతారు. హెలిపాడ్ మీద ఒక భయానక నిశ్శబ్దం వాలుతుంది.

కాని ఆశ్చర్యకరంగా ఆ కారులోంచి దిగిన మనిషి చాల మామూలుగా ఉంటాడు. ఈ పొట్టిగా, బొద్దుగా, ఐదడుగుల ఐదంగుళాల మనిషేనా బస్తర్ భయహేతువుగా పిలిచేది. నాకు నమ్మకం కలగలేదు.

వివాదాస్పదుడైన చత్తీస్‌గడ్‌లోని బస్తర్ రేంజి పోలీస్ ఇనస్పెక్టర్ జనరల్ శివరామప్రసాద్ కల్లూరికి కూడ నమ్మకం కలగలేదనుకుంటాను. మావోయిస్టు కంచుకోట అయిన బస్తర్‌లో ఏడు జిల్లాల బాధ్యుడుగా ఉన్న ఆ 45 ఏళ్ల అధికారి “బస్తర్ ప్రజలు నన్ను ప్రేమిస్తారు” అంటాడు.

బహుశా అందరూ కాదనుకుంటాను. చిత్రహింసలు పెట్టే, మహిళల మీద అత్యాచారాలు చేసే, భయోత్పాతంలో ముంచే మనుషులను తమ మీదికి వదిలేది కల్లూరి యేనని బస్తర్ గ్రామీణ ప్రజలు అంటారు. ఆ కల్లూరి మనుషులే బూటకపు ఎన్‌కౌంటర్లు చేస్తారు. బలవంతపెట్టి లొంగుబాట్లు సాధిస్తారు. కల్లూరి పోరాడుతున్నది మావోయిస్టులతో కాదనీ, ఆదివాసులతోననీ చాలమంది గ్రామస్తులు అన్నారు.

ఆ మాటలను ఇతర గ్రామస్తులెవరూ ఖండించలేదు గాని, కల్లూరి ఖండించాడు. “అదంతా నందిని సుందర్‌లాగ ఢిల్లీ నుంచి బస్తర్‌కు వచ్చి నా గురించి వ్యతిరేక ప్రచారం చేసేవాళ్ల మాట మాత్రమే” అన్నాడు.

సంభాషణలో అనేకసార్లు కల్లూరి ఢిల్లీ విశ్వవిద్యాలయ ప్రొఫెసర్ పేరు తీసుకొస్తాడు. ఆమె మీద, మరొక ముగ్గురి మీద చత్తీస్‌గడ్ పోలీసులు గత వారమే సుక్మా జిల్లా సౌతెనార్ గ్రామం నామాపరాకు చెందిన శాంనాథ్ బఘేల్‌ను హత్య చేసిన నేరంపై కేసు నమోదు చేశారు.

స్థానికంగా పనిచేస్తున్న తంగియా అనే సాయుధ ముఠా సభ్యుడైన బఘేల్‌మేలో నందిని సుందర్‌తో పాటు జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయ ప్రొఫెసర్ అర్చనా ప్రసాద్ పైన, రాజకీయ కార్యకర్తలు వినీల్ తివారీ, సంజయ్ పరాటేల పైన ఒక ఫిర్యాదు చేశాడని, తాను మావోయిస్టులకు వ్యతిరేకంగా సాగిస్తున్న పోరాటాన్ని ఆపకపోతే తనను చంపేస్తామని నందిని సుందర్ బెదిరించిందని ఆ ఫిర్యాదులో బఘేల్ పేర్కొన్నాడని కల్లూరి చెపుతున్నాడు.

“ఈ కేసులో మేం నందిని సుందర్‌ను విచారిస్తాం. మేం తప్పకుండా దీన్ని పెద్ద సమస్యగా మారుస్తాం. కాకపోతే మాకు ఇతర పనుల ఒత్తిడి చాల ఉంది” అన్నాడాయన నవంబర్ 6 ఆదివారం మేం జగదల్‌పూర్‌లో కలిసినప్పుడు.

కాని ఎక్కడో ఏదో సరిగ్గా లేనట్టనిపిస్తుంది. కల్లూరి నాతో ఆదివారం నాడు మాట్లాడినప్పుడు, నిందితుల మీద హత్యారోపణల ప్రస్తావనే ప్రచార సాధనాలలో రాలేదు. కాని వార్తలు బైటికి వచ్చే సమయానికల్లా, శనివారానికే ఈ ఆరోపణలు నమోదయ్యాయని తెలుస్తున్నది.

అంతే కాదు, బఘేల్ భార్య విమల నవంబర్ 2న మగశిశువును ప్రసవించింది. తంగియా లోని ఇతర సభ్యులతో ఎక్కడో ఉండిన బఘేల్ ప్రసవ వార్త తెలిసి ఆమెను చూడడానికి వచ్చాడు. రెండు రోజుల తర్వాత అర్ధరాత్రి, ఇంటి దగ్గర పడుకుని ఉండగా ఆయనను చంపేశారని కల్లూరి చెపుతున్నాడు.

నాలుగు రోజుల తర్వాత కల్లూరి ఫోన్‌లో మాట్లాడుతూ, నవంబర్ 5న తోంగ్‌పాల్ పోలీస్ స్టేషన్‌లో విమల చేసిన ఫిర్యాదు ఆధారంగా నందిని సుందర్ తదితరుల మీద ఎఫ్ఐఆర్ తయారయిందని అన్నాడు. కాని, తన ఫిర్యాదులో నందిని సుందర్ పేరు గాని, మరెవరి పేరు గాని చెప్పలేదని విమల ఆ తర్వాత ఒక వార్తా ఛానెల్‌తో చెప్పింది.

అంతమాత్రమే కాదు, ఆమె ఇంటి నుంచి ఆ పోలీస్ స్టేషన్‌కు పద్నాలుగు కిలోమీటర్ల దూరం. ఒక బాలింత బిడ్డకు జన్మనిచ్చిన రెండో రోజే అంతదూరం నడిచివచ్చి ఫిర్యాదు ఇవ్వగలదా అని నేను కల్లూరిని అడిగాను.

ఆయన విరుచుకుపడ్డాడు. “దానితో ఏం సంబంధం? ఆ ప్రశ్న అడిగారంటే మీరు ఎంత మొరటు, అమానుషమైన, అనాగరికమైన మనుషులు! మీరే న్యాయస్థానం అనుకుంటున్నారా? మీరంటే నాకొక లెక్కా? వందలాది మంది జర్నలిస్టుల్లో మీరొకరు. మీరు నన్ను గుచ్చి గుచ్చి ప్రశ్నించలేరు. మీ ప్రశ్నను బట్టే నాకు అర్థమయ్యేదేమంటే మీరు నా గురించి వ్యతిరేక వార్త రాయబోతున్నారు. బైటి నుంచి వచ్చి బస్తర్‌లో కల్లోలం సృష్టించాలనుకునే మీలాంటి జర్నలిస్టులు నాకొక లెక్క కాదు.”

ఆ తిట్లూ దుర్భాషలూ ఐదు నిమిషాల ముప్పై సెకండ్లు సాగాయి. “సరైన ప్రశ్నలు అడగండి. మానవీయంగా ఉండండి. జెఎన్‌యు, డియు వంటి సుదూర ప్రాంతాల్లోని రిమోట్ కంట్రోల్ చర్యల వల్ల గిరిజనుల హత్యాకాండ జరుగుతున్నది. నేను బస్తర్ నుంచి మావోయిజాన్ని నిర్మూలిస్తాను. అది నా సవాల్. మీకు గిరిజనుల పట్ల, ప్రజాస్వామ్యం పట్ల సానుభూతి ఉంటే నేను మీతో ఎన్ని రోజులైనా, గంటలైనా గడపడానికి సిద్ధం. కాని మీరు ఒక వ్యతిరేక వార్త రాయడానికే వచ్చినట్టయితే, నా సమయం వృథా చేయొద్దు. ఈ ప్రొఫెసర్లు పాక్ ఆక్రమిత కశ్మీర్‌లో తీవ్రవాద శిక్షణా శిబిరాలు నడుపుతున్నారా లేక చైతన్యవంతులైన విద్యార్థులకు పాఠాలు చెపుతున్నారా? ఆమె బెదిరిస్తుంది. ఫిర్యాదీ హత్యకు గురవుతాడు. నాగరికత అంటే ఇదేనా?”

కోపంతో ఆయన ఫోన్ దడాలున పెట్టేశాడు.

ప్రభుత్వ ప్రోత్సాహంతో సాగిన సాల్వాజుడుం అనే సాయుధ ముఠాను నందినీ సుందర్ చట్టపరమైన ప్రయత్నం వల్లనే 2011లో రద్దు చేసుకోవలసి వచ్చింది. అప్పటి నుంచీ ఛత్తీస్‌గఢ్ పోలీసులకు నందినీ సుందర్ పేరు వింటేనే ఒళ్లు మంట. ఇన్ఫోసిస్ పురస్కారం 2010 గెలుచుకున్న ఆమె కల్లూరి దళాలు సాగించిన అత్యాచారాల నెన్నిటినో వెలుగులోకి తెచ్చింది. పోలీసులు చూపిన ఆదివాసుల బూటకపు లొంగుబాట్ల గురించి, మూకుమ్మడి అరెస్టుల గురించి ఆమె మే లో ఒక నివేదిక విడుదల చేసింది. దంతెవాడ జిల్లా తాడ్‌మెట్లలో 2011లో 160 ఇళ్లు తగులబెట్టిన ఘటనపై ఆమె ప్రయత్నాల వల్ల స్పెషల్ పోలీస్ ఆఫీసర్ల పైన, సాల్వాజుడుం సభ్యులపైన కేంద్ర పరిశోధనా సంస్థ అభియోగపత్రం దాఖలు చేసింది. ఆ సమయంలో కల్లూరి అక్కడే సీనియర్ పోలీస్ సూపరింటెండెంట్‌గా ఉండేవాడు.

నేను విమల విషయం ఎత్తి కోపం తెప్పించేవరకూ కల్లూరి చాల గొప్పలు చెప్పుకున్నాడు. సిబిఐ పెట్టిన అభియోగపత్రాన్ని ఆయనేమన్నా వెనుకడుగుగా భావిస్తున్నాడా అని నేనడిగాను.

"వెనుకడుగా, అదెక్కడ? నేను పూర్తి శక్తితో పనిచేస్తున్నాను. నందిని సుందర్ గాని, ఇతరులు గాని బస్తర్‌లో అడుగు పెట్టడం అసాధ్యం. జనం వాళ్లను రాళ్లతో కొడతారు. వాళ్లు అప్పుడే పారిపోతున్నారు. వెనక్కి తిరిగారు. మన ఆంతరంగిక భద్రతతో ఆటలాడుకునే వారెవరైనా సరే కఠినమైన చట్టపరమైన చర్యలు తీసుకుంటాం. ఆమె ప్రజలను హింసకు రెచ్చగొడుతోంది. వాళ్లు తిరుగుబాటును, విప్లవాన్ని ఉద్బోధిస్తున్నారు. వాళ్లంతా ద్రోహులు" అని ఆయన పొగలు కక్కాడు.

మానవ హక్కుల ఉల్లంఘనలు అని మాట్లాడేవాళ్లంటే ఈ బడా పోలీసుకు ఎంతమాత్రం లెక్కలేదు. స్వయంగా ఆయన మీదనే అటువంటి ఆరోపణలు ఎన్నో వచ్చాయి. బలరాంపూర్‌కు చెందిన లేదా బాయి అనే ఆదివాసి స్త్రీ 2007లో కల్లూరి తన భర్తను చంపాడని, తనపై శంకర్ గఢ్ పోలీసు స్టేషన్‌లో అత్యాచారం చేశాడని ఫిర్యాదు చేసినప్పుడు రాష్ట్రంలోని పౌరహక్కుల సంఘాలు ఆందోళన నిర్వహించాయి. ఆ తర్వాత లేదా బాయి బిలాస్‌పూర్ హైకోర్టులో తన ఆరోపణను ఉపసంహరించుకోవడంతో కేసు కొట్టేశారు. అలాగే ఆయన మీద బూటకపు ఎన్‌కౌంటర్లకు సంబంధించీ, బలవంతపు లొంగుబాట్లకు సంబంధించీ ఎన్నో ఆరోపణలున్నాయి.

"ఈ బూటకపు ఎన్‌కౌంటర్లు అనబడేవాటి మీద ఎన్నో కమిషన్లను నియమించారు. కాని ఇప్పటివరకూ ఆ ఆరోపణలన్నీ నిరాధారమని రుజువయ్యాయి" అన్నాడాయన.

ఆదివాసి సమస్యలపై మాట్లాడడానికి, రాయడానికి ఛత్తీస్‌గఢ్‌కు "ఢిల్లీ నుంచి వచ్చేవాళ్లు" మీద కల్లూరికి ఏ మాత్రం లెక్కలేదు. "ఢిల్లీ నుంచి వచ్చే మీ జర్నలిస్టులు" అనే తిరస్కారమైన మాట ఆయన నోట్లోంచి చాలసార్లు వస్తుంది. "ఈ ఢిల్లీ నుంచి వచ్చే జర్నలిస్టులు మావోయిస్టులంటే రాబిన్ హుడ్‌లనుకుంటారు" అని ఆయన తన సహచరులతో చెపుతుంటాడు.

జగదల్‌పూర్ పోలీసు సూపరింటెండెంట్ ఆర్‌ఎన్ దాశ్‌తో సహా ఆ సహచరులందరూ బస్తర్ విమానాశ్రయంలో మేం మాట్లాడుకుంటుండగా చుట్టూ తిరుగుతున్నారు. కల్లూరి ఆ విమానాశ్రయం నుంచి హెలికాప్టర్ లో వెళ్లబోతున్నాడు. ఆంధ్రప్రదేశ్‌కు చెందిన కల్లూరి 1994 బ్యాచ్ ఐపిఎస్ అధికారి. వేంకటేశ్వరస్వామి భక్తుడు. నుదుటి మీద విభూది కొట్టవచ్చినట్టు కనబడుతుంది. మేం మాట్లాడుతుండగా ఒక కానిస్టేబుల్ ఆయన కోసం ఒక గ్లాసు మంచినీళ్లు తెచ్చాడు. కాని ఆయనకు నీళ్లు అక్కరలేదు. "హఠావ్ యహా సే" (అవతలికి పో) అని ఒక్క కసురు కసిరాడు.

ఇక ఆయన కోసం అక్కడ కొందరు సాధారణ పౌరులు కూడ వేచి చూస్తున్నారు. వారు ఆయన మార్గదర్శకత్వంలో రూపొందిన ఆక్షన్ గ్రూప్ ఫర్ నేషనల్ ఇంటిగ్రేషన్ (అగ్ని) అనే పౌర బృందం సభ్యులు. వాళ్లలో న్యాయవాదులు, ఉపాధ్యాయులు, వైద్యులు, కార్మిక నాయకులు, భారతీయ జనతా పార్టీ కార్యకర్తలు ఉన్నారు. వారిలో కొందరు ఇప్పటికే రద్దయిన సామాజిక్ ఏకతా మంచ్ కార్యకర్తలు కూడ. ఆ సంస్థ జగదల్‌పూర్‌లో ఆదివాసి కార్యకర్తలను, జర్నలిస్టులను వేధించిందని ఆరోపణలు వచ్చాయి.

"వాళ్లందరూ దేశం కోసం ఏమైనా చేయాలని అనుకునే జాతీయ వాదులు. కాని వాళ్లలో ప్రతి ఒక్కరిలో ఒక పోలీసు ఉన్నాడు" అని నొక్కి చెప్పాడు కల్లూరి.

ఆయన మాట్లాడుతుంటే నోట్స్ రాసుకుంటున్నది నేనొక్కదాన్ని మాత్రమే కాదు. ఒక అగ్ని సభ్యుడు కూడ కల్లూరి మాట్లాడిన ప్రతి మాటా రాసుకుంటున్నాడు. ఆయన కూడ జర్నలిస్టట.

తన అభిప్రాయాలు ప్రచారం చేయడానికి కల్లూరి సోషల్ మీడియాను విరివిగా వాడతాడు. మేం కలిసిన మర్నాడు ఆయన వాట్సప్ మీద 35కు పైగా చిత్రాలు, వీడియోలు, పత్రికావార్తల చిత్రాలు పంపాడు. వాటిలో కొన్ని ఆయన ప్రధాని నరేంద్ర మోడీతో కలిసి దిగిన ఫొటోలు కూడ. "వచ్చే ఎన్నికల లోపల మావోయిస్టులను నిర్మూలిస్తానని మోడికి చెప్పిన కల్లూరి" అని ఒక పత్రికావార్త శీర్షిక అంటుంది.

కల్లూరికి ముఖ్యమంత్రి రమణ్ సింగ్ ఆశీస్సులు కూడ ఉన్నాయి. నిజానికి కల్లూరికి అలవాటయిన విద్య అధికారానికి దగ్గరగా ఉండడమే. ఛత్తీస్‌గఢ్ మొదటి ముఖ్యమంత్రి, కాంగ్రెస్ వాది అజిత్ జోగితో కూడ బిలాస్‌పూర్ ఎస్‌పి గా కల్లూరి దగ్గరగా ఉండేవాడు. ఇప్పుడైతే ఆయనను అందరూ ముఖ్యమంత్రి మనిషి అంటారు. 2009లో దంతెవాడ ఎస్‌పిగా, 2014లో బస్తర్ ఐజిగా కల్లూరికి వెంటవెంటనే పదోన్నతులు వచ్చాయి.

ఈ పోలీసు అధికారి తన విజయాలను అంకెలలో లెక్కిస్తాడు. ఢిల్లీలోని హోం మంత్రిత్వ శాఖ నుంచి తనను ప్రశంసిస్తూ వచ్చిన లేఖల గురించి చెపుతాడు. ఈ సంవత్సరం 110కి పైగా మావోయిస్టులను చంపేశామని, గత 16 సంవత్సరాలలో అదే పెద్ద సంఖ్య అని చెపుతాడు. అలాగే, లొంగిపోయిన విప్లవకారులను డిస్ట్రిక్ట్ రిజర్వ్ గార్డ్ (డిఆర్‌జి) అనే మావోయిస్టు వ్యతిరేక చర్యల దళంలో చేరడానికి ఆయన ప్రోత్సహిస్తున్నాడు.

"ఈ లొంగిపోయిన మావోయిస్టులు ఎప్పుడూ నావెంట పడుతుంటారు. సర్, పార్టీని ఇవ్వండి, ఆపరేషన్ చేసి వస్తాం" అంటుంటారు అన్నాడు కల్లూరి.

ఈ డిఆర్‌జి సభ్యులు ఆపరేషన్స్ పేరిట అమాయక గ్రామస్తులను

# మైనింగ్ కోసం మారణకాండ

***ఆదివాసి ప్రాంతాల్లో ఖనిజ వనరులను బహుళజాతి, పెట్టుబడిదారీ కంపెనీలకు కట్టబెట్టడానికి ఆదివాసులపై, వారికి అండగా ఉన్న ఉద్యమకారులపై మారణకాండ సాగిస్తున్నారని అంటున్నారు* అరణ్య**

మరోసారి ఆంధ్ర, ఒడిశా ప్రభుత్వాలు కలిసి మావోయిస్టుల హత్యకు తెగబడ్డాయి. ప్రజల తరపున మాట్లాడినందుకు, వాళ్ల సమస్యల పరిష్కారానికి దారి చూపుతున్నందుకు గాను మావోయిస్టు పార్టీని టార్గెట్ చేసి మావోయిస్టులను, వారితో కలిసి సమస్యలు తెంపుకుంటున్నందుకు ఆదివాసులను పొట్టన పెట్టుకున్నాయి. కూంబింగ్‌లతో సరిహద్దు అడవులను జల్లెడ పడుతూ, అటవీ గ్రామాల ప్రజలను భయభ్రాంతులకు గురిచేసి వారిని హింసిస్తూ, వారిపై కేసులు పెడతామని బెదిరించి వాళ్ల ద్వారా మావోయిస్టుల జాడలు తెలుసుకుని నిరాయుధులైన వాళ్లను పట్టుకుని నానా హింసలు పెట్టి, లైంగిక అత్యాచారాలు జరిపి, ఎన్‌కౌంటర్ కథ అల్లి కాల్చి చంపేశారు. చాలా ఎన్‌కౌంటర్‌ల లాగే ఈ బెజింగి ఎన్‌కౌంటర్ కూడా బూటకమేనని తెలిపే సాక్ష్యాధారాలు స్పష్టంగా ఉన్ననూ వాటన్నింటితో ఏమీ జరగబోదన్న ధీమతో చంద్రబాబు నాయుడు, నవీన్ పట్నాయక్‌లు సంబరపడిపోతున్నారు.

దక్షిణ ఒడిశా, ఉత్తరాంధ్రల్లో ఆదివాసులు ఎక్కువగా నివసిస్తున్న ప్రాంతాలలో ప్రజల జీవన పరిస్థితులు చాలా దైన్యంగా ఉన్నాయి. ప్రతి సంవత్సరం విపరీతంగా అంటు వ్యాధులు ప్రబలి వేలకొద్దీ ఆదివాసులు మరణిస్తుంటారు. మైదాన ప్రాంత ప్రజలకు అతి చిన్నదైన మలేరియా మన్యంలో వేలాది మందిని భయపెట్టించే వ్యాధి. ప్రతి సీజన్‌లో అనేక మంది మలేరియా భారిన పడుతూ ఆసుపత్రికి చేరని కేసులు బోలెడున్నా, ప్రభుత్వం మాత్రం అతి తక్కువ గణాంకాలను చూపుతుంది. కనీసం అధికారికంగా పిఎచ్‌సిలలో నమోదైన కేసుల సంఖ్యను కూడా ప్రభుత్వం చూపించదు. అనేక రోగాలకు నివారిణైన రక్షిత మంచి నీరు మన్యంలో ఎక్కడా దొరకదు. డయేరియా, కలరాలకు కారణమైన కలుషిత నీటినే అక్కడి ఆదివాసులు దైనందిన అవసరాలకు వాడుతుంటారు. ఎఒబి అటవీ గ్రామాలలో చాలా వరకు ఆరోగ్య కేంద్రాలు లేవు. ప్రభుత్వాలు పిఎచ్‌సిలను ఏర్పాటు చయవు. అత్యవసరమైన చోట్ల ఆరోగ్య కేంద్రాలు ఉండవు. ఎక్కడో ఒకటి ఉన్నా ఆరోగ్య కేంద్రాలలో సిబ్బందిని ఏర్పాటు చేయవు. కనీసం నర్సుల స్థాయిలో నైనా సిబ్బంది నియామకం జరగదు. ఆరోగ్య కేంద్రాలకు మందులు సరఫరా చేయరు. దెబ్బతాకి రక్తం కారుతూ ఆరోగ్య కేంద్రానికి పోతే అయోడిన్ స్టాక్ లేదంటారు. ఆ కారే రక్తంతోనే దగ్గర్లోని పట్టణానికో, నగరానికో పోతేగాని కట్టు కట్టుకోలేని పరిస్థితి. రవాణా సదుపాయాలు ఉండవు కనుక రోగిని మైళ్లకొద్దీ దూరం మోసుకుని ఆసుపత్రులకు పోవాల్సి వస్తుంది. దోమల మందులు, దోమ తెరలు పంచినట్లు ప్రభుత్వాలు ఆర్భాటంగా ప్రకటిస్తూ వస్తున్నా, అవి అందిన సందర్భాలు తక్కువే. వర్షం వచ్చిందంటే చాలు కలరా, మలేరియా, టైఫాయిడ్, డయేరియా వంటి వ్యాధులన్నీ ఎఒబి గ్రామాలను చుట్టు ముడతాయి. పేదరికంతో సరైన తిండి లేకపోవడం వల్ల రక్తహీనత బారిన పడుతున్న

---

చంపుతున్నారని వస్తున్న ఆరోపణల మాటేమిటి అని అడిగితే, "పోలీసులు ఎప్పుడు కాల్పులు జరిపినా ఆత్మరక్షణ కోసం మాత్రమే" అన్నాడు. ఇంకా వివరిస్తూ, "వాళ్లు పైకి చూడడానికి గ్రామస్తుల్లా కనిపించవచ్చు. కాని నిజం చెప్పాలంటే వాళ్లు పీపుల్స్ లిబరేషన్ ఆర్మీ అనే ముసుగు సంస్థ సభ్యులు. ఒక మనిషి బజార్‌లో ఉన్నప్పుడు గ్రామస్తుడే. కాని పోలీసులు అతణ్ని వెంబడించగానే, బర్మార్ తీసి కాల్పులు మొదలు పెడతాడు."

కల్లూరి ఆదివాసులను ఒకరి మీదికి మరొకరిని రెచ్చగొడుతున్నాడని మానవహక్కుల కార్యకర్తలు ఆరోపిస్తారు. "వాళ్లు గ్రామస్తులను వాడుకుంటున్నారు. మేం గ్రామస్తులు తమ యుద్ధం తాము చేయడానికి అవసరమైన సహాయం చేస్తున్నాం. మీరు ఇటువైపున్నారా, అటు వైపున్నారా అని మేం గ్రామస్తులను అడుగుతాం" అన్నాడాయన.

తాను చాల మానవీయమైన వ్యక్తినని ఒప్పించడానికి కల్లూరి ప్రయత్నిస్తాడు. ఇటీవలనే ఆయన మాజీ మావోయిస్టుల పెళ్లిళ్లు జరిపించాడు. "సెక్స్ ఒక శారీరక అవసరం. మీరు గనుక జనజీవన స్రవంతిలో చేరితే, మీ ఇష్టం వచ్చిన వాళ్లను పెళ్లి చేసుకోవడానికి కూడ మేం సహాయపడతాం. అవసరమైన ఖర్చులు ఇస్తాం అని వాళ్లకు చెపుతాం. నిజంగా వాళ్ల పెళ్లిళ్లు బ్రహ్మాండంగా చేస్తాం" అన్నాడాయన. "ఒకవేళ ఎవరి పెళ్లి అయినా ఇబ్బందుల్లో పడితే, వాళ్ల మధ్య సయోధ్య కుదర్చడానికి మొట్టమొదట ప్రయత్నించేవాణ్ని నేనే. దీంట్లో ఎంతో ప్రేమ, కష్టపడి పనిచేయడం ఉన్నాయి" అన్నాడు.

ఇక ఆయన హెలికాప్టర్ ఎక్కడానికి సమయం అవుతోంది. ఆయనతోపాటు ఎస్పీ దాశ్, అగ్ని సభ్యులు కూడ వెళ్తున్నారు. జగదల్ పూర్ నుంచి 72 కిమీ దూరంలోని బూర్గుంలో గ్రామస్తులను కలవడానికి వెళ్తున్నారు. "మేం ఇక్కడ ఒక చరిత్ర వదిలి వెళ్లాలనుకుంటున్నాం. రెండు సంవత్సరాల్లో బస్తర్ స్వర్గంగా మారిపోతుంది" అన్నాడాయన.

స్వర్గంలో సంగీత ధ్వనులు నాకిప్పుడే వినిపిస్తున్నాయి.

*http://www.telegraphindia.com* వీ

ఆదివాసుల సంఖ్య వేలల్లో ఉంటుంది. పైగా మల్టినేషనల్ ఫార్మా కంపెనీలు తయారుచేసే మందులు, సూది మందుల పనితీరు ప్రయోగాలు కూడా ఈ ఆదివాసుల మీదే జరుగుతూ, అవి వికటించి ఆదివాసులు మరణిస్తూ ఉంటారు. వారికి ఎలాంటి నష్ట పరిహారాలు అందవు.

మారుమూల ప్రాంతాలలో ప్రభుత్వ రంగంలో పాఠశాలలు ఉన్నా వాటికి తగినంత మంది ఉపాధ్యాయులను ఇవ్వరు. బడి మొత్తానికి ఒకరో ఇద్దరో టీచర్లుంటారు. చదువు సరిగ్గా సాగని కారణంగా పిల్లలు చిన్న వయసులోనే కాఫీ తోటల్లోకి, మైన్లలోకి కూలీలుగా వెళ్లే పరిస్థితి ఏర్పడుతున్నది. తద్వారా ఆదివాసి ప్రాంతాలు తీవ్ర పేదరికం బారిన పడుతున్నాయి. ఈ ప్రాంతాలలో వలసలు చాలా ఎక్కువగా ఉంటాయి. విజయనగరం, శ్రీకాకుళం, దక్షిణ ఒడిశాలలో వ్యవసాయ కూలీలు వలస పోతుండగా, విశాఖపట్నం జిల్లాలో మత్స్యకారులు వలస పోతున్నారు. విశాఖపట్నం మొదలు సుందర్‌గఢ్ దాకా కోస్తా ప్రాంతం పొడుగునా మొదలై లోపలికి ఆదివాసి ప్రాంతాల దాకా ప్రజలు నిరు పేదలుగా బతుకులీడుస్తున్నారు.

బెజింగి బూటకపు ఎన్‌కౌంటర్ సందర్భంలో ఇదంతా ఎందుకు చెప్పడమంటే స్వాతంత్ర్యం వచ్చి డెబ్భై ఏళ్లు కావస్తున్నా ఇప్పటికీ కనీస అవసరాలు తీరని స్థితిలో ఆదివాసులుంటే గత కొంత కాలంగా వాళ్లను పట్టించుకుని, వాళ్లతో పాటే జీవనం సాగిస్తూ మావోయిస్టు పార్టీ వాళ్ల కొన్ని అవసరాలనైనా తీర్చడానికి ప్రయత్నం చేసింది. మారుమూల ప్రాంతాలలో చిన్న స్థాయిల్లో నైనా వైద్యం, విద్య వంటివి నిర్వహించింది. కూలిరేట్లు పెరిగేలాగా ఉద్యమాలు చేయమని ఆదివాసులను చైతన్య పరిచింది. అటవీ శాఖ అధికారుల దౌర్జన్యాలపై వాళ్లను తిరగబడేలాగా చేసింది. జల్-జంగల్-జమీన్‌లపై పూర్తి హక్కులు ప్రజలకే ఉంటాయనే చైతన్యాన్ని నింపి, ఉన్న ఊరిని వదిలిపెట్టకుండా వలసలను తగ్గించి వేసింది. అయితే తాము చేయాల్సిన పనులు చేయక పోగా ఆ బాధ్యతలను మావోయిస్టు పార్టీ నిర్వహిస్తుండడాన్ని తమ వైఫల్యంగా ఎక్కడ ఒప్పుకోవాల్సి వస్తుందోననే భయంతో పాటు, ఆదివాసులంతా ఐక్యంగా తమకు వ్యతిరేకంగా పోరాటాలు చేస్తుండడంతో ప్రభుత్వాలు ఆదివాసులపై యుద్ధాలు ప్రకటించాయి. వాళ్ల పోరాటాలపై అణిచివేతను ప్రయోగిస్తూ వచ్చాయి.

విశాఖపట్నం, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాల ఉత్తరాంధ్రలో కువ్వి, పోర్జ, పెంగిపోర్జ, పోరంగిపోర్జ, నూకదొర, ఇండదొర, వాల్మీక, బడియా, భగత వంటి ఆదివాసి జాతులు నివసిస్తున్నాయి. ఉసిరి, తేనె, అడ్డాకు, చింతపండు, జిగురు, కొండ చీపుర్లు వంటి ఉత్పత్తులను అడవి నుంచి సేకరించి, సంతలో అమ్మి నిత్యావసర వస్తువులు కొనుక్కుని జీవనం సాగిస్తారు. కొన్ని సార్లు జొన్నలు, చిక్కుళ్లు, సామలు, అలుపలు, కొండ కందులు వంటివి పండించిననూ, అటవీ ఉత్పత్తులపైనే ప్రధానంగా ఆధారపడతారు. వాళ్లది చాలా చిన్న ప్రపంచం. కానీ విశాల మనస్తత్వం. గొప్ప సంస్కృతీ సాంప్రదాయాలు వారి సొంతం. అడవే వాళ్ల జీవితం. అలాంటి అడవిని నమ్ముకున్న ప్రజలకు ప్రభుత్వాలు ఈ రోజు నిలువ నీడ లేకుండా చేసే ప్రయత్నాలు చేస్తున్నాయి. భారీ ప్రాజెక్టుల కోసం, బాక్సైట్ కోసం దేశీయ, విదేశీయ కంపెనీలకు ఖనిజాలతో కూడిన భూములను దారాదత్తం చేయడం కోసం ప్రభుత్వాలు ఆదివాసులను నిర్వాసితులను చేయాలనుకుంటున్నాయి.

1998 లోనే చంద్రబాబు నాయుడు బాక్సైట్ తవ్వకం కోసం ప్రయత్నాలు ప్రారంభించాడు. ఆనాటి నుంచి ప్రజలు ఆ ప్రయత్నాలు అడ్డుకుంటూ వస్తున్నారు. రాజశేఖర్‌రెడ్డి అధికారంలోకి వచ్చాక విశాఖ మన్యంలోని మొత్తం ఖనిజాల భూములను జిందాల్, రస్-అల్-ఖైమా (అన్‌రాక్) లకు తొమ్మిది వేల కోట్ల రూపాయలకు అమ్మివేసిన తరువాత కూడా అక్కడి ఆదివాసులు ఆ కంపెనీలను, వాటికి వత్తాసుగా నిలిచిన ప్రభుత్వాలను, ప్రభుత్వ యంత్రాంగాలను అడ్డుకుంటునే వచ్చారు. నిరంతరం కూంబింగ్‌లతో వాకపల్లి, భల్లుగూడ, కిండింగిల్లోలాగా అత్యాచారాలు చేసి, సామూహిక గ్రామాల దహనాలు, గృహ దహనాలు, పంటల విధ్వంసాలు చేసినా, ఇండ్లలోంచి తీసుకుపోయి కాల్చి చంపినా ప్రజలు భయపడలేదు. పోరాటాలు ఆపలేదు. కాఫీ కూలి రేట్లు పెంచుకుని కాఫీ తోటలను స్వాధీన పరుచుకునే స్థాయికి చేరుకున్న పోరాటాలు మొదలుకొని ఈ రోజటి బాక్సైట్ వ్యతిరేక పోరాటం దాకా ఆదివాసులు అనేక బాధలు పడుతూనే వీరోచిత పోరాటాలు చేస్తూ వచ్చారు.

2014లో చంద్రబాబు నాయుడు అధికారంలోకి వచ్చాక ఒకవైపు మొదటి దశ బాక్సైట్ తవ్వకాన్ని విశాఖ మన్యంలోని జెర్రెల బ్లాక్‌లో ప్రారంభిస్తూనే మరోవైపు మూడవ దశ ఆపరేషన్ గ్రీన్‌హంట్‌ను నవీన్‌పట్నాయక్‌తో కలిసి తీవ్రతరం చేస్తూ వచ్చాడు. గ్రేహౌండ్స్, బిఎస్ఎఫ్, సిఆర్‌పిఎఫ్‌లను మోహరించి, యుద్ధ రంగంగా మన్యాన్ని మార్చేశాడు. తన ఐదేళ్ల పాలనలో టార్గెట్స్‌గా పెట్టుకున్న కోస్టల్ కారిడార్, థర్మల్ ప్రాజెక్ట్స్, పోలవరం ప్రాజెక్ట్, రాజధాని నిర్మాణాలకు అవసరమైన భూసేకరణ కోసం ఆదివాసులను ఊర్లు ఖాళీ చేయించే పనిని ప్రారంభించాడు. అందుకోసం వాళ్లపై హింసాకాండకు పూనుకున్నాడు. ఉత్తరాంధ్ర జిల్లాలో రక్తపుటేర్లు పారిస్తున్నాడు.

నిజానికి రాష్ట్రంగా ఒడిశా 1936లో ఏర్పడి వేరైననూ, అంతకు వందల ఏళ్ల ముందు నుంచే దానికి ఉత్తరాంధ్రతో సారూప్య సంబంధాలు ఉన్నాయి. పేదరికం, ఖనిజ సంపద, ఆదివాసులు, వాళ్ల సామాజిక సంబంధాలు, జీవన విధానాలు, సాంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు వంటి అనేక అంశాలలో ఉత్తరాంధ్ర ప్రజలకు, ఒడిశా ప్రజలకు అందునా దక్షిణ, పడమటి ఒడిశాకు ఎంతో సాన్నిహిత్యం ఉన్నది. ఒడిశాలో ఈ దేశం గర్వించే స్థాయిలో ఖనిజ నిక్షేపాలున్నాయి. మొత్తం దేశం ఖనిజ సంపదలో 99 శాతం క్రోమేట్ ఓర్, 92 శాతం నికెల్ ఓర్, 65 శాతం గ్రాఫైట్, ఫైరో ఫైలైట్, 66 శాతం బాక్సైట్, 31 శాతం మినరల్ సాండ్, 32 శాతం మాంగనీస్, 28 శాతం ఐరన్ ఓర్, 24 శాతం బొగ్గు నిక్షేనాలున్నాయి.

ఇన్ని ఉనా దేశంలోని అతి పేద రాష్ట్రాలలో ఒడిశా ఒకటి. ఈ నిక్షేపాలున్న పశ్చిమ, దక్షిణ ఒడిశా ప్రాంతాలలో ఈ పేదరికం ఇంకా ఎక్కువగా ఉన్నది. ఖనిజాలున్న ప్రాంతాలేమో పేద స్థితిలో ఉంటే, ఆ ఖనిజాల గనులను అమ్ముకున్న ప్రభుత్వాల పెద్దలు, కొని తవ్వుకుని, శుద్ధిచేసుకుని మరీ దోచుకుపోతున్న వాళ్లు మాత్రం వేలాది, లక్షలాది కోట్ల రూపాయలు సంపాదించుకుంటున్నారు. దాదాపు ఇరవై ఏళ్ల పైబడిగా జిందాల్, టాటా, ఎస్సార్, మిట్టల్, బిర్లా, వేదాంత తదితర కంపెనీలు ఒడిశాలో ఖనిజాల అక్రమ తవ్వకాలు జరుపుతున్నాయి. ఈ కంపెనీల కింద ఉన్న మైన్లకు చాలావాటికి మైనింగ్ అండ్ మినరల్ డెవలప్‌మెంట్ రెగ్యులేషన్ చట్ట ప్రకారం అనుమతులు లేవు. కొన్నింటికి

ఉన్నా మైనింగ్ లీజును రెన్యువల్ చేసుకున్నది లేదు. ఇట్లాంటి అక్రమ తప్వకాలకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పూర్తిగా మద్దతునిస్తున్నాయి. ఇది ఇలాగే కొనసాగితే మరో 40 - 50 సంవత్సరాలలో ఒడిశాలో చాలా మట్టుకు ఖనిజ నిల్వలు హరించుకు పోయే పరిస్థితి ఉంది.

ఈ మైనింగ్ జరుగుతున్న ప్రాంతాలన్నీ ఆదివాసులు నివసించే ప్రాంతాలు. వేదాంత కంపెనీ దోచుకో దలచుకున్న నియంగిరి కొండల్లోనైతే అరుదైన డోంగ్రియా కోండ్ జాతి ఆదివాసులు ఉండడం, వేదాంత మీద వాళ్లు చేసిన పోరాటాలు చూసే ఉన్నాం. అట్లాంటివే అనేక ఆదివాసి జాతులు ఈ మైనింగ్ చేయదలచుకున్న ప్రాంతాలలో ఎన్నో సంవత్సరాలుగా జీవిస్తున్నాయి. మైనింగ్ సజావుగా సాగాలంటే ఇలాంటి ఆదివాసి జాతులను ఆ ప్రాంతాలలో నిర్వాసితులను చేయడం కంపెనీలకు, ప్రభుత్వాలకు తప్పనిసరి అవసరం. ఆదివాసులు అనాగరికులు, పైసలేని వాళ్లు, బయటి ప్రపంచం తెలియని వాళ్లు, ఎదిరించే ధైర్యం లేనివాళ్లు అనుకుని వాళ్లను సులభంగా ఖాళీ చేయించవచ్చునని భావించిన ప్రభుత్వాలు, మైనింగ్ కంపెనీలతో వందల కొద్దీ ఎంఒయులు చేసుకున్నాయి. వాటికి వేలాది ఎకరాల భూములు కేటాయించాయి. తవ్వకాలకు అనుమతులిచ్చాయి. చవకగా యంత్రాలు కొనేందుకు అప్పులిప్పించాయి. గిరిజన చట్టాల గురించి, హక్కుల గురించి చదువుకోని నిరక్షరాస్యులైన గిరిజనులకు, ఆదివాసులకు అవగాహన ఉండదనే నిర్లక్ష్యంతో, అతి విశ్వాసంతో ప్రభుత్వాలు వాళ్లకున్న అన్ని రాజ్యాంగ పరమైన రక్షణలను అణిచివేస్తూ వచ్చాయి. కానీ ప్రభుత్వాల ఆలోచనలను తలకిందులు చేస్తూ ఆదివాసులు మైనింగ్ మీద పోరాటాలు ప్రారంభించారు.

ఆదివాసులు మైనింగ్‌ను వ్యతిరేకించడంలో రెండు కారణాలున్నాయి. మొదటిది - తాము ఏళ్ల తరబడి నివసిస్తూ ఉన్న గూడేలను, వ్యవసాయాన్ని, జీవన విధానాలను, ఆచార వ్యవహారాలను కంపెనీల మైనింగ్ కోసం పోగొట్టుకోవడమనేది. ఈ ఆలోచన వాళ్లకు స్వతహాగా ఏర్పడింది. ఎవరో చెప్పింది కాదు. తమ ప్రాథమిక అస్తిత్వానికే ప్రమాదం వాటిల్లుతున్నప్పుడు ఏ మనిషైనా పోరాటానికి దిగకుండా ఎలా ఉంటాడు? అట్లాంటి పోరాటం తప్పెట్లా అవుతుంది? రాజ్యం గానీ, రాజ్యం తరపున మాట్లాడే వాళ్లు గానీ, లేదా ఇంకెవరైనా గానీ ఆదివాసుల పోరాటం గురించి మాట్లాడేటప్పుడు పోరాటం విషయంలో తప్పొప్పులు చూడడం కంటే ముందు అసలు వాళ్లు ఆ పోరాటానికి ఎందుకు దిగారని ప్రశ్నించుకోవాలి. ఒక ప్రజా సమూహపు అస్తిత్వాన్నే చంపేసే దిశగా ప్రభుత్వాలు ప్రయాణం చేస్తుంటే అట్లాంటి సమయంలో ప్రభుత్వం మీద ఆ ప్రజలు పోరాటం చేయడం కాకుండా ఇంకో ప్రత్యామ్నాయం ఏం ఉంటుంది? కనుక ఆదివాసుల పోరాటానికి మొదటి ప్రధాన కారణం వాళ్ల అస్తిత్వాలకే ముప్పు ఏర్పడడం.

ఇక రెండవ కారణం ఏమిటంటే తమ కాళ్లకింది వనరులను కాపాడుకుని ఈ రాష్ట్రానికి, దేశానికి, ముందు తరాలకు ఆ ఖనిజాలను అందించి ఇవ్వాలనేది. నిజానికి ఈ విశాల స్పృహ ఆదివాసులకు స్వత సిద్ధంగా కొంత వరకు ఉన్ననూ దాన్ని విస్తృతం చేసింది మావోయిస్టు పార్టీ. ఆదివాసులకు తాము నిర్వాసితులవుతారనే అస్తిత్వ కారణంతో పాటు ఈ దేశమంతా లూటీ అవుతున్నది కనుక దేశాన్ని కాపాడుకోవాలనే బాధ్యతను గురించి వివరించి ఆదివాసుల పోరాటాన్ని స్వంత పోరాటంగా కాకుండా, దేశం మీద ప్రేమతో చేసే పోరాటంగా మావోయిస్టు పార్టీ రూపాంతరం చెందించింది. ఇదేదో ఇళ్లు పోతున్న, భూములు పోతున్న కారణంగా జరుగుతున్న పోరాటం కాదని, దేశం మీద ప్రజలు బాధ్యతతో, హక్కుతో చేస్తున్న పోరాటమని గ్రహించాడు కనుకనే మన్మోహన్ సింగ్ దీన్ని ఇంటర్నల్ థ్రెట్ అన్నాడు. ఇల్లదుగు జాగా కోసమే జరిగే పోరాటం అయితే అంత పెద్ద పదం వాడి ఉండేవాడు కాదు. కనుక ఆదివాసుల పోరాటం వాళ్లకోసం మాత్రమే జరుగుతున్నది కాదు, ఈ దేశం కోసం జరుగుతున్న పోరాటం. దేశభక్తి అంటే ఆవుల కోసం మనుషులను చంపడం, దేవుని కోసం హత్యలు చేయడం అని మాత్రమే తెలిసిన మోడీకి కూడా ఆదివాసుల పోరాటం గురించి తెలుసు కాబట్టే ఆ పోరాటం ఎక్కడ తన దోపిడీ ప్రభుత్వపు అక్రమ సంపాదనలను నిలిపివేస్తుందోననే భయంతో ఇవ్వాళ దండకారణ్యం మొత్తాన మన్మోహన్ సాగించిన యుద్ధాన్ని తనూ కొనసాగిస్తూ తీవ్రం కూడా చేశాడు.

ఈ యుద్ధాన్ని ఆంధ్ర, ఒడిశాలలో అధికారికంగా ఆ రాష్ట్రాల పోలీసులు, కేంద్ర బలగాలు నిర్వహిస్తున్ననూ, అనధికారికంగా నడుపుతున్న వాళ్లు మైనింగ్ కంపెనీల గూండాలు, గంజాయి మాఫియా, కాఫీ మాఫియా, ప్రతి మైనింగ్ కంపెనీకి ప్రైవేట్ గూండాల బలగం ఉన్నది. మైదాన ప్రాంతాల ప్రజలనైతే వాళ్లు తమ గూండా గిరితో దౌర్జన్యంతో లోబరుచుకుంటుంటారు. అటవీ ప్రాంతాలలో ఆదివాసులు, మావోయిస్టులు కలిసి వాళ్ల మైనింగ్‌ను నిలువరిస్తున్నారు కనుక మావోయిస్టుల మీద ఉన్న భయంతో ఒంటరిగా కాకుండా పోలీసుల సహాయంతో, ప్రభుత్వంలోని ప్రజా ప్రతినిధుల సహాయంతో ఆదివాసులపై దాడులకు దిగుతున్నారు. భూసేకరణ సమయంలో ఊర్లమీద పడి వీళ్లే ప్రజలను ఖాళీ చేయిస్తారు. ఆదివాసులను కొట్టడం, హింసించడం, సంతలలో గొడవలు సృష్టించడం వంటివి చేస్తారు. వీళ్లతో పాటూ పోలీసులూ కలిసి దగ్గరుండి మరీ దాడులు చేయిస్తుంటారు. అయితే ఈ విషయంలో కంపెనీలకు వాటికుండే భయం వాటికుంది. అందుకే ఆదివాసులు, వాళ్ల తరపున మావోయిస్టులు కూడా ప్రతీకార దాడులు చేస్తారనే భయంతో మైనింగ్ కంపెనీల యాజమాన్యాలు ఒక నిర్ణీత సమయంలో గూండాల బ్యాచ్‌లను మారుస్తుంటారు. ఈ మైనింగ్ యజమానులకు నేరుగా ప్రధాన మంత్రితో, ముఖ్యమంత్రులతో మాట్లాడే సంబంధాలు, సాన్నిహిత్యాలు ఉంటాయి కనుక చాలాసార్లు తమ గూండాలకు పోలీసు రక్షణ, పోలీసుల మద్దతు, ప్రజా ప్రతినిధుల మద్దతు ఉండేలాగా చూస్తూ, వాళ్లను ఆదివాసుల మీదకు వదులుతుంటారు. ఇట్లా కంపెనీల ప్రైవేట్ అరాచక గూండాలు ఆదివాసులను రాజ్య ప్రేరేపిత యుద్ధంలో భాగంగా తీవ్ర హింసలకు గురిచేస్తున్నారు.

అట్లాగే మన్యం పొడుగునా, దక్షిణ ఒడిశాలో చాలా వరకు గంజాయి వ్యాపారం సాగుతున్నది. అక్కడ అది కోట్లాది రూపాయల వ్యాపారం. ఈ వ్యాపారం ఆ ప్రాంతాలలో పార్టీలను పోషిస్తూ, ఎన్నికల ఖర్చును కూడా భరించేంత పెద్ద ఎత్తున నడుస్తుంది. అట్లాంటి గంజాయి మాఫియాపై మావోయిస్టు పార్టీ సహాయంతో ఆదివాసులు తిరగబడ్డారు. గంజాయి తోటలను చాలా చోట్లా ధ్వంసం చేస్తూ వచ్చారు. దాంతో వ్యాపారానికి కోట్లల్లో నష్టం వచ్చేది. కొన్ని ప్రాంతాలలోనైతే గంజాయి నాటలేని పరిస్థితి ఏర్పడింది. విదేశాలకు కూడా పంపే సరకు కాబట్టి నష్టాన్ని పూడ్చుకునేందుకు గంజాయి మాఫియా పోలీసులతో,

ప్రభుత్వంతో చేతులు కలిపి ఆదివాసులపై చేస్తున్న యుద్ధంలో భాగమైంది. గంజాయిని గుర్తించి కేసులు నమోదు చేయాల్సిన పోలీసులనే రక్షణగా ఉంచుకుని ఆదివాసి గ్రామాలలో ఆ మాఫియా వాళ్లు గంజాయి పెంపకం సాగించారు. విచిత్రంగా ఆదివాసులు ఒక మంచి పనిగా ఆ తోటలను ధ్వంసం చేస్తే, వాళ్లపై కేసులు పెట్టించారు. గంజాయి వ్యాపారం కోసం ఆదివాసులతో రాజీ చేయించడానికి గంజాయి దళారుల తరపున చర్చలకు వచ్చే మండల, జిల్లా రాజకీయ నాయకులెవ్వరూ, ఆదివాసుల మీద పెట్టిన ఈ అక్రమ కేసులను తీసివేయించేందుకు వచ్చేవాళ్లు కాదు. అంటే అధికారులు, రాజకీయాలు, ప్రభుత్వాలు, మాఫియా అంతా కలగలిసిపోయిన వ్యవస్థ ఒకవైపైతే ఆదివాసులు, వాళ్లతో కలిసి బతుకుతున్న మావోయిస్టు పార్టీ మరోవైపు వ్యవస్థగా ఎఒబిలో యుద్ధం జరుగుతూ వస్తున్నది.

గిరిజనులు స్వాధీనం చేసుకున్న కాఫీ తోటలపై తరచు దాడి చేసే పోలీసులతో పాటు ఆ కాఫి తోటలపై నిరంతర నిఘా పెట్టిన ప్రైవేట్ మాఫియా కూడా కాఫితోటలపై దాడులు చేసి పంటను నాశనం చేయడం, ఆదివాసులను తరిమి కొట్టడం వంటివి చేస్తూ వస్తున్నది. ఎఒబి యుద్ధంలో వాళ్లు కూడా భాగస్థులైనారు. మొత్తంగా మైనింగ్ గూండాలు, గంజాయి మాఫియా, కాఫి మాఫియాలు ప్రభుత్వం ప్రజలపై చేస్తున్న యుద్ధంలో అనధికారిక భాగస్వాములై పోయారు.

వీళ్లందరితో పాటు ప్రభుత్వాలకు ఈ యుద్ధం విషయంలో ఉన్న అవగాహన ఏమిటంటే ఆదివాసి ప్రాంతాలలో నుంచి మావోయిస్టు పార్టీని ఖాళీ చేయిస్తే ఆ తర్వాత సులభంగా ఆదివాసుల భూములను లక్కోవచ్చును. మావోయిస్టుల మద్దతు లేకుండా ఆదివాసులకు బలం ఉండదు గనుక మొదట వాళ్లను లేకుండా చేయాలి. ఈ ఆలోచనతోనే యుద్ధం ప్రభుత్వానికి, మావోయిస్టులకు మధ్య జరుగుతున్నదనే భ్రమల్లో ప్రభుత్వం వైపు వాళ్లు ఉంటారు. కానీ యుద్ధాన్ని ప్రజలు చేస్తుంటే మావోయిస్టులు మద్దతిస్తున్నారని అనుకోరు. ఆదివాసులను, మావోయిస్టులను వేరుచేసి చూసే తప్పుడు ఆలోచనలలోంచే ఇది ప్రజా యుద్ధమే అని అంగీకరించని, ప్రజలు తమ కోసం, ఈ దేశం కోసం చేస్తున్న యుద్ధమని అంగీకరించని మానసిక దౌర్బల్యం పుట్టుకు వచ్చింది. మావోయిస్టులు, ఆదివాసులు కలిసిపోయిన సత్యాన్ని గుర్తించకపోవడం వాళ్ల అజ్ఞానం.

అయితే మావోయిస్టులు వ్యక్తులుగా ఆదివాసి సమాజాల్లో కలిసిపోయిననూ, ఆదివాసులు మావోయిస్టుల ప్రత్యామ్నాయ అభివృద్ధి ఆచరణలో మమేకమైనను మావోయిస్టులకు వ్యవస్థాపరంగా ఒక రాజకీయ నిర్మాణం ఉన్నది. పార్టీ ఉన్నది. ఒకవేళ ఈ కోణంలో గనుక ప్రభుత్వం మావోయిస్టు పార్టీని, ఆదివాసులను వేర్వేరుగా చూస్తూ ఉన్ననూ అదికూడా సరైన విభజన కాబోదు.

ఈ సందర్భానికే పరిమితమై ప్రభుత్వాల ఆలోచన ప్రకారమే మావోయిస్టు పార్టీ, ఆదివాసులు వేర్వేరు అని కాసేపు అనుకున్నా కూడా ప్రభుత్వాలు తెలుసుకోవాల్సింది ఏమిటంటే మావోయిస్టులను ఖాళీ చేయిస్తే యుద్ధం ముగిసిపోదు. ఎందుకంటే పోరాటాన్ని ప్రజలు నిర్ణయిస్తారు కానీ, పార్టీ కాదు. ప్రజల అంగీకారం లేకుండా పార్టీ ఏకపక్షంగా పోరాటం చేయదు. ఒకవేళ చేసినా ప్రజల నిర్ణయం, మద్దతు లేకుండా ఆ పోరాటం నిలవదు.

మావోయిస్టు పార్టీ కానీ, అంతకు ముందరి పీపుల్స్‌వార్ గానీ లేనప్పుడే మాచ్‌ఖండ్ జల విద్యుత్ ప్రాజెక్టు, హీరాకుడ్ ప్రాజెక్టులకు వ్యతిరేకంగా ఇదే ఒడిశాలో పోరాటాలు జరిగాయి. వాటన్నింటికీ ప్రజలే పంథాను నిర్ణయించుకున్నారు. ఆ పోరాట పంథాలో భాగంగా ఆ సందర్భానికి గాను ఒక నాయకుడో పార్టీనో తయారై ఆ నాయకత్వంలో పోరాటం ముందుకు నడుస్తుంది. కనుక ప్రభుత్వాలు అనుకుంటున్నట్లు మావోయిస్టు పార్టీ రెచ్చగొట్టి ఆదివాసులతో పోరాటాలు చేయించడం లేదు. రెచ్చగొట్టి చేయించే పోరాటాలు తొందర్లోనే విఫలమవుతాయి గాని పోస్కో, కళింగనగర్, నియంగిరిలలో లాగా ఉధృతంగా పోరాటాలు సాగుతాయా? లేదా ఈ దేశ ఆర్థిక సామాజిక వ్యవస్థకే ప్రత్యామ్నాయంగా నూతన వ్యవస్థను సృష్టించే దిశగా అడుగులు వేస్తాయా? కనుక దండకారణ్యంలో ప్రభుత్వాలపై ప్రజలు చేసే పోరాటాల్లో ఆ సందర్భానికి మావోయిస్టు పార్టీ ప్రజల అంగీకారం మేరకే పోరాటాన్ని ప్రజల నిర్ణయానుసారం నడిపే బాధ్యత తీసుకున్నది. ఆ క్రమంలోనే ఆదివాసులు నిర్ణయించుకుని చేసే పోరాటాలకు చైతన్యం కలిగిస్తూ, మద్దతునిస్తూ దండకారణ్యం మొత్తంలోనూ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజాపోరాటాలు నిర్వహిస్తున్నది. దండకారణ్య ఉద్యమం మూడున్నర దశాబ్దాలకు చేరిననూ ఈ చిన్న విషయాన్ని ప్రభుత్వాలు గుర్తించలేక పోతున్నాయి. అందుకే సరైన జ్ఞానం లేని అపరిపక్వ మానసిక స్థితిలో మొదలైతే మావోయిస్టు పార్టీని నిర్మూలిద్దాం అనుకుంటున్నారు.

ఈ ఆలోచనలో భాగంగానే రమణ్‌సింగ్, నవీన్ పట్నాయక్, చంద్రబాబు నాయుడులతో కలిసి నరేంద్రమోడీ ప్రజలపై మంద్రస్థాయి యుద్ధాన్ని చేస్తున్నాడు. ఈ ఎల్‌ఐసి యుద్ధాన్ని సమర్థవంతంగా చేసి 2016 ముగిసే నాటికి మావోయిస్టు పార్టీని మొత్తంగా నిర్మూలించి తూర్పు, మధ్య భారతాలలోని ఖనిజ నిల్వలను బహుళజాతి కంపెనీలకు అప్పగించాలనే మిషన్ – 2016 కార్యక్రమాన్ని అమలు చేస్తున్నాడు. ఇందులో భాగంగానే మోడీని ప్రసన్నం చేసుకునే ఆతృతలో చంద్రబాబు, నవీన్ పట్నాయక్‌లు కలిసికట్టుగా ఎఒబిలో ఈ హత్యాకాండను సృష్టించారు. గ్రేహౌండ్స్, సిఆర్‌పిఎఫ్‌లను నెలల తరబడి అడవుల్లో గాలింపులు చేయించి నిరాయుధంగా పట్టుబడ్డవాళ్లను చిత్రహింసలు పెట్టించి, అత్యాచారాలు చేయించి, అవయవాలు కోయించి అతి దారుణంగా చంపించారు. ఎదురు కాల్పులుగా, ఎన్‌కౌంటర్‌గా చెపుతున్నదంతా పచ్చి బూటకం.

ఈ మారణకాండపై సుప్రీంకోర్టు జడ్జితో జ్యుడీషియల్ విచారణ చేయించాలనేది ప్రభుత్వాన్ని చేసే డిమాండ్ అయినా ప్రజలందరినీ కోరేదేమిటంటే ప్రభుత్వాలు ప్రణాళిక బద్ధంగా చేస్తున్న అమాయక ఆదివాసుల హత్యల సమయంలో మౌనం వహించడం అత్యంత ప్రమాదకరం. ఈ మౌనం ఇలాగే కొనసాగితే రేపటి పోరాటాలు మందగమనంతో సాగుతాయి. రాజ్యం మానసికంగా శక్తివంతమై పోతుంది. ఆ శక్తి అబద్ధపు ప్రచారాలను ఇంకా ఎక్కువ చేసి ప్రజల మనోస్థైర్యాన్ని మరింత దెబ్బతీస్తాయి. అయితే ఎన్ని ఎదురుదెబ్బలు ఎదురైనా చరిత్రలో ఉద్యమాలు, పోరాటాలు ఆగలేదు. రెట్టించిన బాధ్యతతో ప్రజలు మరింతగా తిరుగుబాట్లు చేస్తూనే ఉన్నారు. చరిత్రలను తిరగరాస్తూనే ఉన్నారు.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

# శ్వేత సౌధంలో ట్రంప్ - ఆసక్తి, ఆందోళన

***అమెరికా అధ్యక్ష ఎన్నికల్లో జాతి వివక్షను రెచ్చగొట్టి, వలసలను వ్యతిరేకిస్తూ అధికారంలోకి వచ్చిన రియల్ ఎస్టేట్ వ్యాపారి ట్రంప్ పాలన ప్రపంచానికి గడ్డురోజులను తేవచ్చునని అంటున్నారు ఎ. నర్సింహా రెడ్డి***

ప్రపంచానికి ఇష్టమున్నా లేకపోయినా అగ్రరాజ్యం అమెరికా 45వ అధ్యక్షుడిగా రిపబ్లికన్ పార్టీ అభ్యర్థి డోనాల్డ్ జాన్ ట్రంప్ అనూహ్యంగ ఎన్నిక కావడం ఒక రాజకీయ సునామీ. సర్వేలన్నింటిని తలకిందులు చేశాడు. మెజారిటీ కార్పొరేట్ మీడియా డెమోక్రటిక్ పార్టీ అభ్యర్థి హిల్లరీ క్లింటన్‌కు అనుకూలంగా ఉండడం, ఈ అనుకూల మీడియా గొంతు, అది సృష్టించే ప్రభావం ఎక్కువ కావడంతో హిల్లరీ గెలవడం ఖాయమన్న వాతావరణం నెలకొంది. ప్రజాస్వామ్యం గురించి ప్రపంచానికి పాఠాలు చెప్పే అమెరికాలో ట్రంప్ వెదజల్లిన విద్వేష, విభజన భావాలకు లభించిన ఆదరణే ఆశ్చర్యం, ఆందోళనకరం కూడా! అమెరికన్ సమాజాన్ని చీల్చడంలో, అమెరికాలో అంతర్లీనంగా ఉన్న భయాలు, అనుమానాలు, ద్వేషాలను ట్రంప్ మరింతగా ఎగదోసినందుకు ఫలితం దక్కింది. అమెరికాలో ఇంతవరకు మహిళ అధ్యక్షులు కాలేదు కనుక మహిళలంతా అభిమానంతో, హిల్లరీ అధ్యక్షులు కావాలన్న ఆకాంక్ష కలుగలేదు. అందివచ్చిన అవకాశాన్ని వినియోగించుకొని హిల్లరీకి కట్టకట్టుకొని మహిళలు ఓటు వేయలేదు.

అసత్యాలు, అర్ధసత్యాలతో కలగలిసిన ప్రసంగాలనూ, అమెరికాను ఏ పాలకుడూ ఉద్ధరించలేదన్న విమర్శలనూ మెచ్చి అమెరికన్ జాతీయవాదంతో ఊగిపోతున్న యువశక్తి అంతా ట్రంప్‌కు జేజేలు పలికారు. సరిహద్దులు దాటిపోయిన ఉద్యోగాలను తిరిగిరప్పించి, సరిహద్దులను మూసేస్తానన్న ప్రమాణాలు, ఎగదోసిన జాతివివక్షలు, జాతీయవాదాలూ శ్వేతజాతి శ్రామికవర్గాన్ని, మధ్యతరగతిని బలంగా కదలించాయి. ట్రంప్ విజయం 'నాజీ-జర్మనీ' ఎన్నికలను తలపిస్తోంది. ఆనాడు యూదుల పట్ల విద్వేషం జర్మనీ రాజకీయాలను ప్రభావితం చేయగా, నేడు అమెరికా రాజకీయాల్ని వలసలు అదే విధమైన ప్రభావాన్ని వేసింది. ట్రంప్ గెలుపుతో 1932 నాటి జర్మనీలోని 'వెయిమర్ రిపబ్లిక్' వంటి పరిస్థితిలోకి అమెరికా ప్రవేశించింది. జర్మనీలో వెయిమర్ రిపబ్లిక్‌తో పాటు ప్రజాస్వామ్యం పతనమయి హిట్లర్ నేతృత్వంలో నరహంతక ఫాసిజం ఆవిర్భవించింది. ఆ ఫాసిజమే ప్రపంచాన్ని మొత్తంగా యుద్ధంలోకి దించింది. ఇప్పుడు డోనాల్డ్ ట్రంప్ అమెరికా అధ్యక్షుడయ్యాడు. దీంతో మొత్తం ప్రపంచానికి ఉండే పర్యవసానాల గురించి చరిత్రను అర్థం చేసుకున్న అమెరికన్లతోపాటు, ప్రపంచ ప్రజలందరూ ఆందోళన చెందుతున్నారు.

18 నెలల క్రితమే రాజకీయాల్లో ప్రవేశించి, రిపబ్లికన్ పార్టీ అభ్యర్థిత్వం కొరకు ప్రైమరీల్లో తలపడి అభ్యర్థిత్వాన్ని దక్కించుకోవడమే చిత్రం. రెండో వైపున డెమొక్రటిక్ పార్టీ అభ్యర్థిత్వం కొరకు మాజీ విదేశాంగ మంత్రి హిల్లరీ క్లింటన్ కార్మిక నాయకుడు బెర్నీ శాండర్స్ నుంచి గట్టి పోటీ ఎదుర్కొని పార్టీ అభ్యర్థిగా నామినేట్ కావడం తెలిసిందే. ఎన్నికల ప్రచారం హోరెత్తింది. అమెరికా చరిత్రలో ఎన్నడూ లేనంతగా ప్రచారం దిగజారింది. ఒపీనియన్ పోల్స్, ఎగ్జిట్ పోల్స్, కాబోయే అధ్యక్షురాలు హిల్లరీ క్లింటన్‌యేనని కొండెక్కి కూసాయి. కాగా ట్రంప్ నోటి దురుసు వ్యాఖ్యలతో పత్రికలను, పలువురు రిపబ్లికన్ పార్టీ అగ్రనాయకులను, ముస్లింలను పలు విదేశీ మూలాలుగల అమెరికన్‌లను దూరం చేసుకున్నాడు. మత్తు పదార్థాలు, వలస కార్మికుల అక్రమ రవాణాను అరికట్టేందుకు మెక్సికో సరిహద్దుపై గోడ కడతానన్నాడు. ఉద్యోగాల ఔట్ సోర్సింగ్‌ను అరికట్టి అమెరికన్‌లకు ఉద్యోగాలి స్తానన్నాడు. అమెరికాలో నిరుద్యోగం పెరగడానికి, వృద్ధి తగ్గడానికి భారత్, చైనా వంటి దేశాల నుండి వస్తున్న యువతను కారణంగా చూపాడు. చైనా కరెన్సీ దూకుడును విమర్శించాడు.

టెర్రరిజాన్ని నిరోధించేందుకై ముస్లింలు అమెరికాలో అడుగు పెట్టకుండా చేస్తానన్నాడు. అక్రమంగా వలస కార్మికులు ప్రవేశించడం వల్ల కింది స్థాయి అమెరికన్‌లకు పనులు దొరకడంలేదని, అక్రమ ఇమ్మిగ్రెంట్స్‌ను వెనక్కు పంపుతానన్నాడు. నల్లజాతివారు, ఇతర వలస ప్రజల వల్ల శ్వేత జాతీయులు ప్రాభవం కోల్పోతున్నారన్నాడు. ఇక ఆడవారిపై చేసిన అసభ్యపు వ్యాఖ్యలు రోతపుట్టించేవిగా ఉన్నాయి. వాణిజ్య ఒప్పందాలను (నాఫ్తా, టిపిపి), ఇతర దేశాలతో సంబంధాలను పూచిక పుల్లలా తీసిపారేస్తూ, స్వేచ్ఛ వాణిజ్యాన్ని తిరస్కరించాడు. ఇవన్నీ అమెరికన్ విలువలకు భిన్నమైన వాదనలు. ట్రంప్ అమెరికా విలువల్ని మంట గలుపుతున్నాడని, అతనికి ఏ మాత్రం రాజకీయ అనుభవం లేనందున అధ్యక్షుడిగా ఎన్నికయ్యే అర్హతలేదని, ఎన్నికైతే దేశ ప్రతిష్టను మంటగలుపుతాడని హిల్లరీ తీవ్రంగా ప్రచారం చేసింది. అధ్యక్షుడు ఒబామా గొంతు కలిపాడు. ప్రధాన మీడియా ట్రంప్‌కు వ్యతిరేకంగా ప్రచారం చేసింది. అయినా ట్రంప్‌కు అనూహ్య మెజారిటీ ఎలా లభించిందనేది లోతుగా విశ్లేషించాల్సిన అంశం.

ఎన్నికల ప్రచారం సందర్భంలో ట్రంప్ నల్లవారికి, తెల్లవారికి మధ్య అంతరాన్ని పెంచారు. మతపరమైన వివాదాస్పద వ్యాఖ్యలూ చేశాడు. పెట్టుబడిదారీ వ్యవస్థలో భాగంగా ఉత్పన్నమయిన ఆర్థిక సంక్షోభాన్ని తనకు అనుకూలంగా మలుచుకున్నారు. పెట్టుబడిదారీ వ్యవస్థ ఏ రూపంలో ఉన్నా, అది ప్రజల జీవితాలలో అభివృద్ధిని, సౌభాగ్యాన్ని తీసుకురాలేదన్నది రుజువైన సత్యం. కాగా ఈ పెట్టుబడిదారీ విధానపు సంక్షోభం (2008) తిరోగమన, ప్రతిఘాతక, ఫాసిస్టు విధానాలకు దారీ తీస్తుందనేది అంతే సత్యం. గత ఎనిమిది సంవత్సరాలుగా ప్రపంచ దేశాలలో జరుగుతున్న ఘటనలు పరిశీలిస్తే, ప్రతీఘాతుకత్వం పాదుకుంటూ, ప్రపంచవ్యాపితంగా విస్తరిస్తోందని పరిణామాలు సూచిస్తున్నాయి. పెట్టుబడిదారీ విధానంలో అత్యంత సహజంగా, అనూచానంగా...... కొనసాగే తప్పుడు ఆర్థిక విధానాల అమలు వలన, రెండున్నర దశాబ్దాల సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాల అమలు తర్వాత పాదార్థిక, మేధోపర, నైతిక విలువలు మరింతగా పతనం అయ్యాయి.

ఈ నేపథ్యంలో అభివృద్ధిచెందిన, అభివృద్ధిచెందుతున్న దేశాలలో ఈ ప్రపంచీకరణ విధానాలు ప్రతీఘాత శక్తులను పునరుద్ధరించడంతోపాటు, అత్యంత మితవాద రాజకీయ పార్టీల ఎదుగుదలకు, ప్రపంచంలో సంపూర్ణంగా తిరస్కరణకు గురైన, భయంగొలిపే ఫాసిస్టు శక్తుల పెరుగుదలకు కారణమయ్యాయి. ప్రపంచవ్యాప్తంగా తలెత్తుతున్న ప్రతీఘాత శక్తులు, అంతర్జాతీయ మానవత్వ ఆదర్శాలకు అత్యంత హానికరంగా పరిణమించాయి. అమెరికాయే సారథ్యం వహించి ప్రపంచంపై రుద్దిన ప్రపంచీకరణ విధానాలు అన్ని దేశాల్లాగే అమెరికాను సైతం పీల్చి పిప్పి చేశాయి. సంపద కేంద్రీకరణను పెంచి మెజారిటీ ప్రజానీకాన్ని అభద్రతలో పడేశాయి. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాలు తమ భవిష్యత్తుకు ఏమి పూచి పడవన్న నిస్పృహ ఆవరించి ఉన్న స్థితిలో అర్థం పర్థం లేని వాదనలు, ఆచరణ సాధ్యంకాని హామీలు ఎటువంటివైనా సామాన్య ప్రజలకు సాంత్వన కలిగిస్తాయి. ఈ నేపథ్యంలో మితవాద ట్రంప్ గెలుపును చూడాలి. ప్రపంచంలో క్షీణిస్తున్న ప్రాభల్యాన్ని గుర్తుచేస్తూ గ్రేట్ అమెరికాను సృష్టిస్తానంటూ రెచ్చగొట్టారు. ఇవన్నీ అమెరికన్ ఓటర్లలో ముఖ్యంగా తెల్లవారిలోనూ, ధనవంతుల్లోనూ ఆయనకు అనుకూల ప్రభంజనాన్ని సృష్టించాయి. ఎన్నికల ప్రచారంలో ఆయన అహంభావ వ్యాఖ్యలనూ, అసహ్యకరమైన మాటలనూ ఓటర్లు పట్టించుకోలేదు. అమెరికాకు మహత్తర యోగం పట్టించే శక్తిగానే ఆయన్ను పరిగణించారు.

హిల్లరీ ప్రచారంలో ఒక ప్రత్యామ్నాయ విధానాన్ని ప్రజల ముందు ఉంచలేక పోవడం, విధానపరమైన అంశాలు లేవనెత్తక పోవడం, వ్యక్తిగత అంశాలకే పరిమితం కావడం కూడా ట్రంప్‌కు కలిసి వచ్చింది. పైగా గత ప్రభుత్వాల్లో కూడా భాగస్వామి అయిన హిల్లరీని ప్రస్తుత అమెరికా సమస్యలకు కారకురాలిగా కూడా ఓటర్లు పరిగణించారు. గత ఎనిమిది సంవత్సరాల కాలంలో ఒబామా ప్రభుత్వం ప్రజలను సంతృప్తిపరచలేక పోయింది. ఒబామా పాలనలో శ్రామికుల కంటే ధనికులకే లబ్ధి చేకూరింది. అధిక శాతం సామాన్యుల జీవన ప్రమాణాలు పడిపోయాయి. అలాగే విదేశాల్లో యుద్ధాలు ముగియలేదు. ఆర్థిక మహామాంద్యం నుంచి దేశం గట్టెక్కలేదు. కిందిస్థాయి సగటు అమెరికన్ల జీవితం దుర్భరమైంది. శ్వేతజాతి ఆధిక్యత, ఔట్ సోర్సింగ్ కోత, ఇమ్మిగ్రెంట్స్‌ను వెనక్కి పంపడం వల్ల స్థానికులకు ఉద్యోగాలు, టెర్రరిజం అణిచివేత లాంటి ట్రంప్ వాగ్దానాలు ఓటర్లను ఆకర్షించాయి. అంటే ప్రజల మనస్సుల్లో గూడుకట్టుకున్న కొన్ని సందేహాలు, భయాలను ట్రంప్ తనకు అనుకూలంగా మలచుకున్నాడు. ట్రంప్ ఎన్నిక అమెరికన్ విలువలకే కాదు, ప్రపంచానికే ప్రమాదం అనేంత దూరం వ్యతిరేక ప్రచారం జరిగినా మెజారిటీ అమెరికన్‌లు అతన్నే అధ్యక్షుడిగా కోరుకున్నారు.

ట్రంప్ తన ఎన్నికల ప్రచార సరళిలోనూ, ఆచరణ, నడవడిలోనూ దుందుడుకు స్వభావాన్నే కనబర్చాయి. మైనారిటీలు, మహిళలు, విదేశీ ఉద్యోగుల పట్ల చిన్నచూపు ప్రదర్శించి, తన విజయావకాశాలకు సందేహాలను సృష్టించుకొన్నప్పటికీ తమ దేశంలోని ఉద్యోగాలను విదేశీయులు తన్నుకు పోతున్నారని, తాను విజయం సాధిస్తే తరలిపోయిన ఉద్యోగాలను తిరిగి తీసుకువస్తానని తెల్లజాతి యువతలో మనోభావాలను రెచ్చగొట్టడం, దేశానికి పూర్వవైభవం తీసుకొస్తానని నమ్మబలకడం ద్వారా తన విజయానికి మార్గాన్ని సుగమం చేసుకున్నారు. అమెరికా భౌగోళిక రాజకీయ విధానాలను వ్యతిరేకిస్తూ ఐఎస్ఐఎస్ (ఇస్లామిక్ స్టేట్ ఆఫ్ ఇరాక్ అండ్ సిరియా), లాటిన్ అమెరికన్లు, ముస్లింల వలసలపై అమెరికన్లలో నెలకొన్న భయాందోళనలు, అనేక ఇతర సమస్యలను అందిపుచ్చుకొని ప్రస్తుత ప్రభుత్వంపై ఉన్న వ్యతిరేక పవనాలను తనకనుకూలంగా మలచుకొని ట్రంప్ విజయం సాధించారు.

ఇదంతా ఇప్పుడు గతం! అమెరికా అధ్యక్షుడిగా ట్రంప్ ఎటువంటి విధానాలను అవలంభిస్తారు? మిగిలిన ప్రపంచంపై వాటి ప్రభావం ఏమిటి? భారత్ పట్ల ఆయన వైఖరి ఎలా ఉంటుందన్నదే ప్రస్తుతం ఆసక్తికరంగా మారిన అంశం. ట్రంప్ ప్రచారంతో పాటు, ఆయన వ్యక్తిగత వ్యవహార శైలిని దగ్గర నుండి పరిశీలించిన వారు చెబుతున్న దాని ప్రకారం అధ్యక్షుడిగానూ ట్రంప్ దూకుడుగా వ్యవహరించే అవకాశాలే ఎక్కువ! ఇది అమెరికాతో పాటు, ప్రపంచ వ్యాప్తంగా మితవాదం ప్రబలడానికి, విద్వేషాలు నెలకొనడానికి దోహదం చేయనుందన్న ఆందోళన వ్యక్తమవుతోంది. మెక్సికో–అమెరికా సరిహద్దు వెంట గోడ కడుతానంటే అమెరికేతర దేశాలు బాధపడుతుంటే, ఆ గోడ లోపల ఎంతటి నరకం అనుభవించవలసి వస్తుందోనని అమెరికాలోని ముస్లిం తదితర జాతులు వణికిపోతున్నాయి.

అమెరికాకు పూర్వ వైభవం తెచ్చే పేరిట సామ్రాజ్యవాద యుద్ధాలు, ఆంక్షలు ప్రపంచ దేశాలపై మరింతగా పెరిగే ప్రమాదం ఉంది. దీనర్థం హిల్లరీ గెలిస్తే ఇంతకన్నా భిన్నంగా ఉంటుందని కాదు. హిల్లరీ, ట్రంప్‌లలో గెలుపెవరిదైనా అంతిమంగా ఓడిపోయేది మాత్రం అమెరికన్ ప్రజలే అన్న వ్యాఖ్య సామాజిక మాధ్యమాల్లో విస్తృతంగా ప్రచారంలోకి వచ్చిన విషయాన్నీ విస్మరించలేం. ఇప్పుడు సిరియాకు ఏమి జరుగబోతున్నది? ఐఎస్ఐఎస్‌పై యుద్ధం? మునుపెన్నడూ లేని విధంగా రష్యాకు నిజమైన మిత్రుడిగా ట్రంప్ నిలుస్తాడా, ఒకవేళ అలా నిలిచినట్లయితే ఇతర దేశాలపై దాని ప్రభావం ఎలా ఉండబోతున్నది? మధ్యఆసియా దేశాలు ఏమి ఆశిస్తున్నాయి? చైనా, దాని మార్కెట్లు ఎలా ఉండబోతున్నాయి? అన్న అనేక ప్రశ్నలు తలెత్తుతున్నాయి.

ట్రంప్‌కు విజయం సాధించానన్న ఆనందం ఎంతో సేపు నిలవలేదు. ఆయన ఎన్నికయ్యారన్న వార్త వెలువడిన వెంటనే కాలిఫోర్నియాలో మొదలైన నిరసనలు ఇప్పుడు అమెరికా అంతటా విస్తరించాయి. వీరికి కాలేజీ విద్యార్థులు, మహిళలు, సోషల్ మీడియా నుంచి విశేషంగా మద్దతు లభిస్తుంది. దీంతో విద్యార్థుల పరీక్షలు వాయిదా వేశారు. 'ఫాసిస్టులకు అమెరికాలో చోటు లేదు', 'స్త్రీ ద్వేషి మాకొద్దు ప్రజలంతా ఐక్యంగానే ఉన్నాము, మమ్మల్ని ఎవరు విభజించలేరు'. నిరసన ప్రదర్శనలతో అమెరికాలోని పలు రాష్ట్రాలు దద్దరిల్లాయి. పలుచోట్ల ట్రంప్ దిష్టి బొమ్మలను తగులబెట్టారు. ట్రంప్ వ్యతిరేక నినాదాలతో హోరెత్తాయి. 'మా మధ్య చిచ్చు పెట్టొద్దు' ట్రంప్ మా అధ్యక్షుడు కాదు' అని రాసిన ప్లకార్డులను ప్రదర్శిస్తూ నిరసనకారులు ప్రధాన రహదారులపై ట్రాఫిక్‌ను స్తంభింప చేశారు. ట్రంప్ ఎన్నికను వెంటనే రద్దు చేయాలని, అధ్యక్ష ఎలక్టోరల్ కాలేజ్‌పై నిషేధం విధించాలని వారు డిమాండ్ చేస్తున్నారు. వాషింగ్టన్‌లో వైట్‌హౌస్ వద్ద జరిగిన నిరసన ప్రదర్శనలో నిరసనకారులు అమెరికా జాతీయపతాకాన్ని తలకిందులు చేసి ట్రంప్ ఎన్నికపై తమ ఆగ్రహాన్ని వ్యక్తం చేశారు.

భారత సంతతి ఓట్ల కోసం భారత్ అంటే తనకు ప్రత్యేక అభిమానమని ఆయన చెప్పినా, అధ్యక్షుని హోదాలో ఆయన భారత పట్ల అనుసరించబోయే ద్వైపాక్షిక సంబంధాల్లో ఎలాంటి మార్పులు వస్తాయనేది బిలియన్ డాలర్ల ప్రశ్న. ఎన్నికల ప్రచార కాలంలో ట్రంప్ చేసిన ప్రకటనలే ఇందుకు ప్రాతిపదిక. ముఖ్యంగా రెండు విషయాలు ప్రముఖంగా చర్చలోకి వచ్చాయి. అవి అమెరికా కంపెనీలు ఉద్యోగాలను ఔట్ సోర్సింగ్ ఇవ్వడాన్ని ఆయన గట్టిగా వ్యతిరేకించడం, రెండు ఇస్లామిక్

తీవ్రవాదం. భారతీయ ఐటి నిపుణులకు ఆయన ఉదారంగా హెచ్1బి వీసాలు ఇస్తారా అనే సందేహాలు కలుగుతున్నాయి. అదే జరిగినట్లయితే ఇన్ఫొసిస్, టిసిఎస్ వంటి భారతీయ సాఫ్ట్‌వేర్ దిగ్గజాలు చిక్కుల్లో పడే ప్రమాదం ఉంది. ఎందుకంటే, భారతదేశ ఐటి సాఫ్ట్‌వేర్, బిపిఒ సర్వీసుల్లో 80 శాతం అమెరికాతో జరుగుతున్నాయి. ట్రంప్ గనుక తన విధానాన్ని కచ్చితంగా అమలు చేస్తే మన దేశ ఐటి సాఫ్ట్‌వేర్ ఎగుమతులపై తీవ్ర ప్రభావం చూపుతుంది.

ట్రంప్ ఎన్నికల ప్రచారంలో ముస్లింలకు, టెర్రరిజానికి, ముఖ్యంగా పాకిస్తాన్‌కు వ్యతిరేకంగా తీసుకున్న వైఖరి సీమాంతర ఇస్లామిక్ తీవ్రవాదానికి వ్యతిరేక పోరాటంలో ఉపకరిస్తుందని భారత ప్రభుత్వం భావిస్తున్నది. మరోవైపు ఆసియాలో ఆధిపత్యం కొరకు యత్నిస్తున్న చైనాను అదుపులో ఉంచడం అమెరికా లక్ష్యాల్లో ఒకటి, అందుకు భారత్‌ను ఉపయోగించుకోవడం దాని ముఖ్యోద్దేశం. ఒబామా ప్రకటించిన 'ఆసియా పివోట్' లక్ష్యాన్నే ట్రంప్ కొనసాగిస్తాడని భారత ప్రభుత్వం భావిస్తున్నది. పాకిస్తాన్ 'అత్యంత ప్రమాదకర దేశం' అని ట్రంప్ చేసిన ప్రకటన మన పాలకుల చెవులకు శ్రావ్యమైన సంగీతం లాంటిది. భారత్‌తో సంబంధాల విషయంలో ఎటువంటి మార్పు ఉండదని అమెరికన్ రాయబార కార్యాలయం ఇప్పటికే ప్రకటించిన నేపథ్యంలో మనదేశం నుండి ఉద్యోగాల కోసం అక్కడికి వెళ్తున్న యువకుల పట్ల ట్రంప్ ప్రభుత్వ వైఖరి ఎలా ఉంటుందన్నది వేచి చూడాల్సి ఉంది.

స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలకు, ప్రజాస్వామ్యంలో ప్రగాఢ విశ్వాసముందని చెప్పుకుంటున్న అమెరికాలో ఆఫ్రో- అమెరికన్లపై జాత్యహంకార దాడులు పెచ్చుమీరాయి. ఒక ఆఫ్రో అమెరికన్‌గా చెప్పుకుంటున్న వ్యక్తే దేశాధినేతగా ఉన్న కాలంలోనే ఆఫ్రో - అమెరికన్లపై క్రూరమైన దాడులు పెరిగాయి. రిపబ్లికన్ పార్టీకి చెందిన అధ్యక్ష అభ్యర్థి డొనాల్డ్ ట్రంప్ శ్వేతజాతి ఓటర్ల నుండి మద్దతును కూడగట్టగలిగాడు. అతని అసహనపు మితవాద పిడివాదానికి ఆశ్చర్యకరమైనంత భూమిక లభించింది. హిస్పానిక్కులను, నల్లజాతివారిని, చైనీయులు వంటి విదేశాల నుండి వచ్చినవారిని ఎంచుకొని అతను దాడిచేశాడు. వలసవచ్చిన వారిపై, మహిళలపై, మైనారిటీలపై అతను అత్యంత ఛాందసవాద, అభివృద్ధి నిరోధక, యుద్ధోన్మాద వ్యాఖ్యానాలు చేశాడు. అమెరికాలో నూతన మధ్యతరగతి అతని చుట్టూతా సమీకృతమయింది. మరోవైపున, డెమోక్రటిక్ పార్టీకి చెందిన అధ్యక్ష అభ్యర్థి హిల్లరీ క్లింటన్ కూడా సాధారణ అమెరికా ప్రజలను, వారి ఆకాంక్షలను దిగజార్చిన, నిరాశకు గురిచేసిన వ్యవస్థలపట్ల తను ఏ రకంగానూ వ్యతిరేకంగా ఉండబోనని ట్రంప్‌కన్నా మెరుగైనదానను కాననీ తనకు తాను నిరూపించుకుంది.

ట్రంప్ మితవాద అభిప్రాయాలు, ప్రవర్తన దృష్ట్యా మునుపెన్నడూ లేని విధంగా ప్రపంచానికి అమెరికా ఇప్పుడు ఒక సమస్యాత్మకమైనదిగా మారబోతోంది. అధ్యక్షుడిగా ఎన్నిక కావడానికి ముందు అమెరికా రాజకీయాల ప్రతి నిబంధనను సవాల్ చేసిన ట్రంప్ అమెరికాకు పూర్వవైభవాన్ని తీసుకువస్తారా? అంటే వేచి చూడాలి. విశ్లేషకులకు అంతుచిక్కని ప్రశ్నగా నిలిచింది. అమెరికా అధ్యక్షుడిగా ఎవరు గెలిచారన్నది సమస్యకాదు. ఎవరు గెలిచినా ఆ దేశ ప్రయోజనాలే వారికి ముఖ్యం. అంతర్జాతీయ ఒప్పందాలకు, నీతి నియమాలకు కట్టుబడే అలవాటు అమెరికాకు లేదు. విదేశాలకు ఆయుధాలు విక్రయించి, పలుప్రాంతాల్లో యుద్ధ వాతావరణాన్ని సృష్టించి, తద్వారా సొమ్ము చేసుకోవడమే వారి ధ్యేయం. అమెరికా, యూరప్ మొదలుకొని వివిధ దేశాలలో కార్పొరేట్ సంస్థల ప్రయోజనాలకు పెద్దపీట వేయడం వల్ల పేదలు ఆగ్రహంతో ఉన్నారు. ప్రజాస్వామ్య రాజ్యాలలో రాజకీయ వ్యవస్థ ప్రజల విశ్వసనీయతను కోల్పోతున్నది. ఇది చాలా ప్రమాదకరమైన ధోరణి. విధానకర్తలు ప్రజా సంక్షేమ విధానాలు అమలు చేయకపోతే, ప్రజాస్వామ్య వ్యవస్థల మనుగడ ప్రశ్నార్థకమవుతుంది. సంకుచిత, దుందుడుకు, ఉన్మాద ధోరణుల పట్ల ప్రజలు ఆకర్షితులయ్యే ప్రమాదం అన్ని దేశాలలో పొంచి ఉన్నది.

రిపబ్లికన్లు అమెరికా అధ్యక్ష ఎన్నికల్లో గెలిచి వైట్‌హౌస్‌లో ప్రవేశించారు. 2017 జనవరి 20న ట్రంప్ అధ్యక్ష బాధ్యతలు స్వీకరిస్తారు. అయితే ఇది ఆహ్లాదకరమైన, ఆనందమైన పూలపాన్పు లాంటిది కాదు. ట్రంప్ విభిన్నమైన వ్యక్తిత్వం గల మనిషి తాను నమ్మిన, అనుకున్న విషయాల పట్ల సడలని పట్టుదలతో పనిచేసే దుందుడుకు వ్యవహార శైలి గలవాడు. తెల్లజాతి ఔన్నత్యాన్ని, గొప్పతనాన్ని ఒంట బట్టించుకుని శ్వేతజాతి జాతీయవాదాన్ని విశ్వసిస్తున్నవాడు. ఇంకా అతను వలస వ్యతిరేకతను, ముస్లిం వ్యతిరేకతను, నల్లజాతి వ్యతిరేకతను ప్రధాన స్రవంతి రాజకీయాల్లోకి నిర్భయంగా తెచ్చినవాడు. ఎవరెన్ని విధాల విమర్శించినా, అనుయాయులే దూరం జరిగినా తాను నమ్మిన దాన్ని ఆచరిస్తూ ముందుకు పోగల మొండి ఘటం. ఇలాంటి వ్యక్తిత్వం, వ్యవహార సరళి ఉన్న ట్రంప్ నేతృత్వంలో అమెరికా ఎలా ఉండబోతున్నది. ప్రపంచంలో ఎలాంటి పరిణామాలు సంభవించ బోతున్నాయన్నది మిలియన్ డాలర్ల ప్రశ్న.

శ్వేత సౌధంలోకి చేరిన ఏ అధ్యక్షునికైనా ప్రపంచంలో ఎక్కడైనా అమెరికా ప్రయోజనాలే ముఖ్యం. ప్రాథమికంగా వ్యాపారవేత్త తప్ప రాజకీయ వేత్త కానందున అతని విధానాలు ఎలా ఉంటాయో ప్రపంచానికి తెలియదు. నాటో రాజ్యాలు సైతం సంశయాత్మకంగా చూస్తున్నాయి. అందువల్ల ఆయన పొడిపొడి ప్రకటనలను అమెరికా భవిష్యత్ విధానంగా చూడడం తొందరపాటవుతుంది. ట్రంప్ టీం సంపూర్ణంగా బాధ్యతలు స్వీకరించిన అనంతరం వెలువడే విధాన ప్రకటనల కోసం వేచి చూడాల్సిందే. మొత్తం మీద ప్రపంచ దేశాలకు రానున్నవి గడ్డు రోజులే అన్న అభిప్రాయం విశ్లేషకులు వ్యక్తం చేస్తున్నారు. విజయం అనంతరం చేసిన మొదటి ప్రసంగంలో తాను అమెరికన్ల కందరికీ అధ్యక్షుడిగా ఉంటానని ట్రంప్ చెప్పారు. ఈ మాటను ఎలా నిలబెట్టుకుంటారో వేచి చూడాల్సిందే!

ప్రపంచంలోనే అతిపెద్ద ఆర్థిక, సైనిక శక్తిగా ఉన్న అమెరికా ఇక ట్రంప్‌లాంటి అసహనం నెత్తికెక్కిన వారి పాలనలో ఏమవుతుందో, ప్రపంచాన్ని ఎంతటి ప్రమాదంలోకి నెట్టివేస్తుందో కాలమే నిర్ణయించాలి. అమెరికా పాలక వర్గాలు ముఖ్యంగా అమెరికా ద్రవ్య సంస్థల యజమానులు ట్రంప్‌ను అధ్యక్షునిగా కొనసాగనిస్తారా? ఎవరికి అనుగుణంగా ఎవరు మారుతారు? మారకపోతే సంఘర్షణ ఏరూపం తీసుకుంటుంది? ఈ సందేహాలకు సమాధానాల కొరకు వేచి చూడాల్సి ఉంది. ఒక కార్పొరేట్ సంస్థను నడపడానికీ, ప్రభుత్వాన్ని నడపడానికీ తేడా ఉన్నట్టుగానే, ఎన్నికల ప్రచారానికీ, పాలనకూ తేడా ఉంటుంది. అమెరికాను దాని అధ్యక్షుడు మాత్రమే పరిపాలించడనీ, బహుళజాతి కంపెనీలు, బడా కార్పొరేట్లు, సైన్యమూ ఏలుతాయన్నది యదార్థమే అయినప్పటికీ, ట్రంప్ అధ్యక్ష ప్రభావం తేలికగా తీసిపారేయలేనిది. మిగతా ప్రపంచం పట్లా, అమెరికన్ సమాజంలోనూ ఆయన సృష్టించిన విద్వేషాలు అంత సులభంగా మాసిపోయేవి కావు. ఈ విభేధాలను చల్లార్చి ప్రజలను ఐక్యం చేయడం ట్రంప్ ముందున్న పెను సవాలు.

*(రచయిత ఉపాధ్యాయ నాయకులు, రాజనీతి శాస్త్ర విద్యార్థి)* వీ

# రాజ్యమే నిరసనకు పూనుకుంటే...!

*పాలకులు దేశ ప్రజలకు ఉపయోగపడాల్సిన వనరులను బహుళజాతి, పెట్టుబడిదారీ సంస్థలకు కట్టబెడుతున్నారనీ, ఆదివాసుల హక్కుల కోసం పోరాడుతున్న ఉద్యమకారులపై బలవంతంగా ఆదివాసులనే ఉసిగొల్పుతున్నారనీ అంటున్నారు* **ఎం.కె. కుమార్**

మధ్య భారతంలో పెరుగుతున్న రాజ్యహింసకు వ్యతిరేకంగా ప్రజాస్వామిక ఉద్యమాలు పెల్లుబుకుతున్నాయి. ఈ ఉద్యమాలకు సంఘీభావం తెలుపుతున్న మేధావులపై, ప్రజాస్వామిక వాదులపై రాజ్యం వివిధ రూపాల్లో నిర్బంధాన్ని అమలు చేస్తోంది. సామ్రాజ్యవాద యుగంలో పెట్టుబడిదారులే ఉద్యమాలను తయారు చేస్తారు. అదే విధంగా భారతదేశంలోను రాజ్యమే ప్రజా వ్యతిరేక ఉద్యమాలను పోలీసుల నాయకత్వంలో, అట్టడుగువర్గాల ప్రజలతో నిర్మిస్తోంది. ముఖ్యంగా ఛత్తీస్‌గడ్‌లో పారామిలటరీ బలగాలు ప్రతిరోజు విధ్వంసాన్ని సృష్టిస్తున్నాయి. ముఖ్యంగా బస్తర్ ప్రాంతంలో రాజ్యహింస కొత్త రూపాలను తీసుకుంటోంది.

అక్టోబర్ 24న బెజింగ్ అటవీ ప్రాంతంలో జరిగిన ఎన్‌కౌంటర్‌లోను అన్యాయంగా పోలీసులు 9 మంది ఆదివాసీలను చంపినట్టు అక్కడి గ్రామస్తులు ఆరోపించారు. పోలీసులు చేసిన ఏకపక్ష కాల్పుల ఆనవాళ్లను కానరాకుండా 12 మంది మావోయిస్టుల, ఆదివాసీ శవాలను పోలీసులే దహనం చేశారు. వీటిని వ్యతిరేకిస్తూ ప్రజాసంఘాలు, హక్కుల సంఘాలు నిజనిర్ధారణలు జరిపి వాస్తవాలను బహిర్గత పరిచారు.

నిజనిర్ధారణ కమిటీలు వెళ్లిన ప్రతిచోట మావోయిస్టుల చేతుల్లో చనిపోయిన పోలీసుల, ఆదివాసీల కుటుంబాలతో కూడిన బృందాలు మావోయిస్టులకు వ్యతిరేకంగా నిరసన ప్రదర్శనలను, ధర్నాలను నిర్వహించాయి. మావోయిస్టులకు వ్యతిరేకంగా మాట్లాడడం నేరం కాకపోయినప్పటికీ, రాజ్యమే ఆ కార్యక్రమాన్ని భుజాన వేసుకోవడం ద్వారా కార్పొరేట్లకు నగ్నంగా సహకరించాలనుకుంటోంది.

సెప్టెంబర్ 25న బస్తర్ జిల్లాలోని బూరుగుం పోలీస్‌స్టేషన్ పరిధిలోని 8వ తరగతి చదువుతున్న బిజ్నూ, 9వ తరగతి చదువుతున్న సోన్‌కులను వారి బంధువుల ఇళ్లలోనే బూరుగుం ఠాణా పోలీసులు రాత్రి పట్టుకుని, తెల్లవారు జామున కాల్చి చంపారు. షరామామూలుగా ఈ హత్యలకు ఎన్‌కౌంటర్ కథ అల్లారు. దీనిపై జ్యుడిషియల్ విచారణను వేయాల్సిన ప్రభుత్వం, బూటకపు ఎన్‌కౌంటర్‌లో పాల్గొన్న పోలీసులకు రివార్డులు ప్రకటించడమే గాక, లక్ష రూపాయలు పారితోషికాన్ని ప్రకటించింది. ప్రోత్సాహకాలు ఇచ్చి బూటకపు ఎన్‌కౌంటర్లను పెంచి పోషిస్తోంది.

మిషన్ 2016 పేరుతో కొనసాగుతున్న గ్రీన్‌హంట్ ఆపరేషన్ మూడవ దశలో కౌంటర్ ఉద్యమాలను పోలీసులు ఒక ఎత్తుగడగా నడిపిస్తున్నారు. బస్తర్ జిల్లాలోని ప్రధాన పట్టణమైన జగదల్‌పూర్‌లోను పోలీసులు లల్‌కార్ ర్యాలీని నిర్వహించారు. దీనికి సాక్షాత్తు ఛత్తీస్‌గడ్ ఐజి కల్లూరి నాయకత్వం వహించారు. సామ్రాజ్యవాదులు తమ మార్కెట్ ప్రయోజనాల కోసం స్వచ్ఛంద సంస్థల ముసుగులో సంస్కరణ ఉద్యమాలకు శ్రీకారం చుదుతుంటారు. అదే పద్ధతిలో ఛత్తీస్‌గడ్‌లోను పోలీసులు అగ్ని అనే ఆదివాసీ హక్కుల వ్యతిరేక సంస్థను, బాక్సైట్ ఖనిజ నిక్షేపాలను తవ్వుకునే కార్పొరేట్ సంస్థల ప్రయోజనాలకు అనుగుణంగా ఏర్పర్చుకున్నారు. దీనివల్ల కార్పొరేట్-పోలీసుల మధ్య ఉన్న మైత్రి సంబంధాల బలం అర్థమవుతుంది. పోలీసులు రాజ్యాంగేతర శక్తిగా అవతరించడానికి అధికారవర్గం తన స్వప్రయోజనాల రీత్యా సహాయ పడుతోంది. పోలీసుల చట్టబాహ్య చర్యలను వ్యతిరేకిస్తున్న మేధావులను అక్రమకేసుల్లో ఇరికించి వారిని భౌతికంగా, మానసికంగా హింసిస్తున్నారు. గత దశాబ్ద కాలంలో ప్రభుత్వాలకు-కార్పొరేట్లకు మధ్య జరిగిన ఒప్పందాలను నెరవేర్చే బాధ్యతను పాలకవర్గాలు పూర్తిగా పోలీసుల చేతికి ఇచ్చేశాయి.

**మేధావులపై మానసిక యుద్ధం**

ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రజాస్వామికవాదులపై, మేధావులపై అప్రకటిత నిషేధం అమలవుతోంది. రాజ్యాన్ని ఎదిరించే విప్లవ సాయుధ సంస్థలపై కేంద్ర ప్రభుత్వం ఏకంగా యుద్ధమే చేస్తోంది. ఆ యుద్ధంలో సాధారణ ఆదివాసీలే 90 శాతం మరణిస్తున్నారు. బెజింగ్ ఎన్‌కౌంటర్ లోను 9 మంది ఆదివాసీలు పోలీసుల ఏకపక్ష కాల్పుల్లో మరణించారు. కేంద్ర ప్రభుత్వపు విధానాలను కేవలం ప్రశ్నించినందుకు, ప్రభుత్వ పరిపాలనలో హేతుబద్ధత, శాస్త్రీయత లోపించిందని ప్రచారం చేసినందుకు దబోల్కర్ పన్సారే, కల్బుర్గిలను కిరాయి ముఠాలు హత్య చేశాయి. ఈ హత్యల వెనుక అధికార పార్టీ ఉందని బలమైన ఆరోపణలు చేస్తూ దేశవ్యాప్త ఉద్యమమే చెలరేగింది. ప్రజాస్వామికవాదులపై అమలవుతున్న నిర్బంధంపై రచయితలు మేధో తిరుగుబాటును అమలు చేస్తున్నారు. అవార్డులు వాపసు ఇవ్వడం ఇందులో ఒకటి.

దళితులు, మహిళలు, వెనుకబడినవర్గాలు బహుముఖాలుగా రాజ్యహింసకు గురౌతున్నారు. ముఖ్యంగా మైనారిటీలను దేశద్రోహులుగా బిజెపి ప్రభుత్వం చిత్రీకరిస్తోంది. మైనారిటీలను జైళ్లో చంపలేరు కాబట్టి జైలు బయటికి తీసుకొచ్చి పాయింట్ బ్లాంక్ రేంజ్‌లో చంపుతున్నారు. ఆలేరు, భూపాల్ బూటకపు ఎన్‌కౌంటర్లు రాజ్యపు అనైతికచర్యకు ప్రత్యక్ష ఉదాహరణలు. మైనార్టీలలో అభద్రతా భావాన్ని మరింత పెంచడానికి వారిని ఉగ్రవాదులుగా చిత్రీకరిస్తున్నారు. ఉగ్రవాదులను చంపొచ్చనే సామాజిక ఆమోదాన్ని ఇప్పటికే పోలీసు వర్గాలు పొంది ఉన్నాయి. న్యాయం కోసం మాట్లాడడం దేశద్రోహం అవుతున్నది. మతోన్మాద ప్రభుత్వాలు ఫాసిజాన్ని అమలుపరుస్తూ ప్రజాస్వామ్యం గొంతు నొక్కు తున్నాయి. ఇది ప్రధానంగా మేధావులపై తీవ్ర ప్రభావాన్ని చూపుతోంది.

ఛత్తీస్‌గడ్‌లో 2005లో మహేంద్రకర్మ నాయకత్వంలో సల్వాజుడుం

అనే ప్రైవేటు సాయుధ ముఠా ఆదివాసీలను ఊచకోత కోసింది. దీనికి వ్యతిరేకంగా న్యాయస్థానాల్లో ఆదివాసుల జీవించే హక్కును కాపాడడం కోసం ప్రొఫెసర్లు నందినీ సుందర్, అర్చనా ప్రసాద్‌లు తీవ్రంగా ప్రయత్నం చేశారు. 2016 మే నెలలో నందినీ సుందర్, అర్చనా ప్రసాద్, వినీత్ తివారి, సంజయ్ పరాటేలతో పాటు మరికొందరు కలిసి బస్తర్‌లో జరుగుతున్న రాజ్యహింసపై నిజనిర్ధారణను జరిపారు. ఆ నివేదికను ప్రింట్, ఎలక్ట్రానిక్ మీడియాకు, ప్రజలకు బహిర్గతపరిచారు. ఛత్తీస్‌గడ్‌లో జరుగుతున్న బూటకపు ఎన్‌కౌంటర్లు, అత్యాచారాలు, అక్రమ అరెస్టులు, చిత్రహింసలు, సల్వాజుడుం కొత్తరూపంలో చేస్తున్న విధ్వంసం గురించి ఈ నివేదికలో పేర్కొన్నారు. బస్తర్‌లో జరుగుతున్న పోలీసు హింస వల్ల లక్షల సంఖ్యలో ఆదివాసీలు వలసబాట పడుతున్నారని నివేదికలో పేర్కొన్నారు.

ఈ వాస్తవాలు ప్రజలకు తెలియడం ఛత్తీస్‌గడ్ ప్రభుత్వానికి నచ్చలేదు. అందుకే ఢిల్లీ యూనివర్సిటీకి చెందిన సోషియాలజీ ప్రొఫెసర్ నందినీ సుందర్‌తో పాటు 8మందిపై ఛత్తీస్‌గడ్ ప్రభుత్వం అక్రమ కేసులు పెట్టింది. మేధావులను భయపెట్టడానికి రాజ్యం వారిపై మానసిక యుద్ధాన్ని ఒకవైపు చేస్తూనే, మరోవైపు జైళ్లకు పంపిస్తోంది. డా. బినాయక్ సేన్‌తో మొదలైన ఈ ప్రస్థానం ప్రొ. సాయిబాబా వరకు అప్రతిహతంగా కొనసాగుతోంది. ఛత్తీస్‌గడ్ ముఖ్యమంత్రి రమణ్‌సింగ్, డిజిపి ఎస్‌ఆర్‌పి కల్లూరిలు పన్నిన పథకంలో భాగంగానే ప్రొఫెసర్లపై అక్రమకేసులు పెట్టారు. ఈ కేసులో నందినీ సుందర్‌తో పాటు నిజనిర్ధారణలో పాల్గొన్న 8 మందిపై 120బి (కుట్రకేసు), 302 (హత్యాకేసు), 147,148, 149 కేసులు పెట్టారు. డిజిపి ఎస్‌ఆర్‌పి కల్లూరి వీరిని కఠినంగా శిక్షించడానికి తమ శాయశక్తులా ప్రయత్నిస్తామని ఉత్సాహంగా ప్రకటన కూడా చేశారు.

ఛత్తీస్‌గడ్ డిజిపి కల్లూరి వలన జర్నలిస్టులు, లాయర్లు, పరిశోధక విద్యార్థులు, రాజకీయ నాయకులు హక్కుల సంఘాల కార్యకర్తలు తీవ్ర నిర్బంధాలకు గురవుతున్నారు. వీళ్లందరూ ఛత్తీస్‌గడ్‌లో ఆదివాసీలపై జరుగుతున్న ఎన్‌కౌంటర్ హత్యలు, అత్యాచారాలను ప్రపంచానికి తెలియ జేయడం తమ వంతు బాధ్యతగా గుర్తించి కృషిచేస్తున్నారు. సోనీసోరి, జగ్‌లాగ్‌కు చెందిన లాయర్లు, మాలినీ సుబ్రమణ్యం లాంటి జర్నలిస్టులు ఛత్తీస్‌గడ్ పోలీసుల హింసను ఇప్పటికే చవిచూశారు. వారిపై పోలీసులే ప్రైవేట్ సాయుధ ముఠాలచే దాడులు జరిపించారు. ఛత్తీస్‌గడ్ నుండి వారిని తరిమివేయడానికి పోలీసులు శాయశక్తులా ప్రయత్నిస్తున్నారు.

ఛత్తీస్‌గడ్ రాష్ట్రంలో 2005 నుండి సల్వాజుడుం దాడుల్లో లక్షలాది ఆదివాసీలు విస్థాపనకు గురయ్యారు. వేలాదిగా హత్య చేయబడ్డారు. వందలాది గ్రామాలు కాల్చివేయబడ్డాయి. 2009లో ప్రారంభించబడ్డ ఆపరేషన్ గ్రీన్‌హంట్ లక్షలాది పారామిలటరీ బలగాలతో ఆదివాసీల జీవించే హక్కును, జీవనోపాధి హక్కును దారుణంగా అణచివేస్తున్నాయి. 2016 జూన్ 13న 200 మంది పారామిలిటరీ బలగాలు కుంట బ్లాక్‌లోని గోంపాడ్ గ్రామంపై దాడిచేసి మడ్‌కమ్ హిడ్‌మే అనే ఆదివాసీ మహిళను హత్య చేశారు. గ్రామ ప్రజలు, తల్లిదండ్రులు చూస్తుండగానే ఆమెను బలవంతంగా ఎత్తుకెళ్లి అత్యాచారం చేసి హత్య చేశారు. ఈ కేసు ఛత్తీస్‌గడ్ న్యాయస్థానంలో నేటికీ కొనసాగుతూనే ఉంది. ఛత్తీస్‌గడ్ రాష్ట్ర చరిత్రలోనే మొదటసారిగా హిడ్‌మేకు రీ-పోస్ట్‌మార్టమ్ జరిపారు. ఈ వాస్తవాలు బయటకు రావడం వెనుక నందినీ సుందర్, అర్చనా ప్రసాద్‌ల కృషి ఉంది.

ఇలా రాజ్యాంగం కల్పించిన హక్కులు అణచివేతకు గురవుతు న్నప్పుడు ప్రజాస్వామికవాదులు, మేధావులు గొంతు విప్పడం సహజంగా జరిగేదే. మాట్లాడే గొంతులను నొక్కడానికే, మేధావులపై ప్రభుత్వాలు అక్రమకేసులు బనాయిస్తున్నాయి. వీటికి వ్యతిరేకంగా బలమైన ఉద్యమాలు వచ్చినపుడే మేధావులపై నిర్బంధాన్ని ప్రభుత్వాలు సడలిస్తాయి.

**బస్తర్ ఐజి శివరామ్ ప్రసాద్ కల్లూరి రాజకీయ నిర్ణయాల అమలు**

కల్లూరి నాయకత్వంలో కృత్రిమ ఉద్యమాలు బస్తర్ ప్రాంతంలో ఎక్కువవుతున్నాయి. గత నెలలో కల్లూరి నాయకత్వంలో జరిగిన కౌంటర్ ర్యాలీలో స్వయానా పోలీసులే పాల్గొన్నారు. ర్యాలీలో నందినీ సుందర్, ఆదివాసీ కార్యకర్త మనీష్ కుంజమ్, సిపిఎం నాయకుడు హిమాంషు కుమార్, సామాజిక కార్యకర్త బేల బాటియా దిష్టిబొమ్మలను సైతం పోలీసులు తగలబెట్టారు. ఈ ర్యాలీలో కొంతమంది ఆదివాసీలు సైతం పాల్గొన్నారు. ప్లే కార్డులు పట్టుకున్న ఆదివాసీ యువత మావోయిస్టులకు వ్యతిరేకంగా నినాదాలిచ్చారు. పోలీసులు ఈ చాలెంజింగ్ ర్యాలీని తీయడానికి బలమైన కారణం ఉంది.

2011లో సుక్మా ప్రాంతంలోని మోర్‌పల్లి, తాడ్‌మెట్ల, టీమాపురం గ్రామాల్లో పోలీసులు విధ్వంసం సృష్టించి 200 ఇళ్లను తగలబెట్టారు. ఈ సంఘటనకు కల్లూరి నాయకత్వం వహించాడు. అప్పుడు ఆయన దంతేవాడ సీనియర్ ఎస్‌పిగా ఉన్నాడు. ఈ సంఘటనపై నందిని సుందర్ కోర్టుకు వెళ్లడమే గాక, పోలీసులకు వ్యతిరేకంగా బలమైన సాక్ష్యాధారాలను సమర్పించింది. దీనికి మిగిలిన నలుగురు మద్దతుగా నిలిచారు. అక్టోబర్ 17న గ్రామాల ను తగలబెట్టిన పోలీసులను శిక్షించాలని సిబిఐ నిర్ణయించడంతో పోలీసులకు కోపమొచ్చింది. నక్సలైట్లను పట్టుకునే టప్పుడు పోలీసుల ఆత్మరక్షణ కోసం ఏమైనా చేయవచ్చని, ఆ క్రమంలో నక్సలైట్లు చనిపోవడం సాధారణ విషయమని మీడియాకు చెప్పాడు. ఉద్యమ హింసను ఖండించడానికి రాని హక్కుల సంఘాలు, పోలీసు కాల్పుల్లో ఒక మావోయిస్టు మరణిస్తే, దేశం అతలాకుతలం అయినట్టు నానాయాగీ చేస్తారని ఆయన మండిపడ్డాడు. చట్టానికి అతీతంగా వ్యవహరించిన పోలీసులను శిక్షించాలని సిబిఐ నివేదిక ఇస్తే, దాన్ని ఖండిస్తూ ర్యాలీ తీసిన పోలీసులను అధికారవర్గం ఏమీ అనకపోవడం గమనించాల్సిన విషయం. పోలీసులు స్వేచ్ఛగా తమ యూనిఫాంలలోనే నిరసన ప్రదర్శనలో పాల్గొనడం ఇక్కడ కొసమెరుపు. ట్రాఫిక్‌ను సైతం తమకు అనుగుణంగా మళ్లించుకుని మరీ రాజ్యపు నిర్ణయానికి వ్యతిరేకంగా కదం తొక్కారు.

**ప్రజా ఉద్యమాలకు వ్యతిరేకంగా పోలీసు ఉద్యమాలు**

దేశంలోని ప్రముఖ విశ్వవిద్యాలయాల విద్యార్థులు (పరిశోధకులు) నిజనిర్ధారణ బృందం 6 రోజుల పాటు రామగూడ-బెజ్జింగి అటవీ ప్రాంతంలో అక్టోబర్ 24న జరిగిన ఎన్‌కౌంటర్‌పై నిజనిర్ధారణ జరిపింది. దేశంలోని 12 యూనివర్శిటీల నుంచి 26 మంది పరిశోధక విద్యార్థులు ఇందులో పాల్గొన్నారు. వీరిలో మావోయిస్టు రాజకీయాలను వ్యతిరేకించే వారు కూడా ఉన్నారు. వీరి నివేదికను నవంబర్ 15న మీడియాకు బహిర్గతం చేశారు. నిజనిర్ధారణలో పాల్గొన్న విద్యార్థులను పోలీసులు అన్ని రోజులూ వెంబడించారు. వివిధ రకాలుగా వేధించారు. పాడేరుకు వీరు వచ్చే రోజే కొంతమంది ఆదివాసీల చేత మావోయిస్టులకు

వ్యతిరేకంగా ర్యాలీ నిర్వహింపజేశారు. విశాఖ రూరల్ ఎస్పీ రాహుల్‌దేవ్ వర్మ వీరిని అడ్డగించి, సోదాలు నిర్వహించారు. అంతే కాకుండా డేవిడ్, నైనాల, సతీష్ కుటుంబాల దగ్గరకు పోలీసులు వెళ్లి, వారు నిజనిర్ధారణకు వెళ్లకుండా చేయాలని కుటుంబ సభ్యులను ఒత్తిడి చేశారు. నక్సలైట్ల చేతిలో పోలీసులు చనిపోయినపుడు మీరంతా ఎక్కడున్నారని విద్యార్థులను పోలీసులు నిలదీశారు.

నిజనిర్ధారణ కమిటీల పేర్లతో వచ్చేవారిని గిరిజన సంఘాల పేర్లతో పోలీసులే బెదిరింపులకు గురిచేస్తున్నారు. గిరిజనులను భయపెట్టడం ద్వారా, ప్రలోభాలకు గురిచేయం ద్వారా లొంగదీసుకుని, వారిని నిజనిర్ధారణకు వచ్చే కార్యకర్తలకు వ్యతిరేకంగా నడుచుకోవాలని పోలీసులు హుకుం జారీచేస్తున్నారు. ఈ క్రమంలోనే మారుపేర్లతో వరవరరావుకు వ్యతిరేకంగా ఆదివాసీ గ్రామాల్లో పోలీసులు పోస్టర్లను ముద్రించి కూడళ్లలో అంటించారు. ఎన్‌కౌంటర్లను సమర్థించు కోవడానికి, దానికి సామాజిక ఆమోదాన్ని పొందడానికి పోలీసులు రకరకాల ప్రయత్నాలు చేస్తున్నారు. ముఖ్యంగా రాజ్యహింసను ప్రశ్నిస్తున్న విప్లవ రచయితలపైన, హక్కుల సంఘాలపైన కత్తి కట్టారు. ఆదివాసీ విద్యార్థి సంఘాలు ఈ పోస్టర్లు వేసినట్టు పోలీసులే చెప్పడం కొసమెరుపు. బెజ్జంగి ఎన్‌కౌంటర్‌కు వ్యతిరేకంగా రెండు తెలుగు రాష్ట్రాలలో ఎక్కడా అభ్యుదయ వాదులు సమావేశమైనా ఆదివాసీ సంఘాల పేరుతో పోలీసులే మావోయిస్టులకు వ్యతిరేకంగా ప్లేకార్డులు పట్టుకుని ప్రదర్శనలిస్తున్నారు. తద్వారా మావోయిస్టులను ఆదివాసీలు వ్యతిరేకిస్తున్నారని, వారిని ఎన్‌కౌంటర్ చేసినప్పటికీ ఆదివాసీలు నోరు మెదపడం లేదనే తప్పుడు సంకేతాలను సమాజానికి ఇస్తున్నారు. అలాగే మావోయిస్టులు సంఘ వ్యతిరేక శక్తులనే ప్రచారాన్ని సోకాల్డ్ ఆదివాసీ సంఘాలచే చేయిస్తున్నారు.

ముఖ్యంగా బెజ్జంగి ఎన్‌కౌంటర్‌పై నిజనిర్ధారణ జరిపిన అన్ని కమిటీలు పోలీసుల తీరును తప్పు పట్టడమే గాకుండా, వారిపై హత్యా నేరం కింద కేసు నమోదు చేయాలని డిమాండ్ చేశాయి. తలనొప్పిగా మారిన ఈ తంతును పరిష్కరించుకోమని, అధికారికవర్గం పోలీసులనే పురమాయించింది. అందుకే పోలీసులే ఇప్పుడు కౌంటర్ ఉద్యమాలను నడుపుతున్నారు. ఆదివాసీ విద్యార్థి సంఘాల పేరుతో అటవీ ప్రాంత పరిసరాలలో పోస్టర్లు వేస్తున్నారు. మావోయిస్టుల పేరుతో పోలీసులే పత్రికలకు ప్రకటనలు ఇప్పిస్తున్నారు. మావోయిస్టుల పేరుతోనే ఇన్‌ఫార్మర్లను, పోలీసు అధికారులను చంపుతామని పోలీసులే పోస్టర్లు అతికియ్యడం నిజనిర్ధారణ బృందాల కంటపడింది.

సాయుధ పోరాట పంథాతో వ్యవస్థను మార్చవచ్చని నమ్మి ప్రాణాలిచ్చే వారి సంఖ్య గడిచిన కాలంలో పెరిగింది. పాలనా వ్యవస్థను చట్టం ప్రకారం నడుచుకోవాలని కోరడం తప్పయిపోతోంది. మెజారిటీ ప్రజల ఆకాంక్షలకు తగ్గట్టుగా పరిపాలన సాగిస్తున్నామని చెప్పే ప్రయత్నంలోనే, అధికారపార్టీ మావోయిస్టు పార్టీతో మెజారిటీ ప్రజలు లేరని చెప్పదలుచు కుంది. కౌంటర్ ఉద్యమాలను పోలీసుల ద్వారా ప్రవేశపెట్టింది. వ్యక్తిస్వేచ్ఛ – సమానత్వపు హక్కు మధ్య ఉన్న వైరుధ్యమే రాజ్యం–ప్రజల మధ్య ఘర్షణను రేపుతోంది. స్వేచ్ఛ, సమానత్వాలు అభద్రతలో పడిన ప్రతి చోట మిలిటెంట్ స్థాయి పోరాటాలు జరుగుతున్నాయి.

నిరాయుధ పోరాటాలను సైతం రాజ్యం ఉక్కుపాదంతో అణచి వేస్తోంది. జమ్ముకశ్మీర్, ఈశాన్య ప్రాంతాలలోని సైన్యం ప్రత్యేక అధికారా లతో లక్షల సంఖ్యల్లో ప్రజల్ని నిరాశ్రయులను చేస్తోంది. వనరులపై ఆధిపత్యం కోసం ప్రయత్నిస్తున్న కార్పొరేట్ శక్తులు గ్రామాలు, పట్టణాలు, అడవులు అనే తేడా లేకుండా రాజ్యం అండతో చట్టబద్ధంగా వనరులను లూటీ చేస్తున్నాయి. అడవులపై ఏకంగా అంతర్జాతీయ పెట్టుబడులే ఉక్కు పిడికిలి బిగిస్తున్నాయి. సమస్య పరిష్కారానికి పోరాటం తప్పితే వేరే మార్గం కనబడని ప్రజలందరూ ఉద్యమాలకు ఆకర్షితులవు తున్నారు. అప్రజాస్వామిక వ్యవస్థ వ్యవస్థీకృత హింసను మరింత స్థిరీకరింపజేస్తుంది. రాజ్యాంగానికి లోబడి చేసే పోరాటాలు అన్యాయా లను ప్రజలకు వివరించగలవేమోగాని, సమస్యను మాత్రం పరిష్కరించే శక్తి, సామర్థ్యాలు ఆ ఉద్యమాలకు ఉండవు. రాజ్యాంగంలోని జీవించే హక్కును ప్రస్తుత వ్యవస్థ గ్యారంటీ చేయలేకపోవడమే గాక, కనీసం గౌరవించడం లేదు. ప్రజాస్వామ్యాన్ని గౌరవించే సంప్రదాయం కన్నా, అది బూటకమని వ్యతిరేకించే కార్యాచరణ విస్తృతి అంతటా కనిపిస్తోంది. సాయుధ పోరాటం సానుకూల ఫలితాలను సాధించకపోయి నప్పటికీ, అశేష పీడిత ప్రజానీకం ఆకాంక్షలకు అనుగుణంగా మాత్రం బలంగా పనిచేస్తుందని ఆదివాసీలు విశ్వసిస్తున్నారు. పంథా ఏదైనప్పటికీ, వారి కార్యాచరణలో ప్రతిఫలిస్తున్న ఆదివాసీ హక్కుల చైతన్యాన్ని ముందుకు తీసుకువెళ్లాల్సిన అవసరం ఉంది. మావోయిస్టు ఉద్యమాన్ని హింస ద్వారా నిర్మూలించడం వల్ల ఆదివాసీలను అడవుల నుండి తరిమి వేయాలని రాజ్యం భావిస్తోంది. వనరులను రక్షిస్తున్న సాధారణ ప్రజలను మావోయిస్టుల పేరుతో నిర్మూలించడం ప్రభుత్వం ఒక ఎత్తుగడగా మలుచుకుంది.

చట్టాన్ని అమలు చేయమని, రాజ్యాంగాన్ని గౌరవించండని, మావోయిస్టులతో పాటు ఏ పౌరుడిని బూటకపు ఎన్‌కౌంటర్‌లో కాల్చొద్దు అని మాట్లాడే ప్రతి ఒక్కరు రాజ్యం దృష్టిలో మావోయిస్టులై పోతున్నారు. చివరికి ఎన్‌కౌంటర్లు కేవలం పౌరహక్కుల సంఘాలకు సంబంధించిన వని, వారు నాలుగు దశాబ్దాలుగా పోలీసులు చనిపోయినపుడు మాట్లాడకుండా, నక్సలైట్లు చనిపోతే పోలీసులు హత్య చేశారని మాట్లాడతారని రాష్ట్ర డిజిపిలు మాట్లాడుతున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో జరిగే ఆందోళనలకు ప్రభుత్వం పర్మిషన్ ఇవ్వాలని, ఎందుకంటే ప్రభుత్వ ఆస్తులను ఆందోళనాకారులు ధ్వంసం చేసే ప్రమాదముందని, ఇది ప్రభుత్వ ఆస్తుల పరిరక్షణ చట్టం–1984కు వ్యతిరేకం అని రాష్ట్ర డిజిపి ఉత్తర్వులు జారీచేశారు.

బెజ్జంగి ఎన్‌కౌంటర్ బూటకమని, బాధ్యులైన పోలీసులపై హత్యానేరం కింద కేసు నమోదు చేయాలని 2016 నవంబర్ 4న గుంటూరులోని వివిధ ప్రజా, హక్కుల సంఘాలు ధర్నా నిర్వహించినప్పుడు, అలాగే కడపలోను ధర్నా నిర్వహించినప్పుడు పోలీసులు కౌంటర్ నిరసనలను జరిపారు. కడపలో జరిగిన ర్యాలీ పక్కన పోటీ ర్యాలీని పోలీసులు నిర్వహించారు. మావోయిస్టుల చేతిలో చనిపోయిన పోలీసులు, ప్రజల కుటుంబాలు అందులో పాల్గొన్నాయని పత్రికలకు మఫ్టీ పోలీసులే ప్రకటించారు. మౌనంగా జరిగే ఈ ప్రదర్శనలు పోలీసుల అతితెలివి తేటలను బయటపెడతాయి. 'మావోయిస్టు ఉద్యమం నశించాలి', 'హక్కుల సంఘాలకు మావోయిస్టుల చేతిలో పోలీసులు చనిపోతే కనబడదా' అనే రెండు ప్రధానమైన స్లోగన్ల ప్లేకార్డులు నిరసనల్లో పాల్గొన్నవారు పట్టుకుంటారు. కడపలో ముసలిగా ఉన్నవాళ్లు పాల్గొన్నప్పుడు వారిని మీ డిమాండ్ ఏమని అడిగితే, సార్లు రమ్మన్నారని వచ్చినాం అని చెప్పారు. అసలు కడపలో మావోయిస్టు కార్యకలాపాలు 2003 నుండి దాదాపుగా లేవని పోలీసులే ప్రకటించారు. అలాంటప్పుడు మావోయిస్టు బాధితులు ఎక్కడ నుండి పుట్టుకొచ్చారో పోలీసులే సెలవియ్యాలి.

# పాలకుల వైఫల్యానికి ఉద్రిక్తతలే సాక్ష్యం

***పాలకులు ప్రజల మౌలిక సమస్యలను పరిష్కరించకుండా సరిహద్దుల్లో యుద్ధ వాతావరణం సృష్టిస్తూ, సామ్రాజ్యవాద దేశాల నుంచి ఆయుధాలను కొనుగోలు చేస్తూ ఉద్రిక్తతలు సృష్టిస్తున్నారని అంటున్నారు జహంగీర్***

దేశ సరిహద్దులలో తీవ్ర ఉద్రిక్తతలు కొనసాగుతున్నాయి. ఉడీ సైనిక సెక్టార్ పై సోకాల్డ్ ఉగ్రవాదులు చేసిన దాడిలో 19 మంది భారత సైనికులు మరణించడం, 18 మంది గాయపడడం ఉద్రిక్తతలకు దారి తీసింది అంటున్నారు. భారత సైనిక శిబిరంపై దాడికి పాల్పడిందెవరు? అన్న విషయంలో ప్రజలకు నిజా నిజాలు తెలిసే అవకాశమే లేదు. కానీ అటు పాకిస్తాన్ పాలక వర్గాలు కానీ, వారికి తాళం వేసే అక్కడి మీడియా శక్తులు కానీ ఇటు భారత పాలక వర్గాలు, వారికి తా అంటే తందనా అనే ఇక్కడి మీడియా శక్తులు కానీ పరిస్థితులను రోజు రోజుకూ మరింత దిగజారుస్తున్నాయి. ఇలాంటి పరిస్థితులలో సామ్రాజ్యవాద దేశాలు సమస్యను మరింత ప్రేరేపించడానికి రెండు దేశాలను రెచ్చగొడుతున్నాయి. ప్రధానంగా భారత ప్రభుత్వం సమస్యను మరింత జటిలం చేస్తున్నది. దానికి ప్రస్తుతం ఆ అవసరం చాలా ఉంది.

కేంద్రంలో మోడీ అధికారంలోకి వచ్చి దాదాపు 30 మాసాలు కావస్తున్నాయి. సబ్‌కే సాథ్, సబ్‌కా వికాస్ నినాదంతో భారత ఓటర్లను మభ్యపరిచి గద్దెకెక్కిన మోడీ తన ఇన్నేళ్ల పాలనలో వారికి పెద్దగా చేసిందేమీ లేదన్నది ప్రజలు గ్రహిస్తున్నారు. దేశంలో ప్రజల సమస్యలు నానాటికీ తీవ్రమవుతున్నాయి. ముఖ్యంగా కశ్మీర్ ప్రజా మున్నెన్నటి కన్నా దృఢంగా, సాయుధంగా పోరాడుతున్నారు. వాళ్లు భారత సైన్యాల కర్ఫ్యూను గేలి చేస్తూ వీధుల్లోకి వస్తూ తమ ఆజాద్ కశ్మీర్ నినాదాన్ని ఎత్తుకుంటున్నారు.

భారత భద్రతా బలగాలు జూలై 8న హత్య చేసిన తమ ప్రియమైన నాయకుడు బుర్హాన్ వాణి అమరత్వ జెండాను ఎత్తి పడుతున్నారు. ఆయన శవ యాత్రలో, అంత్య సంస్కారాలలో లక్షల సంఖ్యలో ప్రజలు పాల్గొన్నారు. ఫాసిస్టు హిందూత్వ శక్తులు, వారి నాయకులైె మోడీ అండ్ కంపెనీ దృష్టిలో వాళ్లంతా ఉగ్రవాదులే, పాకిస్తాన్ ప్రేరేపిత శక్తులే! రాష్ట్ర ముఖ్యమంత్రి మహబూబా ముఫ్తీ అదే పాట పాడుతూ పుండుపై కారం చల్లిన చందంగా వ్యవహరిస్తోంది. కానీ ప్రజలు మాత్రం జూలై 8 నుంచి నిరవధికంగా పోరాడుతున్నారు. అక్కడ పాలకులు ఎవరైనా ప్రజలు మాత్రం గిలానీ (పోరాట నాయకుడు) కేలండరే పాటిస్తారన్నది అక్షరాలా అమలు చేస్తున్నారు. ఆ ప్రజా పోరాటంలో పోలీసుల కాల్పులలో 12 వేలకు పైగా ప్రజలు గాయపడ్డారు. 80కి పైగా అసువులు బాసారు. పోలీసు కాల్పులను ఎదుర్కొంటూ ప్రజలు చేసిన సాయుధ ప్రతిఘటనలో నాలుగువేలకు పైగా భద్రతా బలగాలు గాయపడ్డామంటున్నారు. అయినప్పటికీ, ప్రజాసమరం ఆగడం లేదు. దాదాపు ఏడు లక్షల భారత

---

అలాగే సిడిఆర్ఓ బెజ్జింగి అటవీ ప్రాంతంలోని గ్రామాల్లో సందర్శించినప్పుడు ఆదివాసీ ప్రగతిశీల యువత పేరుతో 16 నుండి 19 సంవత్సరాల లోపు ఉన్న చదువుకున్న యువతీ, యువకులు ప్లేకార్డులు పట్టుకుని మౌన ప్రదర్శన జరిపారు. వారు నిజనిర్ధారణ జరిపే వారితో మాటామంతి కలపరుగాని, మావోయిస్టు బాధితుల గురించి మీరెందుకు మాట్లాడరనే ఐదు దశాబ్దాల ప్రశ్నను ప్లేకార్డుల ద్వారా సంధిస్తూ ఉంటారు.

సాయుధ పోరాటాన్ని కోవర్టుల ద్వారా దెబ్బతీయడం పోలీసులకు కొత్తేమీ కాదు. బెజ్జింగి ఎన్‌కౌంటర్‌ను కూడా కోవర్టులను ఉపయోగించి హత్య చేసినట్టు మావోయిస్టు పార్టీనే ప్రకటించింది. కోవర్టుల ప్రహసనం 1993లో కత్తుల సమ్మయ్యతో ప్రారంభమయింది. మోడీ విధానాలు సామ్రాజ్యవాదులకు, బహుళజాతి సంస్థలకు దేశ సహజ వనరులను దోచిపెట్టడానికే ఉపయోగపడుతున్నాయి. అందుకే ఒడిశాలో కొందువాలి మాలి, నియమగిరి మాలి, దేవమాలి, ఆంధ్రప్రదేశ్‌లోని విశాఖ, తూర్పు గోదావరి జిల్లాలోని ఆదివాసీ ప్రజలు ప్రభుత్వ ఖనిజ ఒప్పందాలకు వ్యతిరేకంగా పోరాడుతున్నారు. ఈ ప్రజాస్వామిక ఉద్యమాలను ఆపరేషన్ గ్రీన్‌హంట్ 3వ దశ ద్వారా అణచివేయాలని చూస్తున్నారు. ఈ నేపథ్యంలోనే పోలీసులు ప్రజల్లో గందరగోళం నెలకొల్పడానికి కౌంటర్ నిరసనలను చేపడుతున్నారు. ఇది 1995 నుండే ప్రారంభమయింది. మేధావులతో మైండ్‌గేమ్ ఆడడం వల్లే చాలామంది మేధావులు నిర్బంధాన్ని భరించలేక మౌనం వహిస్తున్నారు. మానసిక యుద్ధంలో భాగంగానే హక్కుల, ప్రజాస్వామ్య సంఘాల ఇళ్లకు పోలీసులు వెళ్లడం, వారి కుటుంబ సభ్యులపై తీవ్ర వత్తిడి కలుగజేసి సంఘ నాయకులను పనిచేయకుండా చేయడం జరుగుతోంది. ఇన్ని నిర్బంధాలకు తలొగ్గి సంఘాలు పనిచేయాలంటే ప్రజాస్వామిక వాతావరణం వ్యవస్థలో ఉండాలి. ఈ వాతావరణాన్ని కాపాడుకోవాల్సిన బాధ్యత సమాజంపై ఉంది. పోలీసు హింసకు వ్యతిరేకంగా రెండు తెలుగు రాష్ట్రాల్లో ఎటువంటి కార్యక్రమాలను చేసే పరిస్థితి లేదు. నెల్లూరు, కడపలలో బెజ్జింగి ఎన్‌కౌంటర్‌కు వ్యతిరేకంగా జరిగిన ప్రదర్శనలో పాల్గొన్న వారిని పోలీసులు తమ పద్ధతుల్లో వేధించారు. నెల్లూరులో నిర్వహించిన కార్యక్రమంలో పాల్గొన్న నాయకులందర్ని అరెస్టు చేశారు. మీడియా సైతం పోలీసుల కౌంటర్ నిరసనలనే ఎక్కువుగా హైలెట్ చేసింది. కార్పొరేట్ మీడియా వల్ల వాస్తవాలు ప్రజలకు తెలియడం లేదు. పోలీసుల కౌంటర్ నిరసనల వల్ల ప్రజల్లో తీవ్ర గందరగోళం నెలకొంటోంది. దీన్ని ఛేదించాలంటే అన్ని సంఘాలు ఐక్యంగా ధీర్ఘకాలిక పోరాటాలు చేయవలసిన అవసరం ఉంది.

*(రచయిత పౌరహక్కుల సంఘం కార్యకర్త)* వీ

సైనిక బలగాలు కశ్మీర్‌ను తమ వశం చేసుకున్నాయి. ఈ విడత ప్రజా సమరంతోనే కశ్మీర్‌లోయ గగనతలంపై డ్రోన్‌లు తిరగడం ప్రారంభమైంది. వారం రోజులలో పరిస్థితులు చక్క దిద్దాలని భారత హోం మంత్రి సైన్యానికి తాఖీదులిచ్చిన మరుసటి రోజే ఉడీ దాడి జరగడం గమనార్హం.

దేశ ప్రధాని ఎర్రకోట బురుజులపై నుంచి ఆగస్టు 15 నాడు బెలూచిస్తాన్‌ను గుర్తు చేసుకున్నారు. తర్వాత కేరళలోని కజికోడ్‌లో జరిగిన తమ పార్టీ జాతీయ కన్వెన్షన్ సందర్భంగా మోడీ బహిరంగ సభలో ఉగ్రంగా గర్జిస్తూ పాకిస్తాన్ పాలకులపై రంకెలు వేసింది తెలిసిందే. ఆ మరుసటి రోజే తన మనసులోని మాటలో భారత ప్రజలతో పాకిస్తాన్ పట్ల తన వైఖరిని స్పష్టంగానే పంచుకున్నారు. ఇవన్నీ తాము సృష్టించబోయే ఉద్రిక్తతలకు కావలసిన భూమికను తయారు చేసుకోవడంలో భాగమే తప్ప మరేమీ కాదు. ఎందుకంటే, ప్రధాని మోడీ కశ్మీర్ యువత రాళ్లు కాదు చేతులలో డిజిటల్ గాడ్జెట్లు పట్టుకోవాలంటే వినడం లేదు. కశ్మీర్ సమస్యపై చర్చలంటూ అఖిలపక్ష నాయకులు వెళ్లడం ఎంత హాస్యాస్పదంగా ఉందంటే, వారు చర్చలలో అక్కడి ప్రజా పోరాట నాయకులను పక్కన పెట్టి రెండు రోజులు లోయలో పర్యటించి వచ్చారు.

1966లో భారత సైన్యాలు ఉరి తీసిన కశ్మీర్ ఉద్యమ నాయకుడు మక్బూల్ భట్ పాత తరాలకు ఆదర్శం అయ్యాడు. అక్కడి మహిళలకు ఐరన్ లేడీగా కొనియాడబడే ఆసియా అంద్రాబీ ఆదర్శంగా నిలిచింది. నేటి తరాలకు బుర్హాన్ వాణి వారికి ఒక హీరో కావడంలో ఆశ్చర్యమేమిలేదు. (ఆయనను ఒక దేశ ద్రోహిగా ద్వేషించే హిందూత్వ శక్తులు ఆయన అమర్‌నాథ్ యాత్రికులకు స్వాగతం చెప్పేవాడనే విషయాన్నీ, కశ్మీరీ పండితుల పునరాగమనాన్ని కోరుకునే వాడనే విషయాన్నీ తెలుసుకుని నిజమైన లౌకికవాదం గురించి నేర్చుకోవాలి). ఈ రోజు కశ్మీర్ యువత చేతిలో ఏ టాపరో పోస్టర్ బాయ్‌గా లేరు. వాళ్లకు బుర్హాన్ వాణి పోస్టర్ బాయ్ అయ్యాడు. 80 వేల కోట్ల రూపాయల కేంద్ర ప్రభుత్వ ఆర్థిక ప్యాకేజీ ప్రకటించినా ఆ దశాబ్దాల పోరు జ్వాలలు చల్లారడం లేదు. వేల సంఖ్యలో ఉద్యోగాలంటూ ఊరించినా వాళ్లు వినడం లేదు. నిజానికి వాళ్ల డిమాండ్లలో ఈ చౌకబారు కోరికలు ఎన్నడూ లేవు. లక్షల సంఖ్యలో సైన్యాలను దింపినా కశ్మీర్ ప్రజలు రక్త తర్పణం చేస్తూనే పోరాడుతున్నారు తప్ప జడుసుకోవడం లేదు. ప్రజల ఆకాంక్షలను పాలకుల తుపాకులు అణచలేకపోతుండడం, కాసులతో కొనలేక పోతుండడంతో ఫాసిస్టులు పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ముసుగులోనే ఉద్రిక్తతలను సృష్టించారన్నది ఒక వాస్తవం. దేశ ప్రజల, ముఖ్యంగా కశ్మీర్ ప్రజల సమస్యను తక్షణంగా పక్కదారి పట్టించడానికి ఇంతకు మించిన మరే అస్త్రం వారి దగ్గర లేదన్నది గత 70 ఏళ్ల సోకాల్డ్ స్వతంత్ర చరిత్రలో పదే పదే రుజువవుతున్నది.

మోడీ పాలనలో కశ్మీర్ ప్రజా పోరాటం ఎంతో సమరశీలంగా సాగుతుంది. మరోవైపు దేశంలోని వివిధ ప్రాంతాలలో అనేక సెక్షన్‌ల ప్రజలు తమ న్యాయమైన డిమాండ్లపై మున్నెన్నటి కన్నా దృఢంగా, కొత్త కొత్త రూపాలలో పోరాడుతున్నారు. గుజరాత్‌లోని ఊనా దళిత ప్రజలు యావద్దేశ దళిత ప్రజలకు కొత్త మార్గం చూపుతున్నారు. ఆ రాష్ట్ర దళిత ప్రజలు 25 వేల మంది ఇకపై చచ్చిన పశువులను మోసుకువెళ్లి తోళ్లు ఒలిచేది లేదనీ తమ ఆత్మగౌరవాన్ని ఎత్తి పడుతూ ప్రతిజ్ఞలు చేశారు. వారు తమకు మోడీ ప్రభుత్వ స్టార్టప్ ఇండియాలు, స్టాండప్ ఇండియాలు అవసరం లేదని తెలుపుతూ తమకు భూమి కావాలని డిమాండ్ చేశారు. దళితుల పోరాటంలో ఇవి రెండూ మౌలికమైన మార్పులుగానే గుర్తించాలి.

ఇక్కడ ఒక విషయాన్ని గుర్తు చేసుకుందాం. 2002లో గుజరాత్‌లో అప్పటి ముఖ్యమంత్రి సారథ్యంలో సృష్టించబడిన మారణ హోమంలో గుజరాత్ దళితులు, ఆదివాసులు ప్రధాన కాల్బలుగా సంఘ్ హంతక ముఠాలు ఉపయోగించుకున్నాయి. ఆనాడు దళితులకు భూముల ఆశ చూపి సంఘ్ శక్తులు వారిని లోబరచుకున్నాయి. రాష్ట్రం నుంచి ముస్లింలను తరిమితే వారి భూములన్నీ దళితులకే దక్కుతాయనీ ఆ శక్తులు తెగ ప్రలోభ పెట్టాయి. ఆదివాసులనూ ఇలాగే ప్రలోభ పరుచుకున్నారు. ఇది ఆనాటి గుజరాత్ నమూనా. కానీ ఆచరణలో గుజరాత్ దళితులకు ఇప్పటి వరకూ భూములు దక్కలేదన్నది చేదు నిజం. అందుకే వాళ్లు ఇప్పుడు భూములు అడుగుతున్నారు. ఇప్పుడు వారితో ఆదివాసులు, ముస్లింలు సమైఖ్యమవుతున్నారు. రాష్ట్ర పాటిదార్లు ఈ సమూహాల పక్షం నిలబడ్డారు. ఇది ఈనాటి గుజరాత్ నమూనా. వీరి ఐక్యతను దెబ్బతీయడానికి సంఘ్ దుష్ట శక్తులు తక్షణం రంగంలోకి దిగాయి. ఊనా దళితులను లోబర్చుకోవడానికి అనేక కుతంత్రాలకు పాల్పడుతున్నాయి. అలాగే ఆ రాష్ట్ర ఆదివాసులను మభ్యపెట్టడానికి మోడీ తన 66వ జన్మదినం నాడు గుజరాత్ ఆదివాసుల కోసం అనేక ప్రాజెక్టులకు శంకుస్థాపన చేశాడు. ఈ మూడు పీడిత సమూహాల సమైక్య శక్తి దేశ ప్రజల ముందుకు తెచ్చిన నూతన పోరాట రూపాలను, నినాదాలను అణచడం మోడీ అండ్ కంపెనీకి తక్షణ సమస్యగా ముందుకు వచ్చింది. భారత ప్రజల, ముఖ్యంగా జనాభాలో 40 శాతంగా ఉన్న ఈ మూడు సమూహాల దృష్టిని తమ జీవన్మరణ సమస్యల నుంచి మళ్లించకపోతే మోడీ గాంధీని ముందు పెట్టుకున్నా, అంబేద్కర్‌ను తలకెత్తుకున్నా, ముఖ్యమంత్రి ఆనందీబాయినీ పక్కన పెట్టినా ఆ సమూహాలు ఆయన కపటత్వాలన్నీ గుర్తించి మరింత సమరశీల పోరాటాలలోకి దిగక తప్పదనే వాస్తవాలు వెల్లడవడం మోడీ అండ్ కంపెనీని పెద్ద షాక్‌కు గురి చేసింది.

గుజరాత్ ప్రజల పోరాటాలు వేడెక్కుతుండగానే మహారాష్ట్రలో లక్షలాది మంది మరాఠా రైతులు తమ న్యాయమైన డిమాండ్‌లతో రోడ్ల పైకి రాసాగారు. నిన్నటి వరకూ కృత్రిమ వ్యవసాయ సంక్షోభానికి బలై, పురుగు మందులు కొనుక్కొని (ఆత్మ) హత్యలకు పాల్పడిన అక్కడి రైతులు అలాంటి చావుల బదులు రోడ్లపైకి వచ్చి ప్రభుత్వాలను నిలదీయడం గొప్ప మార్పే! దేశంలోనే రైతుల ఆత్మహత్యలలో అగ్రభాగాన నిలిచిన అక్కడి రైతాంగం మౌన ప్రదర్శనలే అయినప్పటికీ రోడ్లెక్కడంతో అన్నదాతలు, రైతులు ఆత్మహత్యలకు స్వస్తి చెపుతారని విశ్వసిద్దాం. మరాఠా రైతాంగం రిజర్వేషన్స్ కోరుతున్నారు. విద్యా, వైద్య సౌకర్యాలు కావాలంటున్నారు. వారు తమ అనేక సమస్యలు ముందుకు తెస్తున్నారు. వీరి ప్రదర్శనలు వారాల తరబడిగా అనేక నగరాలలో నేల ఈనిన చందంగా సాగుతుంటే, కాలేజీ అమ్మాయిలు వాటికి ముందుంటుంటే, ఆ వెనుక మహిళలు ఉండడం, చివరన పురుషులు ఉండడం విశేషం. ఆత్మహత్యలు వదిలి రైతులు రోడ్లెక్కడంతో ఆగరనీ మోడీ అండ్ కంపెనీకి స్పష్టమే. వారు మరింత సమరశీలం కాకుండా నిరోధించడం దేశ పాలకులకు తక్షణ అవసరం. వారి దృష్టిని తమ చావు బతుకుల సమస్య నుంచి మళ్లించాలి. ఎక్కడికైనా సాధారణంగానే అన్నింటి కన్నా ముందు నిలిచే దేశ రక్షణ సమస్యను ప్రజల ముందుకు పాలకులు ఉద్దేశ పూర్వకంగానే తెచ్చారన్నది గమనించాలి.

గత 25 ఏండ్లుగా కావేరీ జలాల సమస్య అపరిష్కృతంగా ఉంటూ వస్తోంది. జనం నీళ్ల కోసం కొట్లాడుకునే దుస్థితిని పాలకులు తమ స్వార్థ ప్రయోజనాల కోసం దశాబ్దాలుగా పెంచి పోషిస్తున్నారు. దేశంలో అనేక రాష్ట్రాల మధ్య నదీ జలాల సమస్య పాలకులు కోరుకున్నప్పుడల్లా పుట్టుక వచ్చి ఉపద్రవాలకు దారి తీయడం చూస్తున్నాం. ఇలాంటి ఒప్పందాలు రాష్ట్రాలకే కాదు, దేశాల మధ్య పారుతున్న నదీ జలాల పంపకాల మధ్య కూడా అనేక ఒప్పందాలు జరిగి ఉన్నాయి. ఇలాంటి ఒప్పందాలలో భారత్ పాక్‌ల మధ్య సింధూ నదీ జలాల పంపకం ఒప్పందం ఒకటి. దానిని పునఃసమీక్షిస్తామంటూ కేంద్ర పాలకులు ఉద్రిక్తతలను మరింత తీవ్రం చేశారు. దీని వెన్నంటి ఉండే అనేక సమస్యల లోతుల్లోకి వెళ్లకుండా, వాటి దష్పరిణామాల గాంభీర్యతను తీవ్రంగా పరిగణనలోనికి తీసుకోకుండా వెకిలి చేష్టగా మోడీ ప్రభుత్వం ప్రకటించింది. ఈ సమస్యపై వెంటనే సరిహద్దు ఆవలి ప్రజల వాణిగా అక్కడి పాలకులు నీళ్లు లేక చావడం కన్నా ప్రజలు పోరాడి చస్తామంటారంటూ తమ ప్రతిక్రియను వ్యక్తం చేస్తూ ఉద్రిక్తతలను మరింత వేడెక్కించారు. సమీక్ష చేయడం తుది ఘడియలలో ఎందుకు వాయిదా వేసుకున్నప్పటికీ పాలకుల ప్రతి ఒక్క చర్య ప్రజలను మరింత ఉద్రిక్త వాతావరణంలోకే నెడుతున్నది.

1947 తర్వాత నుంచి మన దేశంలో కొనసాగుతున్న యుఎన్ఎంఒజిఐపి (భారత పాకిస్తాన్‌ల విషయంలో ఐక్యరాజ్య సమితికి చెందిన సైనిక పరిశీలకుల గ్రూపు) 70 ఏళ్లుగా రెండు దేశాల మధ్య చర్చలు కొనసాగించి సమస్యను పరిష్కరించలేకపోయింది. అంటే దాని చిత్తశుద్ధి ఏపాటిదో తెలుసుకోవచ్చు!

సమస్యలన్నింటినీ శాంతి చర్చల ద్వారానే పరిష్కరించుకోవాలనీ, ఆయుధాలతో సాధించేదేమీ ఉండదంటూ పదే పదే నీతులు వల్లించే పాలకుల శాంతి కాముకత్వం సార్క్ దేశాల డిసెంబర్ సమావేశాలను బహిష్కరించడంతో బయటపడింది. ఇస్లామాబాద్‌లో జరగనున్న సార్క్ దేశాల సమావేశానికి తాము హాజరు కావడం లేదని భారత్ తన ఉడుకుమోతు వైఖరిని ప్రదర్శించిన వెంటనే సార్క్ దేశాల మధ్య మసలుతున్న అంతర్గత వైరుధ్యాలను బయటపెడుతూ బంగ్లాదేశ్, ఆఫ్ఘనిస్తాన్, భూటాన్‌లు భారత్‌ను సమర్థిస్తూ ముందుకు వచ్చాయి. దౌత్య విధానాలలో అనుసరించాల్సిన పంచశీలలు, శాంతి ప్రవచనాలు అంతా హుళక్కైనాయి. దుష్ట నీతులు ముందుకు వచ్చి ఉద్రిక్తతలు తీవ్రమైనాయి.

దేశాల సరిహద్దులలో ఉద్రిక్త వాతావరణం నెలకొనడం వెనుక మోడీగారి మేక్ ఇన్ ఇండియా ఫ్లాగ్‌షిప్ ప్రోగ్రాం గురించి తప్పక పరిశీలించాల్సి ఉంటుంది. మోడీ పాలనలో సగం కాలం పూర్తి అయిపోవస్తున్నా ఆయన 50కి పైగా దేశాలలో సుడిగాలి పర్యటనలు చేసి వచ్చినా ఆయనాశించినంత వేగంగా మేక్ ఇన్ ఇండియా ముందుకు సాగడం లేదు. కార్యరూపం ధరించడం లేదు. పైగా దానికి వ్యతిరేకంగా దేశంలోని ప్రజానీకం, ముఖ్యంగా రైతాంగం, ఆదివాసులు తమ పంట భూముల కోసం, అడవుల కోసం, దేశ సంపదల సంరక్షణ కోసం పోరాటాలు చేపట్టడం ముమ్మరమైంది. ఈ పోరాటాలలో మావోయిస్టు ఉద్యమ ప్రాంతాలు అగ్ర భాగాన ఉన్నాయి. వారి ఉద్యమ ప్రాంతాలలో పెట్టుబడిదారులు ఎక్కడా గనుల తవ్వకాలు సహా ఏ దోపిడీ ప్రాజెక్ట్ పనులు సవ్యంగా జరుపుకోలేకపోతున్నారు. సరికదా తాజాగా బస్తర్ జిల్లాలోని లోహండిగూడ నుంచి టాటా, దంతెవాడ జిల్లాలోని ధుర్లి, భాన్‌సీల నుంచి ఎస్సార్ ప్రజా పోరాటాల తీవ్రతతో తమ ప్రాజెక్టులను వదులుకొని వెనక్కి వెళ్లిన తాజా ఘటనలు విస్థాపన వ్యతిరేక ఉద్యమ ప్రజలను ఎంతగానో ఆకర్షిస్తున్నాయి. పాలకుల లక్షలాది భద్రతా బలగాల ఇనుపబూట్ల పదఘట్టనల మధ్య అడవులలో జీవిస్తున్న ఆదివాసి ప్రజలు నిత్యం నెత్తుర్లు చిందిస్తూ పోరాడుతున్నారు. మేక్ ఇన్ ఇండియాకు దేశంలో ప్రధానంగా అడవులలో తీవ్ర ప్రతిఘటన ఎదురవుతోంది. ఇందులో భాగంగా ముందుకు వచ్చిన డిజిటల్ ఇండియా, స్కిల్ ఇండియాలు దేశంలోని నిరుద్యోగుల ఆకలి చల్లార్చడం లేదు. మోడీ పాలనలో దేశంలో నిరుద్యోగం పెరిగిందంటూ తాజా నివేదికలు వెల్లడిస్తున్నాయి. దాదాపు 80 కోట్లుగా ఉన్న దేశ యువశక్తిలో ఏటా కోటి మంది నిరుద్యోగులు పారిశ్రామిక రిజర్వు సైన్యంలో చేరుతున్నారు. దేశంలో పోలీసుల భర్తీ వేగంగా జరిగిపోతోంది తప్ప మిగతా ఏ రంగాలలోనూ ఉద్యోగాల రూపకల్పన డిజిటల్ ఇండియా విధానాల మధ్య లొటపెట పెదవులకు నక్క ఆశపడ్డ చందంగానే తయారయింది.

దేశ ప్రజలకు నిత్యావసర సరుకుల కొనుగోలు దుర్భరంగా మారింది. అన్ని సరుకుల మార్కెట్ ధరలు పెరిగి వినియోగదారులు విలవిల లాడుతున్నారు. ఇలాంటి పరిస్థితులలో గోరుచుట్టుపై రోకటి పోటులా తాజాగా ఒపెక్ దేశాల పెట్రోల్ ధరల పెరుగుదల నిర్ణయం ముందుకు వచ్చింది. మోడీ గద్దెనెక్కినప్పటి నుండి కలిసి వచ్చిన అదృష్టంలా వరుసగా ఇప్పటి వరకు అంతర్జాతీయ విపణిలో పెట్రోల్ ధరలు పడిపోతూ ప్రతి బ్యారెల్‌కు 35 డాలర్ల కన్నా కిందికి దిగింది చూశాం. అయినప్పటికీ మోడీ ఆ మిగులును మాత్రం దేశ ప్రజలకు అందకుండా చేసి, వినియోగదారులను పరీక్షిస్తూ వచ్చారు. ఇప్పుడు ప్రతీ బ్యారెల్ 50 డాలర్లకు పెరిగితే సామాన్యుడిపై ఆ వ్యూహాత్మక సరుకు ధర పెరుగుదల ప్రభావం చాలా తీవ్రంగానే ఉండబోతుందని అందరికన్నా తెలివిగా మోడీ గ్రహించి ఉంటారు. ఆ భారాన్ని ప్రజలు వ్యక్తం చేయకుండా ఉండాలంటే కల్పిత దేశభక్తితో ప్రజలను రెచ్చగొట్టడం అతి సులువైన పని అన్నది భారత పాలకులకు బాగా తెలుసు.

కేంద్రంలో హిందూత్వ శక్తులు పగ్గాలు అందుకున్నప్పటి నుంచి వారి శక్తి పూజ సిద్ధాంతం పదే పదే వ్యక్తం అవుతోంది. కంటికి కన్ను, పంటికి పన్ను అంటూ దేశ రక్షణ మంత్రి మనోహర్ పరేకర్ ఉగ్ర ప్రకటనలు చేయడం తరచుగా వింటున్నాం. భారత సైన్యాలు యుద్ధ చర్యలు లేకుండా పోవడంతో చేష్టలుడిగిన చందంగా ఉండిపోతున్నాయంటూ ఆయన వాపోవడం గత సంవత్సరమే చూశాం. యుద్ధం చేయని సైన్యానికి ప్రజలలో గౌరవం లేకుండా పోయిందని, తన యుద్ధ పిపాసను చాటుకున్నాడు. కాని దేశ సైన్యాలు ఈనాడు నిజానికి తుపాకులు ఎక్కుపెడుతున్నది దేశ రక్షణలో శత్రు సైన్యాలతో కాకుండా, తమ దేశ ప్రజల పైననే అన్నది పరేకర్ కన్నా ప్రజలకే బాగా తెలిసే సైన్యం అంటేనే కశ్మీర్‌లో, ఈశాన్య ప్రాంతాలలో, మధ్య భారతంలో ఇతరత్రా అనేక ప్రాంతాలలో ప్రజలు వ్యతిరేకిస్తున్నారు. ఈ మాత్రం ఇంగిత జ్ఞానం లేని పరేకర్ దేశ సైన్యాన్ని యుద్ధానికి సిద్ధం చేయడం ఉద్రిక్తతలలో భాగమే అవుతుంది. దేశంలో యుద్ధ చర్యల కోసం ఉవ్విళ్లూరుతున్న పాలకులు తాజాగా అమెరికాతో కుదుర్చుకున్న వ్యూహాత్మక లాజిస్టిక్ అవగాహనా ఒప్పందంపై ప్రజలు తమ తీవ్ర నిరసనను వ్యక్తం చేస్తున్నారు. సోకాల్డ్ దేశ సార్వభౌమత్వానికి ఇది గొడ్డలి పెట్టు లాంటిది. ఇలాంటి అనేక చర్యలు దేశ ప్రజలను ఆలోచింపచేస్తున్నాయి. ఆ ఆలోచనలు భౌతిక శక్తిగా రూపుదిద్దుకోక

ముందే వాటిని పక్కదారులు పట్టించాలన్నదే దేశ సరిహద్దులలో నెలకొన్న ఉద్రిక్తతల వెనుక దాగిన వాస్తవం. ఇలాంటి వాతావరణాన్ని సృష్టించి రానున్న పంజాబ్, యుపి, గుజరాత్ విధాన సభల ఎన్నికలలో ఓట్లు దండుకోవడం కూడా వారి కుటిల లక్షణాలలో ఒకటిగా ఉండి తీరుతుంది.

ఈ రోజు పాకిస్తాన్ పైకి సంఘ్ పరివార్, మోదీత్వ శక్తులు చేతులు మడవడాన్ని, చెంగులు చెక్కడాన్ని దేశంలో ఎవరు ఖండించినా, వ్యతిరేకించినా ఏమాత్రం సహించే వాతావరణం లేకుండా చేస్తున్నారు. వారిపై దేశ ద్రోహులంటూ ముద్ర వేసే ప్రమాదం బూటకపు దేశ భక్తుల నుంచి తీవ్రమైంది. కశ్మీర్ ప్రజల విడిపోయే హక్కుతో సహా స్వయం నిర్ణయాధికార హక్కును సమర్థించే వారినే హిందూత్వ శక్తులు భరించలేకపోతున్నాయి. భారత సైన్యాలు భారత ప్రజలపై కొనసాగిస్తున్న హింసోత్పాతాన్ని విమర్శిస్తున్న వారిని బాజాపా పార్లమెంటేరియన్‌లు సైన్యం జోలికి వెళ్లకూడదంటూ రచయితలను హెచ్చరిస్తున్నారు. ఇలాంటి పరిస్థితిలో చరిత్రలోకి వెళ్లి వాస్తవాలు పరిశీలించడం చాలా అవసరం. భారత విస్తరణవాదుల వైఖరులు అర్థం చేసుకోకుండా ఉద్రిక్తతల మూలాలు బోధపడవు. ముందు కశ్మీర్‌పై గాంధీ వైఖరి చూద్దాం.

1947 జూలై 1న గాంధీ కశ్మీర్‌లో – యావత్తు దేశం సంప్రదాయ హింసా జ్వాలలో రగిలిపోతుంటే నాకు కశ్మీర్ పైనే ఆశలున్నాయి – అన్నాడు. ఆ తర్వాత మరో మూడు మాసాలకు అక్టోబర్ 10న – వాస్తవంగా కశ్మీర్ ప్రజలు కశ్మీర్ పాలకులు కావాలి – అన్నాడు. కానీ ఆ వయో వృద్ధుడి వ్యాఖ్యలకు పూర్తి భిన్నంగా ఉదారవాదిగా, సోషలిస్టుగా ముద్ర వేసుకున్న నెహ్రూ (దేశ సైనికులను 1958లో ఎఎఫ్ఎస్‌పిఎ చట్టంతో ముస్తాబు చేసిందీయనే!) వైఖరి ఉంది – కశ్మీర్ అంశంపై మనం అంతర్జాతీయ వేదిక మీద ఒక జూదం ఆడుతున్నాం. ఆ జూదంలో మనం ఎట్టి పరిస్థితుల్లోనూ ఓడిపోవడానికి వీల్లేదు. ప్రస్తుతం మనం కశ్మీర్‌లో తుపాకి మొన మీద నిలబడి ఉన్నాం. అక్కడి పరిస్థితులు మెరుగయ్యే వరకు ప్రజాస్వామ్యం, నైతికతలు కూడా వేచి ఉండక తప్పదు – అన్నాడు నెహ్రూ. ఇక ఇప్పుడు మోడీ ఏకంగా పాకిస్తాన్‌లో భాగంగా ఉన్న ఫక్తూన్, బెలుచిస్తాన్‌లనే సవాలు చేస్తున్నాడు. ఇక కశ్మీర్‌లో శాంతికి స్థానం ఎక్కడుంది? ఉద్రిక్తతలు చల్లారే మార్గమేది?

కశ్మీర్ మాత్రమే కాదు, ఈశాన్య ప్రాంతాలు కూడా భారత సైన్యాల అణచివేతలో దశాబ్దాలుగా నలిగిపోతున్నాయి.

1955 చివరి నాటికే ఈశాన్య ప్రాంత పోరాటకారులు నాగా ఫెడరల్ ప్రభుత్వాన్ని ప్రకటించుకున్నారు. దాని నాయకుడు ఫిజో. భారతదేశానికి బ్రిటిష్‌వారు సోకాల్డ్ స్వతంత్రం అప్పగించడానికి ఒక రోజు ముందే వారు తమ స్వతంత్ర్యాన్ని ప్రకటించుకున్నారు. ఆ సందర్భంగా ఢిల్లీలో ప్రధాని నెహ్రూను ఫిజో కలిసినప్పుడు – మిన్ను విరిగి మీదపడ్డా, భారతదేశం ముక్క చెక్కలైనా, రక్తం ఏరులై ప్రవహించినా, నేను ఈ స్థానంలో ఉన్నా లేకపోయినా నాగాలకు స్వాతంత్ర్యం ఇచ్చే ప్రసక్తే లేదు – అన్నాడు. అవును మరి! 1949లో మణిపూర్ రాజును ఎత్తుకెళ్లి తుపాకి ఎక్కుపెట్టి భారత్‌లో చేరుతున్నట్లు మహారాజు చేత సంతకం పెట్టించుకున్న భారత పాలకులు ఆ ప్రాంతాన్ని ఎలా వదులుకుంటారు? కాని అక్కడి ప్రజలు మాత్రం తమ ఆకాంక్షల సాధనకై దృఢంగా పోరాడి తీరుతారు. ఈ మధ్యే సెప్టెంబర్ 21న మణిపూర్‌లో పోరాటకారులు ప్రజా కర్ఫ్యూను విధించి, సెప్టెంబర్ 21న మణిపూర్ స్వతంత్ర దినాన్ని పాటించారు. సాయుధ బలగాల ప్రత్యేక అధికార చట్టం (ఎఎఫ్ఎస్‌పిఎ) రద్దుకై తన యవ్వన ప్రాయాన్నంతా ఉపవాస దీక్షకు అంకితం చేసి తుదకు 40 ఏళ్ల పైబడిన వయసులో మణిపూర్ బిడ్డ ఇరోం షర్మిలా విరక్తితో తన దీక్షను విరమించుకున్నప్పటికీ ఆ చట్టమే కాదు. మణిపూర్ దేశాన్నే ఏలుకుంటామనే మణిపూర్ వాసుల ఆకాంక్షలను ఎవరాపలేరు.

1975లో సిక్కింను విలీనం చేసుకున్న భారత పాలకుల దౌర్జన్యం నేటి తరాలకు తేటతెల్లమే. ఇక ప్రధాన మంత్రి మోడీకి అత్యంత సన్నిహితుడు, జాతీయ భద్రతా మండలి సలహాదారు అజిత్ దోవాల్ సిద్ధాంతాన్ని చూస్తే ఉద్రిక్తతలు, ఉగ్రవాదం వారికి సదా అంది వచ్చే ఆయుధాలు అన్నది తెలిసి వస్తుంది. 2004లో ఐబి డైరెక్టర్‌గా దోవాల్ ఉన్నప్పుడు జమ్మూ కశ్మీర్‌పై పాకిస్తాన్ ప్రకటనలు చేస్తే, పాక్ ఆక్రమిత కశ్మీర్‌పై, బెలుచిస్తాన్‌పై మనం ముందుకు రావాలి అన్నాడు. 2014 ఫిబ్రవరిలో దోవాల్‌ఇలా అన్నాడు – 'ఇన్‌డీడ్ టెర్రరిజం ఈజ్ ఎ టాక్టిక్ టు అచీవ్ ఐడియలాజికల్ ఆర్ పొలిటికల్ అడ్వాంటేజస్' – ఇక ఆయన అధికారంలోకి వచ్చాక ఇలా అన్నాడు – 'యూ మే దు వన్ ముంబాయ్, యూ మే లూస్ బలూచిస్తాన్'.

దోవాల్ చెపుతున్న విషయాల నేపథ్యంలో సైన్యానికి చెందిన టెక్నికల్ సర్వీసెస్ డివిజన్ (టిఎస్‌డి) 2011 నవంబర్‌లో విడుదల చేసిన రిపోర్టులో వర్తమాన విదేశీ వ్యవహారాల సహాయ మంత్రి, మాజీ సైన్యాధ్యక్షుడు వికె సింగ్ హయాంలో ఒక విదేశంలో కనీసం 8 సార్లు కోవర్టు ఆపరేషన్లు నిర్వహించినట్లు స్పష్టంగానే పేర్కొంది. అదే రిపోర్టులో బెలూచిస్తాన్‌లో వేర్పాటువాద శక్తులకు డబ్బులు వెచ్చించినట్లు పేర్కొంది. ఇక్కడ పేర్కొన్న నాయకుల, అధికారుల వైఖరులు భారతదేశ విస్తరణవాదాన్ని స్పష్టం చేస్తున్నాయి. కాగా, మోడీకి మాతృ సంస్థ ఆర్ఎస్ఎస్‌కు చెందిన పాఠశాలల నెట్‌వర్క్ నిర్వాహకుడు విశ్రాంత ఉపాధ్యాయుడు దీనానాథ బత్రా శిక్షా బచావో ఆందోళన్ సమితిని స్థాపించి సంఘ్ దృష్టి కోణాన్ని సవాలు చేసే వారికి వ్యతిరేకంగా కేంపెయిన్ చేస్తూ ఆయన హిందూ మత దురాభిమానాన్ని చాటుకోవడమే కాకుండా అతడు వారి పాఠశాలల విద్యార్థులందరికీ పాకిస్తాన్, శ్రీలంక, బంగ్లాదేశ్, ఆఫ్ఘనిస్తాన్, నేపాల్, భూటాన్‌లను భారతదేశంలో భాగంగా పటాలు ముద్రించి ఇస్తూ కర్రికులం అందిస్తున్నాడు.

ఇదీ నేటి ఢిల్లీ పాలకుల భావజాలం. ఇదీ అసలు ఉద్రిక్తతలకు మూలకారణం. అందుకే కశ్మీర్ లోయలోని బారాముల్లా జిల్లా ఉడీ సైనిక సెక్టార్‌పై సోకాల్డ్ ఉగ్రవాద దాడి భారత సైన్యాల సృష్టే అంటూ పాకిస్తాన్ ఆరోపించడాన్ని దోవాల్‌డాక్ట్రిన్ మైండ్‌తో ఆలోచించేవాళ్లు దేశంలో అనేక మంది ఉన్నారు. ఆ తరువాత పాకిస్తాన్ సరిహద్దులలోకి భారత సైన్యాలు చొచ్చుకవెళ్లి జరిపాయంటున్న సర్జికల్ స్ట్రైక్ రెండు దేశాల ప్రభుత్వాలు గత కొద్ది రోజులుగా కొనసాగిస్తున్న వివాదాస్పద ప్రకటనల యుద్ధం ఆ ఆరోపణలకు మరింత ఊతం ఇస్తున్నది. అలాగే పాకిస్తాన్ దౌత్య వర్గాలు భారతదేశం సిక్కిం, భూటాన్‌ల లాగా మా దేశాన్ని బెదిరించలేదంటూ తమ అణుశక్తి బలాన్ని చాటుకున్నాయి. నిజానికి రెండు దేశాలు తమ ప్రజల ఏ ఒక్క మౌలిక సమస్యను పరిష్కరించలేకపోతున్నాయి. రెండు దేశాల పాలక వర్గాలు భూస్వామ్య సామ్రాజ్యవాదుల ప్రయోజనాలకు అంకితమై అధికారాన్ని వెలగబెడుతున్నాయి. వీరి నైజం తెల్సిన ప్రజలు తమ సమస్యల పరిష్కారానికి తామే పోరాడుతున్నారు. అందుకే ఇది విప్లవాల యుగం. దేశాలు స్వాతంత్రాన్ని, జాతులు విముక్తిని, ప్రజలు విప్లవాలను కోరుకుంటున్నారు.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

# నియమబద్ధ ప్రజాస్వామ్యం కోసం పోరాటం

*ప్రజాస్వామ్యం పేరుతో సాగుతున్న పాలన వ్యవస్థీకృత హింసను కొనసాగిస్తోందనీ, నిజమైన ప్రజాస్వామ్యం కోసం ప్రజలు నిత్యం పోరాడాల్సిన అవసరం ఉందనీ అంటున్నారు* **ఎచ్. వాగీశ్**

**పోరాటాల అస్తిత్వం – లేవనెత్తే ప్రశ్నలు**

ఆంధ్ర-ఒరిస్సా సరిహద్దులో పోలీసు కాల్పుల వల్ల ముప్పై మంది మావోయిస్టులు చనిపోయారన్న విషయం త్వరలోనే వార్తా పత్రికలలో కనిపించదు. అయితే సాయుధ వామ పక్ష ప్రతిఘటన ఉద్యమం అనే రాజకీయ పోరాటం మాత్రం మన ప్రజాస్వామ్యం పైన ఎక్కుపెట్టిన ప్రశ్నలకు సమాధానాలు వెతుక్కోవలిసిన అవసరాన్ని, అదే నిజమైన ప్రజాస్వామిక విముక్తి మార్గంగా నమ్మిన వారు కోల్పోయే ప్రాణాల ద్వారా గుర్తుచేస్తూ ఉంటుంది. ఏ యుద్ధంలో నైనా మొదట హత్యకు గురియ్యేది సత్యమే అనేది అసత్యం ఏమీ కాదు. మనం ప్రజాస్వామ్యంగా పిలుచుకుంటున్న, మనం ఓట్ల రూపంలోనూ, ఇతరత్రా కూడా, భయం వల్లనో, విశ్వాసం వల్లనో, అవసరాల వల్లనో, విధేయత చూపుతున్న ఈ పాలనా వ్యవస్థ నియమబద్ధతను పాటించి ఇటువంటి ఈ సంఘటనలు ఎందుకు జరుగుతున్నాయో మనకు సమాధానం చెప్పే అవకాశం తక్కువ.

ఈ సందర్భంలో ప్రజాస్వామ్యం అంటే ఏమిటో మాట్లాడడం అవసరం. ప్రజాస్వామ్యం అన్న మాటకు ప్రజాదరణ ఇరవయ్యో శతాబ్దం నుండి పెరిగింది. ప్రజాస్వామ్యం అంటే మెజారిటీ ప్రజల మూక పాలన కాదనీ ప్రజలు తమ అనుభవాల వెలుతురులో చర్చించుకొని రూపొందించుకున్న నియమాల అనుసారం సాగే పాలన అనే అర్థంలో అది ప్రస్తుతం కొనసాగుతున్నది. అందుకే వ్యక్తి స్వేచ్ఛకు ప్రాధాన్యతను ఇచ్చే లిబరల్ కాపిటలిస్ట్ సమాజాలు కానీ, సమానత్వానికి ప్రాధాన్యతను ఇచ్చే ఒక మేర సోషియలిస్ట్ విలువలు నెలకొల్పే సమాజాలు కానీ తమ పాలనా రూపాలను ప్రజాస్వామిక రూపాలు అనే పేర్కొంటున్నాయి. మొత్తంగా ఏదో ఒక రూపంలో ఆయా స్థల కాల సందర్భాల్లో స్వేచ్ఛా సమానత్వాల మధ్య ఒక క్రియాత్మక సమతూకం (డైనమిక్ ఈక్విలిబ్రియం) నెలకొల్పడం అనే కత్తి మీద సామే ప్రజాస్వామ్యం. అయితే తమను తాము ప్రజాస్వామికం అని ప్రకటించుకున్న రాజ్యాలు తమ పని తీరుల వల్ల సదరు రాజ్య వ్యవస్థనూ- అంటే దాని కోసం పనిచేస్తూ ఉండే ప్రభుత్వ వ్యవస్థనూ, అక్కడి ఆర్థిక వ్యవస్థనూ (అంటే మార్కెట్‌నూ), సామాజిక వ్యవస్థనూ - పైన పేర్కొన్న స్వేచ్ఛా సమానత్వాల సమతులనాన్ని పట్టించుకునేటట్టు చూడవలిసి ఉంటుంది. ఈ పని చేయడంలో విఫలమైన ప్రతి చోటా ఆ వైఫల్యపు తీవ్రత, దానికి అక్కడి ప్రజల స్పందనను బట్టి పోరాటాలు ఉంటాయి.

మన దేశంలో కూడా నిరాయుధ, సాయుధ పద్ధతుల్లో పోరాటాలు సాగుతూనే ఉన్నాయి. జమ్మూ కశ్మీర్‌లో ప్రజల పట్ల మన ప్రభుత్వం వ్యవహారశైలి మీద, ఈశాన్య భారత దేశంలో సైన్యం జులుం పట్ల, ఆదివాసీ ప్రాంతాలల్లో వనరుల కోసం జరుగుతున్న విధ్వంసం, గ్రామం, నగరం అనే తేడాలేకుండా కొనసాగుతున్న అమానవీయమైన అవినీతి మీద ప్రతిఘటన సాగుతూనే ఉన్నది. ఆ పోరాటాల శక్తి, వాటికి దొరికే మద్దతు సంశయాత్మకమే. సామర్థ్యాలు, వాటి విజయావకాశాలు సందేహాస్పదమే. అయినా పోరాటాలు సాగుతూనే ఉంటాయి.

ఇటువంటి పోరాటాల వరుసలో, వ్యవస్థ సమూల మార్పు కోసం సాగే పోరాటంగా తమను తాము రూపొందించుకున్న మావోయిస్టు సాయధ విప్లవపోరాటం గత నలభై సంవత్సరాల పైబడి ఉనికిలో ఉన్నది. 'దోపిడీ వర్గాల చేతులలో ఉండే అధికారం ఎప్పటికీ ప్రజాస్వామికంగా రూపొందదు. అందువల్ల పీడిత వర్గాలు దీర్ఘకాల ప్రజాయుద్ధం ద్వారా ఈ వ్యవస్థను కూలదోసి నిజమైన ప్రజాస్వామ్యాన్ని స్థాపించడం ద్వారనే విమోచన పొందుతారు' అనే విశ్వాసంతో వీరు పోరాడుతున్నారు. ఈ సాయుధ పోరాటపు గమనమూ, వారి విశ్వాసమూ ప్రశ్నలకు అతీతమైనవి కావు. ప్రస్తుతం ఆదివాసీ ప్రాంతాలలో వనరుల మీద దేశీయ, అంతర్జాతీయ పెట్టుబడులు పట్టు బిగిస్తున్నాయి. ఆదివాసులు మునుపటికంటే ఎక్కువగా జీవన్మరణ పోరాటంలోకి నెట్టబడినారు. అందుకే సాయుధ పోరుకు మద్దతు అధికంగా ఉన్నది. అంటే అక్కడ మాత్రమే సమస్యకు, పోరాటానికి మధ్య బలమైన సంబంధం కనిపిస్తున్నది. మైదాన ప్రాంతాలలో ఒకనాడు ఈ ఉద్యమానికి (కనీసం తెలుగు ప్రాంతాలలో) ఉన్న మద్దతు ఇప్పుడు కనిపించడం లేదు. దాని అర్థం మైదాన ప్రాంతాలైన గ్రామీణ పట్టణ ప్రాంతాలలో సమస్యలు ఏమీ లేవని అర్థం కాదు.

మన దేశంలో ఆర్థిక సరళీకరణ మొదలైనప్పటి నుండి అంటే దాదాపు రెండు దశాబ్దాలుగా ఒక మేర దారుణమైన పోలీసు చర్యల ద్వారా, ఇంకొక మేర ఉద్యమానికి పెద్ద ఎత్తున మద్దతు తెలిపే పీడిత కుల వర్గ శ్రేణులు రాజ్యంతో ఒక మేర సామరస్యం ద్వారా (ఎంగేజ్‌మెంట్) ద్వారా తమ సమస్యలు తీరుతాయి అని, నిరంతర సంఘర్షణ (కాన్ఫ్రటేషన్) పెద్దగా ఫలించదు అని భావించడం వల్ల ఈ మద్దతు పోరాటానికి తగ్గింది. దీనితో పాటు రాజ్య యంత్రానికున్న వివిధ తీర్ల నిఘా (సర్వైలెన్స్) సామర్థ్యం పెరగడం కూడా సాయుధ రహస్య ఉద్యమానికి మద్దతు తగ్గింది. ఎంగేజ్‌మెంట్ మార్గం ద్వారా పీడిత కుల, వర్గ శ్రేణుల జీవితాల్లో ఎటువంటి సానుకూల మార్పు వచ్చింది అనేది ఇంకా శాస్త్రీయ సామాజిక ఆర్థిక విశ్లేషణ చేయవలిసి ఉన్నది. ముఖ్యంగా సాయుధ రహస్యోద్యమం ద్వారా మాత్రమే సానుకూల మార్పు సాధ్యం అని భావించే వారు కొంత నిష్పాక్షికంగా అధ్యయనం చేయవలిసి ఉన్నది. ఈ స్థితిలో కొన్ని పరిణామాలు మాత్రం నిశ్చయంగా జరిగాయి. ఒకటి అది పోలీసుల

శక్తి విపరీతంగా పెరిగింది (అంటే వారి విచారణ, నేర నిరోధ సామర్థ్యం, చట్టబద్ధ వ్యవహారం పెరిగిందని అర్థం కాదు) సామాన్యుల నిత్య జీవన వ్యవహారాల్లో దీని ప్రభావం చాలా ఉన్నది. రాజ్యంతో ఎంగేజ్‌మెంట్ మార్గంలో పయనించిన, పయనిస్తున్న వారిలో పెద్ద భాగం తమ వ్యక్తిగత శక్తిని పెంచుకునే నూతన పైరవీకారు సెక్షన్‌గా రూపొందినారు. వ్యవస్థీకృత హింస రూపాలు పనితీరు విస్తరిస్తూ ఉన్నాయి.

**వ్యవస్థీకృత హింస – అప్రజాస్వామ్యం : క్రూరమైన కవలలు**

అధికారం పరిమితులలో ఉండడం అనేది ప్రజాస్వామ్యపు ముఖ్య సూత్రం. వస్తువులు, సేవలు, ఉత్పత్తి చేయడం, పంపిణీ చేయడం, నిర్ణయం తీసుకోవడం, నియంత్రణ చేయడం, చేయూతనందించడం అనే పనులు జరిగే ప్రతిచోటా అధికారం ఉంటుంది. స్థూలంగా రాజ్యం అంటే పాలనా యంత్రాంగమూ, వాణిజ్య వినిమయ వ్యవహారం జరిగే క్షేత్రమైన మార్కెట్టూ, వ్యక్తులూ, కుటుంబాలు, సముదాయాలు గల సమాజమూ అధికార క్షేత్రాలు. వీటిని రాజ్య, ఆర్థిక, సామాజిక వ్యవస్థలు అని అనవచ్చు. స్థూలంగా వ్యవస్థలు ప్రజానుకూలంగా చరాచర ప్రకృతికి ఉండవచ్చు, వాటికి వ్యతిరేకంగా ఉండవచ్చు. ప్రజావ్యతిరేకంగా ఈ వ్యవస్థలలోని అధికారం పనిచేయడమే వ్యవస్థాత్మక హింసగా నిర్వచించ వచ్చు. అపరిమితమైన అధికారంతో పాలనావ్యవస్థ మార్కెట్ కలిసిపోయి, సమాజాన్ని దోపిడీకి అనుకూలమైన విలువలకు అనుకూలంగా మలచడం, అందువల్ల మెజారిటీ ప్రజలకు చరాచర ప్రకృతికి తీరని హాని కలిగించడం అనే రూపంలో ప్రస్తుతం వ్యవస్థాత్మక హింస సాగుతూ ఉన్నది. అది అపరిమిత అధికార రూపంలో అప్రజాస్వామికంగానే ఉంటుంది. అంతర్జాతీయ, జాతీయ, ప్రాంతీయ, స్థానిక స్థాయిల్లో ఈ హింసా అప్రజాస్వామికత పనిచేస్తూ ఉన్నాయి.

వలసపాలన అనంతర సమాజాల్లో పాలనా వ్యవస్థల్లో ప్రభుత్వ యంత్రాంగం పనితీరు, వాణిజ్య వస్తుసేవల వినిమయ క్షేత్రమైన మార్కెట్, సాంస్కృతిక నిర్మాణ నియంత్రణ క్షేత్రమైన సమాజం మూడూ చాలా పకడ్బందీగా హింసను ప్రోత్సహిస్తూ ఉన్నాయి. ఈ మూడు నిర్మాణాల మీద పాత వలసరాజ్యాల పెత్తనం వివిధ రూపాల్లో సాగుతూ ఉంటున్నది. అవి ప్రపంచ ఆధిపత్యాన్ని నెరపే పనిలో నిరంతరం ఉన్నాయి. ఈ మొత్తం వ్యవస్థీకృత హింసగా అంతర్జాతీయ, జాతీయ, ప్రాంతీయ స్థాయిల్లో అమలవుతూ ఉంటుంది. దేశీయ ప్రాంతీయ సందర్భంలో ఈ వ్యవస్థీకృత హింస ద్వారా మేలుపొందే శక్తుల మధ్య మైత్రి ఉంటుంది. సంపద కేంద్రీకరణ, కొత్త కొత్త పద్ధతుల్లో పెత్తందారీ సామాజిక, సాంస్కృతిక సంబంధాలను నిలపడం, వీటికి అవసరమైన రాజకీయ ఆర్థిక వ్యవస్థను ప్రోత్సహించడం అనేవి వ్యవస్థీకృత హింసకు ఉండే లక్ష్యాలూ, సాధనాలూ. ఏది అభివృద్ధి అనే చర్చ, దేశంలోని ప్రతి ఒక్కరికీ, గౌరవప్రదమైన బతుకుదెరువు ఏమిటి అన్న చర్చ ప్రజా స్వామ్యానికి అత్యవసరం. వ్యవస్థీకృత హింస ఈ చర్చలను సాగనివ్వదు.

నియమబద్ధ ప్రజాస్వామ్యం అంటే అనేక రీతుల్లో ఆధిపత్యాన్ని తిరస్కరించడం. స్వేచ్ఛా సమానతలతో కూడిన పరస్పర సహకార సంబంధాలను పెంపుచేసి కాపాడుకోవడం అని అర్థం. వ్యవస్థీకృత హింస కంటికి కనిపించే తీరులోనూ, కనిపించని తీరులోనూ మన నిత్య జీవితాలను ప్రభావితం చేస్తుంది. ఉదాహరణకు మంచిగా నడిచే ప్రభుత్వ స్కూలును, కాలేజీని ఎత్తివేయడం వంటి చర్యలతో మొదలై మైనారిటీ మెజారిటీ మత బృందాల మధ్య ఎడతెగని అవిశ్వాసాన్ని పెంచడం వంటివి. పర్మనెంట్ ఉద్యోగం ఇస్తే మనుషులు నిజాయితీతో పని చేయరు అనే విలువను జనం ఆమోదించే విలువగా మార్చడం. మార్కెట్టు సూత్రాల ద్వారా నిర్వహణ అనేదే అన్నిరకాల సమస్యలకు పరిష్కారం అని చెప్పడం వంటివన్నీ వ్యవస్థీకృత హింసలే. అందుకే ఈ హింస(ల)కు వ్యతిరేకమైన ఆలోచన కార్యాచరణ అమలులో ఉండడం అనేది సామాన్యమైన విషయం కాదు అని అర్థం చేసుకోవాలి. అందుకే ఈ హింస మీద కేవలం సాయుధ రహస్య ఉద్యమం ద్వారా విజయం సాధించడం కూడా సులభం కాదు. అది కేవలం అప్పుడప్పుడు చేసే పెద్ద చప్పుడుగా మిగిలిపోయే అప్రాధాన్య స్థితిలోకి జారుకుంటుంది. సాయధ రహస్య ఉద్యమాన్ని నమ్మేవాళ్లు, సమర్థించే వారు ఈ విషయాన్ని ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా ఇది వాస్తవం. విశ్వాసానికి భిన్నంగా వాస్తవం ఉన్న మాట నిజం.

మన నిత్య జీవితంలో మనలను నిరంతరం పీడిస్తున్న సమస్యల పట్ల మనం వ్యక్తులుగానూ బృందాలుగానూ స్పందించే, వాటికి వ్యతిరేకంగా వీలైన పద్ధతుల్లో చేతనైన మేర పనిచేసే స్వభావాన్ని నిరంతరం పెంచుకోవడమే మన ముందున్న మార్గం. మాటలు కోటలు దాటించడం చేస్తూ కాలు కడప దాటించని నిజాయితీలేనితనాన్ని మాని మనం ప్రతినిత్యం హింసను ఎదుర్కొనే చర్చ చర్య అనే జీవన విధానం లోకి మారడం అవసరం. దానివల్ల వచ్చే తాత్కాలిక అసౌకర్యాలను ఎదుర్కొంటూ, చాలా దారుణంగా మనుషులను పీడించే అంశాలను ఎట్టి పరిస్థితిలో మనం సాధారణంగా ఆమోదించే విలువగా (నార్మల్ వాల్యూ) మారకుండా ప్రయత్నం చేయవలిసి ఉంటుంది.

రాజ్యమూ, సమాజమూ, మార్కెట్ అనే మూడు వ్యవస్థలు అనేక రూపాల్లో శక్తిమంతుల ఆధిపత్యాన్ని కొనసాగించే వ్యూహాలతో సాగుతున్నప్పుడు ఆ వ్యూహాలు నగరంలో, గ్రామంలో అడవిలో వివిధ పద్ధతుల్లో అమలు అవుతున్నప్పుడు మనం ఏమి చేయాలి? అన్న ప్రశ్నను నిరంతరం వేసుకోవడం, సమాధానాలను, సమష్టి చింతన ఆచరణలో వెతుక్కోవడం తప్ప నియమ బద్ధ ప్రజాస్వామ్యాన్ని నిలుపుకునే మార్గం మరొకటి లేదు. మనకు ఎటువంటి పాలనా వ్యవస్థ ఉండాలి, మనం ఎటువంటి విలువలు గల సమాజాన్ని నిర్మించుకొని కాపాడుకోవాలి? మనకు ఎటువంటి మార్కెట్టు వ్యవస్థ ఉండాలి? అనే విషయాలు నిరంతరం ప్రతి తరం చర్చించుకుంటూ అందుకు ఆచరణకు పూనుకునే స్థితి మాత్రమే వ్యవస్థాత్మక హింసను కట్టడి చేయగలదు. ఇటువంటి చర్చ ఏదీ జరగనివ్వకుండా చూడడం, అలాంటి యత్నాలను మొదట్లోనే రూపుమాపడం అనే వ్యూహాలతో వ్యవస్థాత్మక హింసావాద యంత్రం పనిచేస్తుంది. అందుకే అటువంటి హింసకు వ్యతిరేకమైన చింతన, ఆచరణల కలయిక పోరాటమై నిత్య జీవితంలో భాగం కానంత కాలం విముక్తికి అవకాశం చాల తక్కువ అని గుర్తించాలి.

ఏది ఏమైనా ప్రతి పనిలో స్వంత లాభం ఏమిటి అని ఆలోచించి, దాన్ని నేర్పుగా సాధించుకోవడమే వ్యక్తిత్వ వికాసమైన స్థితిలో, అది విశాల జనామోదం పొందుతున్న కాలంలో కేవలం తమ స్వంత తృప్తి కోసం కాక పీడిత ప్రజల పక్షాన నిలబడే వారి నిజాయితీని పూర్తి తప్పుబట్టడం కష్టం. అట్లాంటి వారు దశాబ్దాలుగా మరణిస్తూ ఉండటమూ

కలత పెట్టే అంశమే. పారిన రక్తానికీ సాధించిన మార్పుకూ మధ్య లేని పొంతన ఒక సమస్యనే. స్వాతంత్ర్యానికి ముందూ తరువాతా, అటువంటి త్యాగాలు ఒకమేర ప్రభావితం చేయడం ద్వారా రూపొందిన ప్రజాస్వామిక చట్టాలు కూడా అమలు కాని అప్రజాస్వామిక స్థితి భయం పుట్టిస్తుంది. మనం వ్యవస్థీకృత హింసపట్ల భయం వల్లనో, నిస్సహాయత వల్లనో, ఆ హింసలో/తో మన ప్రయోజనాలు నడిచి పోతున్నాయి అనో, చల్సేదో అనుకునే స్థితి ఉన్నంతసేపు ఏదో ఒక మూల సాయుధ వామపక్ష రహస్యోద్యమం అది ఎంత అశక్తమైనదీ, పెద్దగా సానుకూల ఫలితాలు సాధించలేనిదీ అయినా ఒక మేర పీడిత సముదాయాలలోని వారికీ, వ్యవస్థాపరంగా జరుగుతున్న అన్యాయాన్ని సహించని వారికీ ఒక ఆకర్షణీయమైన పోరాట మార్గంగా కనిపించడాన్ని మాత్రం అసంబద్ధం అనలేం.

వ్యవస్థీకృత హింసను మనం వ్యక్తుల స్థాయిలో, కుటుంబాల స్థాయిలో, బృందాల, కులాల లేదా ఇతర సాంస్కృతిక సముదాయాల స్థాయిలో గుర్తించి తీరాలి. అట్లనే వాటికి బయట ఉన్న (వాటితో బలంగా సంబంధం గల) సామజిక-సాంస్కృతిక, ఆర్థిక, రాజ్య సంబంధ నిర్మాణాల పనితీరులో నిరంతరం గుర్తించడం, ఎదుర్కోవడం చేయవలిసి ఉంటుంది. ఎందుకంటే ఆ హింస మూలాలు మన ఆలోచనల్లో, ప్రవర్తనల్లో మన చుట్టూ ఉన్నవ్యవస్థల పనితీరులో ఉన్నవి అని గుర్తించాలి. ఆడపిల్లను మనిషిగా గుర్తించకపోవడం, పక్కవాడిని కులం పేరనో, మతం పేరనో చిన్న చూపు చూడడం, సంపాదన పరులవుతున్న వారి అడుగులకు మడుగులొత్తడం వంటి వాటితో మొదలుకొని చిన్ని పొట్టకు రక్షణ అనుకుని ఎవడికి ఏమయితేనేమి నేను బాగుంటే చాలుననే చింతననే వ్యవస్థీకృత హింసకు ఊతమిస్తుందని గుర్తించడం అవసరం.

బాధ్యతా రహితమైన, అవినీతి కరమైన ప్రభుత్వ పాలన, మనుషుల మధ్య, బృందాల మధ్య దూరాన్ని పెంచే, లింగ, కుల, వర్గ అసమానతనూ స్వేచ్ఛ లేమినీ పెంచే సామాజిక విలువలూ ఆచరణలూ, ప్రతి జీవన రంగాన్ని డబ్బుతో తూకం కట్టగలం అని భావించే అవినీతికర మార్కెట్ విలువల అతివ్యాప్తి ఇవన్నీ, నిరంతరం హింసను పెంచే వ్యవస్థాత్మక అంశాలే. ఇటువంటి వాతావరణంలో నియమబద్ధ ప్రజాస్వామ్యం బతికి బట్టకట్టదని గుర్తించడం ప్రస్తుత అత్యవసరం. నిత్య జీవితంలో అన్యాయాన్ని గుర్తించి వ్యతిరేకించే కార్యాచరణ విస్తృత స్థాయిలో నిరంతరం సాగడం మన అవసరం.

### వ్యవస్థీకృత హింసకు వ్యతిరేకంగా పోరాటం

ఇక్కడొక ముఖ్య విషయం గమనించడం అవసరం. వ్యవస్థీకృత హింస దుర్మార్గపు అమానవీయమైన విలువలను విపరీతమైన ఖర్చుతో ప్రచారం చేస్తూ అమలులో ఉంచుతుంది. తలకిందుల విలువలను సక్రమమైనవి అని నమ్మించేందుకు అది సాయధ హింస, భయాన్ని పెంపొందించడం, అభద్రతను పెంచడం, అబద్ధాలను అందంగా ప్రచారం ప్రసారం చెయ్యడం అనే విధానాలను ఎంచుకుంటుంది. అబద్దాలను, అనారోగ్యకర విలువలను, అసహజ, అమానుష ప్రవర్తనను గొప్పవని చెప్పేందుకు ఆర్థిక, బౌద్ధిక, సహజ వనరులను దుర్వినియోగం చేస్తుంది. ఉదాహరణకు ఒక మనిషి తన నిత్య జీవితంలో ఎనిమిది గంటలు సౌకర్యవంతమైన విశ్రాంతి (వ్యాయామంతో కూడి) ఉంటే ఆ మనిషి ఆరోగ్యమూ, ఉత్పాదకత పెరుగుతాయి అన్న సూత్రం సహజ సూత్రం. కాగా, వ్యవస్థాగత హింసావాదులు మనిషి నాలుగు గంటలు పడుకున్నా ఉత్సాహంగా పని చేయగలడు అన్న అభిప్రాయాన్ని బలంగా ఆకర్షణీయమైన తీరుల్లో ప్రచారం చేస్తారు. అబద్ధాలను నిజాలని ప్రచారం చేయడానికి పెట్టె ఖర్చులో పావుకంటే సగం ఖర్చుతో ఆ దుష్ప్రచారాన్ని అడ్డుకోవచ్చు, ఓడించవచ్చు.

వ్యవస్థీకృత హింసను క్రియాశీలమైన, చైతన్యయుతమైన స్థానిక సృజనాత్మక ప్రయత్నాల ద్వారా ఎదుర్కో వచ్చును. వ్యక్తుల స్థాయిలో బృందాల స్థాయిలో కొంత ఓర్పు, నేర్పు కలిగి ఉంటే క్రమపద్ధతిలో వ్యవస్థ పుట్టించే హింసను ఎదుర్కోవడం సాధ్యమే. ఈ ఎదుర్కొనే పోరులో కష్టం ఉండదని కాదు, కానీ ఆ కష్టానికి మంచి ఫలితం ఉంటుంది. ఇట్లా హింసను నిత్య జీవితంలో స్థానిక స్థాయిలో ఎదుర్కొంటున్నప్పుడే ఈ వ్యవస్థాత్మక హింసకు గల విస్తారమైన లింకులూ, ప్రాంతీయ, జాతీయ అంతర్జాతీయ స్థాయిల్లో అవి ఏ రీతిలో పనిచేస్తాయో తెలుసుకునే తెలివిడి పెరుగుతుంది. ఆయా స్థాయిలలో ఈ దుర్మార్గానికి వ్యతిరేకంగా పనిచేస్తున్న మనుషుల, బృందాల పనితీరు తెలుస్తుంది. ఆ రకంగా అన్యాయమైన కార్యాచరణకు వ్యతిరేకంగా నిత్య జీవితపు ఆచరణగా పోరాటాన్ని రూపు దిద్దుకునే వీలుంటుంది. అంతర్జాతీయ, జాతీయ, ప్రాంతీయ పరిస్థితుల పట్ల అవగాహన గల స్థానిక, సృజనాత్మక వికేంద్రీకృత కార్యాచరణ ద్వారా మాత్రమే వ్యవస్థాత్మక హింసను ఎదుర్కోగలం.

వ్యవస్థీకృత హింసనూ, దానిని పెంపొందించే అప్రజాస్వామిక వ్యవస్థను మనం ప్రాణహాని లేని, లేక తక్కువ ప్రాణహాని ఉండే ప్రయత్నాల ద్వారా లేక ప్రజాస్వామికంగా మార్చుకోగలమా? అన్న కీలకమైన తప్పించుకోలేని ప్రశ్న ఇటువంటి మరణాలు సంభవించిన ప్రతిసారీ ముందుకొస్తుంది. ఈ ప్రశ్నను ఎదుర్కొని దానికి సమాధానం ఎదుర్కునే పయనమే ప్రజాస్వామిక జీవితాన్ని నిలిపే పోరాటమనీ, దాన్ని నిత్యజీవితంలోకి తెచ్చుకోవడం అవసరమనీ మనం గుర్తించాలని ఈ రకమైన మరణాలు మనలను మళ్లీ మళ్లీ కోరుతున్నాయి అని గుర్తించడం అత్యవసరం.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్ ఇన్ పొలిటికల్ సైన్స్, నల్సార్ యూనివర్సిటీ ఆఫ్ లా, హైదరాబాద్)* వీ

***రచయితలకు సూచన :*** *తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 20వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు. మరొక పత్రికకు పంపిన, మరొక పత్రిక పరిశీలనలో ఉన్న, మరొక పత్రిక ప్రచురణకు ఆమోదించిన రచనను వీక్షణంకు పంపగూడదు. - సం.*

# ముస్లిం మహిళలు - తలాక్

***ముస్లిం సమాజంలో పురుషులు మూడుసార్లు తలాక్ చెప్పి విడాకులు తీసుకునే అనాగరిక పద్ధతులనే అవలంబిస్తున్నారనీ, మహిళలు చైతన్యంతో దానికి వ్యతిరేకంగా ఉద్యమిస్తున్నారనీ అంటున్నారు* చిమ్మె జాన్ బర్నబాస్**

ఉర్దూలో 'తలాక్' అన్న పదానికి 'విడిపోవడం' అనే అర్థం. ఇస్లాం మత సూత్రాల ప్రకారం భర్త మూడు సార్లు తలాక్, తలాక్, తలాక్ అని ఉచ్ఛరిస్తే, సునాయాసంగా భార్యకు విడాకులు ఇవ్వవచ్చు. ఒకవేళ ఆమెనే తిరిగి వివాహం చేసుకోదలిస్తే, ఆ స్త్రీ మరొక పురుషుడిని వివాహం చేసుకొని ఉంటే, అతని నుంచి విడాకులు పొంది తిరిగి తన మొదటి భర్త దగ్గరికి చేరుకోవచ్చు. తలాక్ విషయంలో ముస్లింలలోని ప్రధాన వర్గాలైన షియా, సున్నీల విషయంలో చిన్ని చిన్న తేడాలున్నప్పటికీ, మౌలిక అంశంపై దాదాపుగా ఒక్కటే అభిప్రాయముంది.

తలాక్ సాంప్రదాయానికి వ్యతిరేకంగా, ముస్లిం మతంలోని ఒక మహిళా వర్గం పోరాటానికి సన్నద్ధమైంది. తలాక్ సాంప్రదాయం ఇస్లాం మతంలోని స్త్రీలపై పురుషులకు పూర్తి అధికారాలను అప్పజెప్పుతున్నదని, పురుషులు ఏకపక్షంగా వ్యవహరిస్తూ, తమ భార్యలకు ఏ క్షణమైనా విడాకులు ఇచ్చేందుకు అవకాశం కల్పిస్తున్నదని, ఈ పద్ధతి లింగ వివక్షకు అద్దం పడుతున్నదని, తమను కట్టు బానిసలుగా తయారు చేస్తున్న ఈ పద్ధతిని రూపుమాపాలని ముస్లిం స్త్రీలు ఉద్యమం చేపట్టారు.

భారతదేశపు ముస్లిం సమాజంలో అమలులో ఉన్న తలాక్ పద్ధతి కారణంగా మహిళలు ఎప్పుడు తమ భర్తలు తమకు విడాకులు ఇచ్చి వదిలించుకుంటారోననే భయంతో బిక్కు బిక్కు మంటూ బతకాల్సిన దౌర్భాగ్య పరిస్థితులు తలెత్తాయి. ప్రస్తుత ఎలక్ట్రానిక్ యుగంలో ఎస్ఎంఎస్‌ల ద్వారా, ఈ మెయిల్ ద్వారా కూడా విడాకులు ఇచ్చేస్తున్నారు. ఇంత విచారకరమైన పరిస్థితిలు ముస్లిం వివాహ విధానంలో ఉన్నాయనీ, ఇటీవలే కొంత మంది ముస్లిం మహిళా సంఘాలు దీనిని ప్రపంచం ముందుకు పెట్టి, ఖండిస్తూ, ఉద్యమాలు చేపడుతున్నారు. ఈ పద్ధతి మారాలని కొరుకుంటున్నారు. ఇది ఒక రకంగా పురోగమనమే.

ఇస్లామిక్ దేశాలుగా పేరుబడ్డ పాకిస్తాన్, బంగ్లాదేశ్ సహా అనేక ముస్లిం దేశాలలో 'తలాక్-ఉల్-బిదత్' మూడు సార్లు తలాక్ శబ్దాన్ని ఉచ్ఛరించి, విడాకులు ఇచ్చే పద్ధతిని నిషేధించినప్పుడు, లౌకిక రాజ్యమైన భారతదేశంలో ఈ పద్ధతిని ఎందుకు కొనసాగిస్తున్నారని ముస్లిం మహిళలు ప్రశ్నిస్తున్నారు.

'భారతీయ ముస్లిం మహిళా ఆందోళన్' అనే ఒక సంస్థ జాతీయ స్థాయిలో జరిపిన ఒక సర్వే ప్రకారం ప్రతి 11 మంది ముస్లిం మహిళలలో ఒకరు తలాక్ బాధితురాలే. వీరిలో అధిక శాతం మందికి 'భరణం' కూడా అందడం లేదు. దేశంలో ఉన్న చట్టాలు, వ్యవస్థలను కాదని, తలాక్ ద్వారా విడాకులు ఇచ్చేయడం వల్ల ఈ మహిళలకు అందాల్సిన భరణం అందడం లేదు. భారతదేశ ముస్లిం మహిళలు ఈ దేశ చట్టాల ద్వారా విడాకులు కోరుతున్నారు. వీరు భరణం కోసమే కోర్టును ఆశ్రయిస్తున్నారనుకోవడం పొరపాటు. తాము మగవారికి బానిసలం కాదని, దశాబ్దాలుగా కాపురం చేసిన తర్వాత అకస్మాత్తుగా వదిలి వేయడానికి తామేమీ ఆటబొమ్మలం కాదని, నిరూపించుకుంటూ, తమ అస్థిత్వాన్ని కాపాడుకునేందుకు ఉద్యమిస్తున్నామని ముస్లిం మహిళలు అంటున్నారు. ముస్లిం మహిళలు తమ ఉద్యమాన్ని 'తలాక్' వరకే పరిమితం చేయలేదు. పురుషులతో తమకూ సమాన స్థాయిని కల్పించాలని, ఖురాన్ చదవడానికి, అర్థం చేసుకోవడానికి మహిళలు అర్హులేనని, 'ఉలేమా' (ముస్లిం మత పెద్దలు)లకు చెప్పాలని వీరు కోరుతున్నారు.

బ్రిటిష్ వారు మన దేశాన్ని పాలించే సమయంలో 'హిందువులు – ముస్లింలు' కలిస్తే తమ అధికారానికి భంగం కలుగుతుందనే దుర్బుద్ధితో ముస్లింలను విడగొట్టి, వారి మత ఆచారాల ప్రకారంగా నడుచుకునేలా ఆమోదించారు. భారతదేశానికి స్వాతంత్రం వచ్చి 70 సంవత్సరాలు అయినప్పటికీ, ముస్లిం మత సాంప్రదాయాల ప్రకారం విడాకుల వ్యవస్థ కొనసాగడం, వారికి రాజ్యాంగ హక్కులు వర్తించకపోవడం, అందుకు వారు ఉద్యమబాట పట్టడం విచారకరం. మొత్తం రాజ్యాంగ వ్యవస్థకే ఇది ఒక సవాలు.

తలాక్ ద్వారా ఆత్మగౌరవంతో పాటు ఆర్థిక సంరక్షణ, సామాజిక గౌరవాన్ని కోల్పోయిన ముస్లిం మహిళలు ఈ పద్ధతిని నిర్మూలించాలని కోరుతూ ఇటీవలే సుప్రీంకోర్టును ఆశ్రయించారు. మొట్టమొదటగా ఉత్తరాఖాండ్‌కు చెందిన 'షయారా బానో' తలాక్ పద్ధతిని రద్దు చేయాలని, మూడు సార్లు తలాక్ చెప్పడం ద్వారా మహిళలకు విడాకులిచ్చే పద్ధతి తిరిగి అదే వ్యక్తితో కలిసి జీవించేందుకు, అప్పటికే కలిసి జీవిస్తున్న వ్యక్తితో విడాకులు పొంది, తిరిగి మళ్లీ మొదటి భర్తతో కలిసి జీవించడానికి అనుమతి ఇవ్వడం, 'బహు భార్యాత్వానికి' దారి తీస్తుంది. ఇది రాజ్యాంగ వ్యతిరేకమని సుప్రీంకోర్టు పేర్కొన్నది. షహారాబానో వేసిన పిటిషన్‌కు మద్దతుగా ఇదే తరహాలో రాజాస్థాన్‌కు చెందిన అఫ్రీన్ రహ్మాన్, పశ్చిమ బెంగాల్‌కు చెందిన ఇషరత్ జహాన్‌లు పిటిషన్‌లను దాఖలు చేశారు. వీరికి మద్దతుగా మూడు ముస్లిం మహిళా సంస్థలు 1) భారతీయ ముస్లిం మహిళా ఆందోళన్, 2) బేబ్యాక్ కలెక్టివ్, 3) ఆల్ ఇండియా ముస్లిం ఉమెన్ పర్సనల్ లా బోర్డ్ సంస్థలు సుప్రీంకోర్టును ఆశ్రయించాయి. సుప్రీంకోర్టు బయట 'ముస్లిం మెన్ ఫర్ జెండర్ జస్టిస్' అనే సంస్థ ప్రధాన నగరాలలో ముస్లిం మహిళా పిటిషనర్లకు మద్దతుగా సంతకాల సేకరణ చేపట్టింది.

ఆత్మగౌరవం, వ్యక్తిత్వం, సామాజిక, ఆర్థిక న్యాయాల కోసం ముస్లిం మహిళలు చేస్తున్న న్యాయ పోరాటాన్ని, పురుష ప్రాధాన్యతతో కూడిన 'ముస్లిం పర్సనల్ లా బోర్డ్' (ఎఐఎంపిఎల్‌బి) పూర్తిగా వ్యతిరేకిస్తున్నది. ఈ బోర్డ్ ముస్లిం మహిళలు సుప్రీంకోర్టులో వేసిన పిటిషన్లను వ్యతిరేకించడమే కాకుండా, తలాక్ పద్ధతిని సమర్థిస్తూ ముస్లిం పర్సనల్ లా లో జోక్యం చేసుకునే అధికారం కోర్టుకు లేదని వాదిస్తున్నది. బాధిత మహిళల న్యాయ పోరాటానికి, రాజకీయ రంగులు అద్దుతూ తలాక్ పద్ధతిని అడ్డుపెట్టుకుని – కేంద్రంలోని నరేంద్రమోడీ ప్రభుత్వం 'యునిఫాం సివిల్ కోడ్' (ఉమ్మడి పౌరస్మృతి) ను అమలు చేయాలని చూస్తున్నదని కొన్ని సంఘాలు కూడా ఆరోపిస్తున్నాయి. భారత రాజ్యాంగంలోని ఆర్టికల్ 44 'ఉమ్మడి పౌరస్మృతి'ని నిర్వచించింది.

భారత రాజ్యాంగంలోని ఆర్టికల్ 25 (మత స్వేచ్ఛ) పైన సుప్రీంకోర్టులో వాదనలు జరిగినప్పుడు ఆల్ ఇండియా ముస్లిం పర్సలన్ లా బోర్డ్ (ఎఐఎంపిఎల్‌బి) బహుభార్యాత్వం, తలాక్ పద్ధతి, ఇస్లాంలో అంతర్భాగమని, వీటిపై ఎవ్వరూ జోక్యం చేసుకోరాదని కూడా స్పష్టం చేసింది. భారత రాజ్యాంగం ప్రకారం భారత పౌరులుగా, రాజ్యాంగ పరిధిలోనే పరిష్కరించుకోవాలి గానీ, మత విషయంలో రాజ్యాంగ వ్యవస్థ అయిన సుప్రీంకోర్టు జోక్యం చేసుకోరాదని కోరడం, మత ఛాందసవాదం, దురహంకారం కాకుండా ఏమవుతుంది? నిజంగా ముస్లిం పర్సనల్ లా బోర్డ్ చేస్తున్న వాదనలో నిజం ఉంటే నేడు అనేక ముస్లిం సంఘాలు కూడా వాటిని వ్యతిరేకిస్తున్నాయి. అదే ముస్లింలలోని మరో తెగ అయిన 'సున్నీ' లలోని సున్నీ –అల్–ఎ–హరిత్ అనే సంస్థ తలాక్ పద్ధతిని నిర్ద్వంద్వంగా వ్యతిరేకిస్తున్నది. అనేక ముస్లిం దేశాలలో సహితం తలాక్ పద్ధతిని చట్ట వ్యతిరేకంగా పరిగణిస్తున్నారు. బహుభార్యాత్వాన్ని కూడా నిషేధించాయి.

ఇస్లామిక్ రాజ్యంగా ఏర్పడిన పాకిస్తాన్‌లో 1961లోనే తలాక్ పద్ధతిని రద్దు చేశారు. అనేక విషయాలలో పాకిస్తాన్‌ను అనుసరిస్తున్న భారతదేశం లోని ముస్లిం సంస్థలు ఈ విషయంలో ఎందుకు అనుకరించడం లేదు? అనగా ముస్లిం పౌర సమాజంపై ఈ మత సంస్థలు తమ పట్టును సడలకుండా ఉండేందుకు ఈ విధంగా ప్రవర్తిస్తున్నట్లు స్పష్టమవుతున్నది. ముస్లిం పర్సనల్ లా బోర్డ్ ముస్లిం సమాజాన్ని తమ గుప్పిట్లో పెట్టుకుని శాసించాలని ప్రయత్నిస్తున్నది. భారతదేశ ముస్లిం మత పెద్దలపై, మత పద్ధతులపై, భారతదేశానికి స్వాతంత్రోద్యమ కాలంలో డా. మౌలానా అబుల్ కలాం ఆజాద్ చేసిన వ్యాఖ్యలు ఈ సందర్భంగా ఉటంకించడం సముచితమని భావిస్తాను 'ముస్లిం మత చరిత్రంతా ముస్లిం మత పెద్దలు చేసిన అనాగరిక, అనాలోచిత చర్యలతో భ్రష్టుపట్టి పోయింది. ప్రతి సమయం, సందర్భంలోనూ మత పెద్దల కారణంగా, ముస్లిం చరిత్ర అనేక అవమానాలకు, అగౌరవాలకు గురి అయింది.'

భారత రాజ్యాంగంలోని ఆర్టికల్ 14, 15లు 'సమానత్వపు హక్కు' గురించి తెలియజేస్తుంది. చట్టం ముందు అందరూ సమానులే అనే సూత్రాన్ని స్పష్టపరుస్తున్నది. ప్రాంతం, వర్గం, లింగం, మత ప్రాతిపదిక వివక్షలకు తావు లేకుండా చూడాలని ఆదేశిస్తున్నది. లౌకిక రాజ్యంగా చెప్పబడుతున్న భారతదేశంలో మత ప్రాతిపదికన కీలక అంశాలను, పద్ధతులను కొనసాగించడం సహించరాని విషయం అంటూ కొంత మంది ముస్లిం మత సంఘాల వారే చెబుతున్నారు.

ఖురాన్ సూత్రాలకు వ్యతిరేకంగా ఉన్న తలాక్ పద్ధతిని ఈజిప్ట్, సూడాన్, జోర్డాన్, సిరియా, ఇరాక్, మొరాకో లాంటి అనేక దేశాలు రద్దు చేశాయి. ముల్లాలు, మౌల్వీల ఆధారంగా నడుస్తున్న భారత ఇస్లాం సాంప్రదాయాలు రాజ్యాంగ బద్ధంగా ఉన్నాయా? రాజ్యాంగానికి అతీతమైనవా? అనే సమస్య సుప్రీంకోర్టు పరిధిలో ఉన్నది. భారత రాజ్యాంగాన్ని గౌరవిస్తూనే, ముస్లిం మత గ్రంథాల ఆధారంగా జీవిస్తామంటూ ఆ మత పెద్దలు చేస్తున్న ఉత్తుత్తి ప్రకటనలు ముస్లిం సగటు పౌరులను వేధిస్తున్నవి. మొత్తం మీద ముస్లిం మహిళలు చేస్తున్న న్యాయ పోరాటం కారణంగా శతాబ్దాలుగా కొనసాగుతున్న ముస్లిం మగ పెత్తనానికి ఒక సవాలుగా పరిణమించింది.

నేడు ప్రపంచ వ్యాప్తంగా, ముస్లిం మహిళలలో సామాజిక చైతన్యం పెరిగింది. ఇస్లాం మత గ్రంథాలను సంపూర్ణంగా అర్థం చేసుకుని, వాటిలోని మౌలిక అంశాలను నేటి పరిస్థితులకు ఆకలింపు చేసుకుని, వాటిలోని అసమానతలను, అనవసర, అప్రజాస్వామిక విషయాలను ప్రశ్నిస్తున్నారు. భారతదేశ రాజ్యాంగ ప్రాథమిక హక్కుల దృక్పథంతో వాటిని చూస్తున్నారు. అంతేకాకుండా అంతర్జాతీయ మానవ హక్కుల ప్రకటన 1948 కోణంలో కూడా స్పృశిస్తున్నారు. కాబట్టి పౌర, ప్రజాస్వామిక హక్కుల దృక్కోణంలో ముస్లిం మహిళల హక్కుల పోరాటానికి మనమంతా సంఘీభావం తెలుపడం నేటి ఆవశ్యకత!

*(రచయిత న్యాయవాది, ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ సంస్థ రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

**వీక్షణం పదిహేనో ఏట అడుగిడుతున్న సందర్భంగా జనవరి 2017 ప్రత్యేక సంచికలో**

- సాంస్కృతిక విప్లవం - వరవరరావు
- బోల్షివిక్ విప్లవానికి 100 ఏళ్లు - బి.ఎస్. రాజు
- భారతదేశ పరిస్థితి - ఎ. నర్సింహారెడ్డి
- ఫాసిజం - మతోన్మాదం - యుద్ధోన్మాదం - బైరెడ్డి సతీష్
- కాపిటల్‌కు 150 ఏళ్లు - ఎన్. వేణుగోపాల్
- వ్యవసాయ సమస్యపై మరోచూపు - ప్రొ. డి. నరసింహారెడ్డి
- భారతీయాంగ్ల నవలల్లో ఉత్పత్తి సంబంధాలు - ప్రొ. జి.ఎన్. సాయిబాబా
- తెలంగాణలో మారుతున్న భూ సంబంధాలు - నలమాస కృష్ణ
- భూసంబంధాలలో మార్పు - ఒక గ్రామ అధ్యయనం - వై. భాస్కర్
- రెండున్నరేళ్ల తెలంగాణ - ఆంధ్రప్రదేశ్ పాలన
- పెద్ద నోట్ల రద్దు - ఒక అడుగు ముందుకు రెండు అడుగులు వెనక్కి - కోబడ్ గాంధీ

నోట్ల రద్దుపై వ్యాసాలు అధికంగా రావడం వల్ల ప్రకటించిన వ్యాసాలు ఈ సంచికలో ప్రచురించలేకపోతున్నాం. రాబోయే సంచికల్లో ప్రచురిస్తాం.

### హోంగార్డ్స్ సమస్యను పట్టించుకోని ప్రభుత్వం

ఉద్యోగ భద్రత, ఇతర సమస్యల పరిష్కారం కోరుతూ గాంధీ ఆస్పత్రి, సచివాలయం వద్ద ఆందోళన నిర్వహించిన హోంగార్డులపై నవంబర్ 1న కేసులు నమోదు చేశారు. సచివాలయం వద్ద నిరసనలకు దిగిన వారిలో నగర ట్రాఫిక్ విభాగానికి చెందిన హోంగార్డులే ఎక్కువగా ఉన్నట్లు గుర్తించారు. వేర్వేరు జోన్లలో 100 మంది హోంగార్డులు గైర్హాజరు అయినట్లు నిర్ధారించి వీరిపై చర్య తీసుకోవాలని అధికార యంత్రాంగం భావిస్తోంది. సమస్యలను మాత్రం పరిష్కరించడం లేదు.

### ఎన్‌కౌంటర్లను వ్యతిరేకిస్తూ నిరసనలు

ఆంధ్రా-ఒడిశా సరిహద్దుల్లో అక్టోబర్ 24న జరిగిన ఎన్‌కౌంటర్, భోపాల్‌లో జరిగిన ఎన్‌కౌంటర్‌లకు వ్యతిరేకంగా రెండు తెలుగు రాష్ట్రాల్లో నిరసర ప్రదర్శనలు కొనసాగాయి. ఎన్‌కౌంటర్లు బూటకమని, ఏఓబి సరిహద్దుల్లో కూబింగ్‌ను నిలిపివేయాలని డిమాండ్ చేస్తూ హైదరాబాద్‌లోని ఎన్‌టిఆర్ భవన్‌ను ప్రజా సంఘాలు ముట్టడించాయి. గుంటూరులోని లాడ్జి సెంటర్‌లో పౌరహక్కుల సంఘం, వివిధ ప్రజా సంఘాలు ధర్నా చేశాయి. కడపలో నిరసన ప్రదర్శనలు జరిగాయి. అక్టోబర్ 31న తెలంగాణ ప్రజాస్వామిక వేదిక హైదరాబాద్‌లోని సోమాజిగూడ ప్రెస్‌క్లబ్‌లో విలేకరుల సమావేశం ఏర్పాటు చేసి ఎన్‌కౌంటర్లను ఖండించింది. మన్యంలోని లక్షల కోట్ల విలువైన ఖనిజ సంపదను బహుళజాతి కంపెనీలకు కట్టబెట్టడం కోసమే పాలకులు ఎన్‌కౌంటర్లకు పాల్పడుతున్నారని, దీంతో అడవుల నుంచి ఆదివాసులను తరిమేయ చూస్తున్నారని ఆరోపించారు. నవంబర్ 10న అఖిల భారత పరిశోధక విద్యార్థుల నిజ నిర్ధారణ బృందం పాడేరులో విలేకరుల సమావేశంలో తన నిజ నిర్ధారణ వివరాలను వెల్లడించింది.

### ప్రత్యేక హోదా కోరుతూ విశాఖలో సభ

ఆంధ్రప్రదేశ్‌కు ప్రత్యేక హోదా కోరుతు విశాఖపట్నంలోని ఇందిరా ప్రియదర్శిని మున్సిపల్ స్టేడియంలో నవంబర్ 6న వైఎస్ఆర్‌సిపి ఆధ్వర్యంలో బహిరంగ సభ నిర్వహించారు. చంద్రబాబు నాయుడు, వెంకయ్య నాయుడులు ఆంధ్రుల ఆత్మగౌరవాన్ని దెబ్బతీస్తున్నారని వైఎస్ జగన్మోహన్‌రెడ్డి విమర్శించారు. జై ఆంధ్ర, విశాఖ స్టీల్ ప్లాంట్ కోసం ఎలాగైతే ఉద్యమం విశాఖ నుంచే ప్రారంభమయ్యాయో 'జై ఆంధ్రప్రదేశ్ ఉద్యమం' విశాఖ నుంచే రావాలని జగన్ పిలుపునిచ్చారు. ప్రత్యేక హోదా వస్తే 100 శాతం ఆదాయపు పన్ను, ఎక్సైజ్ సుంకాలు మినహాయింపులు వచ్చి ఎవరైనా పరిశ్రమలు పెడతారని హోదా రానందునే ఎవరు పెట్టుబడులు పెట్టడం లేదన్నారు. 2019 ఎన్నికల్లో ప్రత్యేక హోదానే రిఫరెండమ్‌గా పెట్టి ఎన్నికలకు వెళతామన్నారు.

### టోకెన్ సమ్మె విజయవంతం

సింగరేణి కాంట్రాక్ట్ కార్మికులందరికీ చట్టబద్ధ బోనస్ చెల్లించాలని, హైపవర్ కమిటీ వేతనాలు అమలుచేయాలని, పర్మినెంట్ చేయాలని కాంట్రాక్ట్ కార్మిక సంఘాల ఐక్యకార్యాచరణ కమిటీ ఆధ్వర్యంలో చేపట్టిన 48 గంటల టోకెన్ సమ్మె నవంబర్ 12న ముగిసింది. సమ్మెలో భాగంగా సింగరేణి కార్యాలయాల ఎదుట ధర్నాలు నిర్వహించారు. యాజమాన్యం, రాష్ట్ర ప్రభుత్వం తమ సమస్యలను పట్టించుకోకుంటే భవిష్యత్తులో పోరాటాలను ఉధృతం చేస్తామని హెచ్చరించారు. కొత్తగూడెం ప్రధాన కార్యాలయం ఎదుట ధర్నా నిర్వహించారు. ఇల్లందులోని ఓపెన్‌కాస్టులో కాంట్రాక్ట్ కార్మికులు సమ్మెలో పాల్గొనడంతో ఓవర్‌బర్డెన్ పనులు నిలిచిపోయాయి. కార్మిక సంఘాల జెఏసి ఆధ్వర్యంలో బెల్లంపల్లి రీజియన్ పరిధిలోని కార్మికులు విధులను బహిష్కరించి ఆందోళనలో పాల్గొని సమ్మెను విజయవంతం చేశారు.

### సోషలిజమే ప్రత్యామ్నాయం

అక్టోబర్ విప్లవానికి నూరేళ్లయిన సందర్భంగా ఎస్‌విఎస్ కళ్యాణ మండపంలో నవంబర్ 6న బహిరంగ సభ జరిగింది. దీనికి ముఖ్య అతిథిగా హాజరైన బివి రాఘవులు సోషలిజం దిశగా భవిష్యత్ తరాలు మార్గం వెతుక్కుని ముందుకు పోయే రోజులు వస్తున్నా యన్నారు. దోపిడి వ్యవస్థను అక్టోబర్ విప్లవం తరిమికొట్టిందని, కార్మికులు పాలన చేయలేరన్నదాన్ని తుడిచి పెట్టిందని అన్నారు. ఈ రోజున్న పెట్టుబడిదారీ విధానాల ఫలితంగా సమాజంలో అసమానతలు పెరిగాయని, సోషలిజం అర్థవంతమైన ప్రగతిని కోరుకుంటుందని అన్నారు.

### సాగునీటి కోసం రైతుల ఆందోళన

ఎండుతున్న మిర్చి పంటకు ఒక్క తడికైనా నీరివ్వాలని కోరుతూ ప్రకాశం జిల్లా ఇంకొల్లు సమీపంలో పాత మద్రాస్ రోడ్డుపై కొణికి వద్ద రైతులు రస్తారోకో చేపట్టారు. మూడు గంటల పాటు రోడ్డును దిగ్బంధించి రాకపోకలను అడ్డుకున్నారు. కౌలు రైతు సంఘం, రైతు సంఘం ఆధ్వర్యంలో నిర్వహించిన ఈ ఆందోళనకు పెద్ద సంఖ్యలో పురుష, మహిళా రైతులు వచ్చారు. ఆందోళన విరమింపచేయడానికి పోలీసులు వాగ్వాదానికి దిగి చివరికి 18 మందిని అరెస్ట్ చేశారు. నీరడిగితే అరెస్ట్ చేస్తారా అంటూ మహిళలు పోలీసులపై ఆగ్రహం వ్యక్తం చేశారు.

### జిఓ 279ని రద్దు చేయాలని ధర్నా

జి.ఓ 279ని రద్దు చేయాలని కోరుతూ మునిసిపల్ వర్కర్స్ అండ్ ఎంప్లాయిస్ ఫెడరేషన్ ఆధ్వర్యంలో గుంటూరులోని డైరెక్టరేట్ ఆఫ్ మునిసిపల్ అడ్మినిస్ట్రేషన్ వద్ద ధర్నా నిర్వహించారు. పారిశుధ్య పనుల్ని బడా బాబులకు అప్పగించేందుకే రాష్ట్ర ప్రభుత్వం జిఓ 279ని విడుదల చేసిందని, ఇది ప్రభుత్వంపై తీవ్ర ఆర్థిక భారాన్ని మోపుతుందని ఫెడరేషన్ రాష్ట్ర కార్యదర్శి అన్నారు. జిఓ 279 రద్దు, 151, 193 జిఓల మేరకు వేతనాలు పెంచాలని, సమాన పనికి సమాన వేతనం ఇవ్వాలని డిమాండ్ చేశారు. ఈ కార్యక్రమానికి రాష్ట్ర వ్యాప్తంగా అన్ని జిల్లాల నుండి కార్మికులు పెద్ద సంఖ్యలో హాజరయ్యారు.

### విమ్స్ ప్రైవేటీకరణను వ్యతిరేకిస్తూ ధర్నా

విమ్స్ ప్రవేటీకరణను వ్యతిరేకిస్తు సిపిఐ(ఎం) విశాఖ నగర కమిటీ ఆధ్వర్యాన నవంబర్ 9న కలెక్టరేట్ ఎదుట ధర్నా నిర్వహించారు. ధర్నానుద్దేశించి వక్తలు ప్రభుత్వం ఎన్నికల్లో ఇచ్చిన హామీ మేరకు విమ్స్‌ను ప్రభుత్వమే నిర్వహించాలన్నారు. రు. 2 కోట్ల విలువచేసే 110 ఎకరాల భూములను ప్రైవేట్ వ్యక్తులకు కట్టబెట్టేందుకు ప్రభుత్వం సిద్ధపడడం దుర్మార్గమన్నారు. పుష్కరాలకు, శంకుస్థాపనలకు వేల కోట్ల రుపాయలు ఖర్చుచేసే చంద్రబాబుకు విమ్స్ కోసం ఏడాదికి రు. 100 కోట్లు ఖర్చు చేయడానికి డబ్బులు లేవా అన్నారు. విమ్స్ ప్రైవేటీకరణ ఆలోచనను విరమించుకోవాలని డిమాండ్ చేశారు.

### అనంతపురంలో జనసేన పార్టీ సభ

అనంతపురంలోని న్యూ టౌన్ జూనియర్ కళాశాల మైదానంలో నవంబర్ 10న ఏర్పాటు చేసిన 'సీమాంధ్ర హక్కుల చైతన్య సభ'లో పవన్‌కళ్యాణ్ ప్రత్యేక హోదా, ప్రాజెక్టుల విషయంలో ప్రజలను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు మోసం చేస్తున్నాయని విమర్శించారు. రాష్ట్రంలో నిర్మిస్తున్న రాజధాని అమరావతి సామాన్యులకా, సంపన్నులకా అని ప్రశ్నించారు. ఉత్తరాంధ్ర, రాయలసీమ అత్యంత వెనుకబడిన ప్రాంతంగా ఉందనీ, రాష్ట్రానికి ఇచ్చిన హామీలు అమలుచేసే వరకు పోరాటం సాగిస్తాననీ అన్నారు. దేశ సంపదను విదేశాలకు దోచిపెడుతున్నారని దీనికి వ్యతిరేకంగా పోరాటం సాగిస్తామన్నారు. వీ

